డిసెంబరు 1974



# భారతి

వ్యవస్థాపకులు:

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

వెల రూపాయిన్నర

# భారతి

మాసపత్రిక



శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938 1972)



డిసెంబరు 1974

సంపుటము : 51 : సంచిక : 12 :

విడిపత్రిక వెల రూపాయిన్నర

II

"మానవత్వం మంచిని ఆరాధిస్తే
త్యాగం దైవత్వాన్నే మించుతుందని"
-చాటి చెప్పే మహత్తర సాంఘిక చిత్రం



కౌముది పిక్చర్స్

# రామయ్య తండ్రి

ఈస్ట్‌మన్ కలర్

నిర్మాత. యం.యస్.రెడ్డి దర్శకత్వం. బి.వి.ప్రసాద్

ఆంధ్ర, సీడెడ్:
విజయా పిక్చర్స్
నైజాం
శ్రీ నేషనల్ ఆర్ట్ పిక్చర్స్,
మైసూర్
సుధా చిత్రా

# విషయానుక్రమణిక

## డిసెంబరు 1974

IV



రాజబాబు సమర్పించు

బాబ్ అండ్ బాబ్ ప్రొడక్షన్స్

# ఎవరికి వారే యమునా తీరే!

స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వం:
**దాసరి నారాయణరావు**

నిర్మాతలు
**డి. కుమార్‌జీ - శ్రీరాజ్**

ఆంధ్ర: రఘురామ ఫిలింస్ (తారకరామ) సీడెడ్. నవభారత్, నైజాం సీతారామ ఫిలింస్ (శ్రీ తారకరామ) THARAKARAMA

# శిల్పవాణి

## శ్రీ బెళ్ళారి శ్రీనివాసమూర్తి

ఏనొక్క కొండశిలనై పూనితినా తొంటి జన్మ, పుణ్య వశమునన్
రాణించి దివ్యకళగా ప్రాణంబులు వోసికొంటి, రసికుల దృష్టిన్.

మును పాషాణముగా శపింపబడి, సొంపుం బెంపు గోల్పోయి, నే
లను ధూళీ విసరంబు జొచ్చిన యహల్యాకాంత, శ్రీరామచం
ద్రుని పాదాంచల మల్లసోకిన పురా రూపంబు గైకొన్న పో
ల్కిని నే శిల్పి స్పృశింప నా తనులతన్ రేకెత్తెనో జీవముల్.

సౌందర్యరాశిగా నను పొందుపరచి, స్త్రీ విలాసమున ప్రేక్షకులన్
డెందములు గలచి యీశ్వరమందిర వాసంబు గూర్చె మాన్యుం డెవడో

నను దీవించి చిరాయురస్తనుచు కన్యాత్వంబు గోల్పోని నా
తను లావణ్యము జూచి, యద్భుత రసాంతర్లీనులై యెందఱో
ప్రణతుల్ సల్పిరి శిల్పివర్యునకు, నా భాగ్యంబు పండెన్ చిరం
తన సేవాపరితృప్తి తుల్యవిభుప్రోద్యద్రాజ్య సౌఖ్యోన్నతిన్.

కాలము మారి యమర్షాకాలుష్యము పెరిగి సమరకాంక్షా దుష్ట
వ్యాళ భయంకరమై దేశాలకు ముప్పొదవె విమతజాతులు పెరిగెన్

లేడయ్యెన్ బ్రదుకాస గోల్పడిన శిల్పి బ్రహ్మ, రాసిక్యమే
పాడయ్యెన్ ననుబోటిపై మమత ద్రెవ్వన్ రక్కసుల్ వోలె వెం
టాడన్ జొచ్చి రకాల కష్టగతి నన్నంతంతలన్ దూల్చి ర
య్యో! డెందంబును వ్రక్కలించెడిని ద్రోహుల్ సేయు దుష్కార్యముల్.

అలవృంతచ్యుతి గన్న నా యసువు శిల్పాచార్య కీర్తి ప్రతి
ష్ఠల చిహ్నంబుగ నిల్చె; నిర్మలకళా సౌరభ్యముల్ జిమ్మ రా
యలసీమన్ నిరుపేద సైరము క్షుధాయాసంబు సైరించు న
జ్జ్వల భావాంబరవీథి నిశ్చల తపశ్చర్యా విలీనాత్మడై.

తరముల్ దాటె విశాల నేత్రగత సౌందర్యంబు, సంపెంగ క్రొ
వ్విరికిన్ దీటగు నాసికాసరణి రూపే మారినన్, భావనా

సరణిన్ పూర్వ మనోహరత్వము నెదన్ సంధించి పెన్వేదనన్
తరళాశ్రుల్ విరజిమ్మ పోడురు కళాధర్మజ్ఞు లీనాటికిన్.

పరమోత్సాహముతో శివార్చనకు నే ప్రాయంపు టిల్లాలో మం
దిరమున్ జొచ్చి త్రొళంగిపోవుచు, నరున్ వీక్షించి నా ముద్దువా
తెఱ లేనవ్వు తుఱంగలింప గని భ్రాంతిన్ చేతనత్వంపు సుం
దరిగా నెంచి కవుంగిలించికొను హృద్యత్సోదరీ భావనన్.

తన సర్వస్వము ధారవోసి విమలాత్మన్ నన్ను సృష్టించి తి
య్యని నాయాకృతి తాన జూచికొని యొయ్యన్ జొక్కెనో ప్రేమ, చ
క్కని హస్తంబు చెమర్చెనో ప్రణయ ముగ్ధంబైన భావంబు లూ
చిన—తచ్ఛిల్పిని నామస్సుమమునన్ సేవింతు శోకార్తనై.

ధ్యాన మొనర్తు దివ్యపరతత్త్వములో మది నిల్పి కృష్ణ భూ
జాని యశశ్శరీరము ప్రజాతతి సంస్తుతి సేయ శిల్ప వి
ద్యా నిపుణత్వ మాంధ్ర వసుధాస్థలి వెన్నెలగాయ తాము తా
మైనను గాంచు ప్రాంధ్రజను లశ్రులు కాన్క లొసంగిపోవగన్.

ధ్యాన మొనర్తు నాంధ్ర వసుధాస్థలి రాయలసీమలోన నా
ప్రాణ సుమంబు పూరముగ రాలి మలీమస మృత్తికాతతిన్
తానొక రేణువై నిలుచుదాక—మహోగ్రతపోఽగ్ని పావన
స్నాన మొనర్తు చిత్తజలజంబున భక్తిమరంద మోడ్చెదన్.

ఏ నొక భిన్నశిల్పమయి యిచ్చటనే చిరకాల మొంటినై
వానకు నాని యెండలకు వందురి, *రాయలసీమ తొంటి చం
దాన మహోన్నత స్థితికి దాల్కొను స్వప్నములందు దేలి నా
లోన, లయింతునేనె తుదిలో పరతత్త్వము మేలుకొల్పగన్.

ఏనుదపింతు నిచ్చట మదీప్సిత మెల్ల ఫలించుదాక నా
పూనిన దీక్ష యెన్నటికి బోదు—మధూత్సవవేళ బొంగి గ్రీ
ష్మానల మోర్చి, వర్షజలసంతతి దోగి, శరన్మనోజ్ఞతా
శ్రీ నవకంబుతో మురిసి—చింతిలెదన్ హిమశైశిరార్తిలో—

శివశివ, నీ కటాక్షరుచి జిక్కిన నా హృదయ ప్రసూన మ
ల్లి విరిసి ప్రత్యురావిభవలాలితమై నవశోభలీను, కా
ల వశత నా మనోవ్యథ పలాయనమైచను; నీదు సన్నిధిన్
దవిలిన జీవికిన్ మఱపునన్ బడిపోవు సమస్త బంధముల్.

(* రాయలసీమ 'యావదాంధ్ర వసుంధర' అనే నా భావన. సంకుచితంగా నాల్గు జిల్లాల ప్రదేశం కాదు.)

# విజయనగర చరిత్ర

## [ రెండవ భాగము ]

### డా. నేలటూరు వేంకటరమణయ్య

(గత సంచిక తరువాయి)

రామరాజు సదాశివరాయలను విజయనగర వజ్ర సింహాసనముపై నధిష్ఠితుని జేసిన వెంటనే దక్షిణ భారత ద్రావిడ రాజ్యములపైన నొక దండయాత్ర నంపవలసి వచ్చినది. సదాశివదేవరాయల పట్టాభిషేకము క్రీ. శ. 1543 మధ్య జరిగినది. అప్పుడు కేరళ ప్రాంతమున మతబోధన జేయుచుండిన రోమన్ క్యాథలిక్ మత ప్రచారకుడు సెయింట్ ఫ్రాన్సిస్ జేవియరు క్రీ. శ. 1544 జూను తే 16 దీ నాడు వ్రాసిన యుత్తరములో బడగ (అనఁగా విజయనగర) దండయాత్రికుల యాగమము వలన నిజనివాసములను త్యజించి యచటికి గాందిశీకులు బెక్కండ్రు పాఱివచ్చుచుండిరని చెప్పియున్నాడు; కావున నీ దండయాత్ర సదాశివదేవరాయల పట్టాభిషేక మహోత్సవమైన పిమ్మట నతి స్వల్ప కాలముననే విజయనగరమునుండి బయలుదేరి యుండ వలయును. ఈ దండయాత్రకు గారణములు మూడని యాధునిక చరిత్రకారులు వివరించియున్నారు. (1) తిరువాంకూరు ప్రభువుయొక్క విజృంభణము. ఇతని పేరు ఇన్‌క్వితిబిరవ్ అని పోర్చుగీసు మిషనరీల వ్రాతలలోగలదు. ఇది యే హిందూ నామముయొక్క భ్రష్ట రూపమో తెలియరాకున్నది. ఉదయ మార్తాండవర్మయని యొకరును, వీరకేరళ వర్మయని యొకరును, ఉణ్ణి కేరళవర్మయని మఱియొకరును చరిత్రకారు లూహించు చున్నారు. (2) రోమన్ క్యాథలిక్ మిషనరీల దుండుగ ములు. (3) పోర్చుగీసు అధికారుల దేవాలయ తస్కరణోద్యమము. ఈ మూడు కారణముల వలన దక్షిణ ద్రావిడదేశమున రాయల యధికారమునకు ప్రతిఘటనము గల్గెను; శత్రుల నిర్జించి రాయల యధికారమును పునఃప్రతిష్ఠించుటకొఱకె రామరాజు దండయాత్ర జేయవలసి వచ్చెనని చరిత్రకారుల యభిప్రాయము. అప్పటి దక్షిణ ద్రావిడ రాజకీయ పరిస్థితులను జక్కగ నవగాహనము జేసికొనుటకు బై మూడు విషయముల వివరణము గొంత యవసర మగుచున్నది. ఆనాడు కొల మునకును బుణ్యకాయలు నకును మధ్యనుండు రాష్ట్రము స్వరూపములను పేరబఱగు చిన్న సంస్థానము లైదింటి యేలుబడి క్రిందనుండినవి. ఇవియే సమకాలిక శాసనములందును నాంధ్ర వాఙ్మయమునను తిరువడులనియు సమష్టిని పంచ తిరువడులు లేక తిరుపతులనియు బేర్కొనబడి యున్నవి. ఇవి యెవ్వి యనగా (1) చిరవాయి; ఇదియే తరువాతి తిరువాన్కూరు రాజ్యము. (2) తిరుప్పాపూ రను నామాంతరము గల యత్తింగలు, (3) జయ తంగనాడను నపరనామధేయము గల కల్లిక, (4) పోకత్తూరి, (5) కన్నుమ్మెల్ ఇలయితము— వీని సరి హద్దులు సుస్థిరములుగాక కాలానుగుణ్యముగ మారు చుండెడివి.

తిరువాంకూరు ప్రభువగు నింక్వితిచిరిన్ శక్తిసామర్థ్యములు గల రాజు — రాజ్యాధిపత్యము వహించిన దాది యతడు దనరాజ్య వైశాల్యమును బెంపొందించుటకు సమకట్టి సమయమనుకూల మైనప్పు డిరుగుపొరుగు రాజ్యములపై దాడిసేయుచు వచ్చినంతవఱకు వారి భూముల నాక్రమించుకొను చుండువాడు. క్రీ. శ. 1543 లో నఁనగా విజయ నగరమున సదాశివదేవరాయల రాజ్యాభిషేక సమయమున కన్యాకుమారి రాజు మృతినందగా దరుణ వయస్కు డైన యతని పుత్రుడు రాజ్యాభిషిక్తుడాయెను. అదియే యతని కోరికె నీడేర్చుకొనుటకు దగిన తఱి యనియెంచి ఇంక్వితిచిరిన్ కన్యాకుమారి రాజ్య ముపై నెత్తిపోయి క్రొత్తగా పట్టాభిషిక్తు

డైన రాజును నతని తల్లినిబట్టి బందీకృతులను గావించి వారి రాజ్యమున దాను కోరిన భాగమును దనకిచ్చి వేసినగాని చెఱనుండి విడువనని యుగ్గడించెను. కాని కన్యాకుమారి రా జందులకు సమ్మతించక యప్పుడు ఫిషరీ తీరప్రాంతమున క్రైస్తవ మతము నుపదేశించుచు నచటి పరవలను జాలరి ప్రజలను క్రైస్తవ మతమున గలుపుకొనుచుండిన సెయింటు ఫ్రాన్సిసు జేవియరుకు గోవా పోర్చుగీసు పాలకుని సాయమును దనకు సమ కూర్చి పెట్టమని యర్థించుచు రహస్యముగ లేఖను వ్రాసి పంపెను. అట్లే యప్పుడు తిరునెల్వేలి మండ లములోని తూత్తుకుడి కాయత్తారు ప్రాంతములను బాలించుచుండిన బెట్టుపెరుమాళ్లను దనకు దోడ్పడ మని ప్రార్థించుచు మఱియొక లేఖ నంపెను. కన్యా కుమారి రాజు సెయింటు ఫ్రాన్సిసు జేవియరుకు గోవా పోర్చుగీసు పాలకుని సాయమును సమకూర్చి పెట్ట వలయునని రహస్య లేఖనంపినాడని యెట్లో గ్రహించి ఇంక్విజిషన్ గోవా పాలకుని సహాయమును దనకే సిద్ధించునట్లు చేయవలయుననియు గన్యాకుమారి రాజునకు వలదనియు నొక యుత్తరము వ్రాసి యంపెను. జేవియ రీ యుత్తరములను రెంటిని గోవా పాలకునికంపి యతని ప్రత్యుత్తరమున కెదురుచూచు చుండెను.

దక్షిణ ద్రావిడ రాజకీయ పరిస్థితు లిట్లుండ చోళమండల తీరదేశమందు రోమన్ క్యాథలిక్ క్రైస్తవ మిషనరీల మతప్రచారకృత్యముల వలన రాయల యాధి పత్యమునకును హిందూ ధర్మమునకును భంగపాటు గల్గు నట్లేర్పడెను. క్రైస్తవ మిషనరీ లచటి ప్రజలను ముఖ్యముగ పరవ జాలరీండ్రను దమ మతమున గలుపు కొనుటయేకాక యట్లు క్రైస్తవమతము నవలంబించిన వారి కధిపతి రాయలు గాడనియు బోర్చుగీసు రాజే ననియు బాహాటముగ బ్రకటించుచుండిరి. మఱియు నచటి హిందూ దేవతాయతనములను బాడుచేసి వాని స్థానమున బాదిరిగుళ్లు కట్టించుచుండిరి. ఫ్రాన్సిస్కన్ సంప్రదాయమునకు జెందిన క్రైస్తవ సన్యాసులు కొందఱు మద్రాసు శాంథోమిని నాగ పట్టణమును నెలవడులు జేసికొని తత్పరిసరములందు పెక్కు హిందూ విగ్రహము ను ఛిన్నాభిన్నమొనర్చి దేవాలయములను ధ్వంసముజేయుచు వాని స్థానమున పాదిరిగుళ్లను గట్టుచుండిరి. అట్లు విధ్వస్తమైన దేవతాయతనములలో నాగపట్టణములో రంగనాథుని దేవాలయమొక్కటి; తత్స్థానముననే గావలయు క్రీ. శ. 1542 లో రెండు పాదిరిగుళ్లను గట్టిరి; మఱియు మూడువేల హిందువుల నొక్కుమ్మడి క్రైస్తవమతమున గలుపుకొనిరి. ఈ దుండగములు చాలన ట్లప్పుడు గోవా ముఖ్యస్థానము పోర్చుగీసు రాజు పక్షమున పరతంత్రమునందతని యేలుబడికి జెల్లు చుండిన రాష్ట్రమును బాలించుచుండిన డిసౌజా యను నధికారి కాంచీపురము మున్నగు పుణ్యస్థలము లందుండిన ధనసంపన్నములయిన హిందూదేవాలయ ములపై దాడిచేసి దోచుకొనుటకు బన్నాగములను బన్నుచుండెను. హిందూధర్మ సంరక్షణకొఱకు స్థాపింపబడిన హిందూరాజ్య రమానాథుడైన రాయ లకు బోర్చుగీసు క్రైస్తవమత ప్రచారకుల దుండగము మాన్పి హిందూదేవాలయములను సంరక్షించి ప్రజలను మిషనరీల బారిని బడనీయక కాపాడుట యావశ్యక మాయెను. మఱియు దుండీర చోళమండలముల నాయకులు గొందఱు రామరాజుయొక్క యాధి పత్యము నంగీకరింపక ప్రతిఘటించిరి. తన యధి కారము నిలబెట్టుకొనవలయునన్న వారి నణగగొట్టి వశవర్తులుగ జేసికొనవలసి యుండెను. కావున రామ రాజు సదాశివరాయల పట్టాభిషేక మహోత్సవము ముగిసిన వెంటనే సేనలను సమకూర్చి తన పెద తండ్రియైన రామరాజు తిమ్మరాజు పుత్రుడైన విఠల రాజునకు సేనాధిపత్యమిచ్చి యతనికి బ్రాపుగ నతని యనుజుని చినతిమ్మరాజును సేనాధిపతిగ నియమించి యా యిర్వురను దక్షిణదేశముపై దండయాత్ర సేయ నంపెను.

ఈ దండయాత్రయందు నడచిన యుద్ధ విశేషములను, విజయములను దోనేరు కోనేరు నాథుం డను కవి క్రీ. శ. 1546 లో దా విరచించి పూర్తి గావించిన ద్విపద బాలభాగవతమను గ్రంథమున సంగ్ర హముగ వివరించి యున్నారు. కాని యా యుద్ధ కార్య కలాపమంతయు దత్కృతిపతియైన చినతిమ్మరాజు మూలముననె నడచినట్లు చెప్పియున్నాడు. చినతిమ్మ రాజు విజయనగరమునుండి దండు నడుపుకొనిపోయి చంద్రగిరి దుర్గమును ముట్టడించి కైకొనెను. చంద్రగిరి యాపేరిటి రాజ్య విభాగమునకు ముఖ్య పట్టణము. అప్పు డీ దుర్గమును పాలించుచుండిన

దుర్గాధ్యక్షుడెవ్వడో తెలియదు. ఎవ్వడైననేమి? అతడు రామరాజుయొక్క శత్రుకోటిలోనివాడగుట తెల్లము. అతడు రామరాజుయొక్క అధికారము నంగీకరింపక ప్రతిఘటించుట వల్లనె విఠ్ఠల చినతిమ్మరాజుల దండ యాత్రకు గురియాయెను. చంద్రగిరి దుర్గమును బట్టుకొనిన పిమ్మట వారు తత్పరిసరములనున్న శత్రులనుజెండి వారి యేలుబడి క్రింద రాష్ట్రమును సర్వమును స్వాధీన పఱచుకొనిరి. పిమ్మట నటునుండి బయలువెడలి కొలది కాలమున జోళమండలమున బ్రవేశించిరి. అచట మొట్ట మొదట వీరి దృష్టి నాకరించినది చిదంబర ప్రాంతము నందుండు భువనగిరి దుర్గము. ఈ దుర్గాధిపతి యెవ్వరో తెలియరాదు; కాని యతడును రాయ రాణువ ధాటి కాగజాలక కోటను సమర్పించి శరణాగతుడాయెను. ఆ కోట కైవసమ్మైన పిమ్మట నా యన్నదమ్ము లిర్వురును సముద్రతీరమున దండు నడుపుకొని మార్గమున నడ్డుపడిన ఖలశత్రురాజమృగ శ్రేణి వేటాడుచు బోయి నాగూరు జేరిరి. ఈ నాగూరు నాగపట్టణమునకు సమీపమందుండు మఱియొక చిన్న పట్టణము. ఇప్పటికిని వీనిని రెంటిని జేర్చి నాగూరు నాగపట్టణమనియె ప్రజలు బేర్కొనుచుందురు. ఇచ్చట దుర్మదాంధులను పలువుర నణగిగొట్టి నాగూరును స్వాధీనపఱచుకొని నవమౌక్తికముల నర్ఘ్యకు ద్యాగము జేసిరట. ఈ దుర్మదాంధు లచట మత ప్రచారము జేయుచుండిన పోర్చుగీసు రోమన్‌క్యాథలికు మిషనరీలను వారి ప్రయత్నముల మూలమున క్రైస్తవులయిన పరవ జాలరీండ్రే. వీరి దుండగముల నింతకుముందే వివరించియున్నాడను: వారిని శిక్షించి వా రాక్రమించుకొని యుండిన శ్రీ రంగనాథుని సిరిని కైకొని యా దేవుని కప్పగించి పరక్రైస్తవులు సముద్రమునుండి దేవుకొని వచ్చియుండిన ముత్యములను గొల్లకొట్టి తమ యాత్రి తులకు బంచిపెట్టిరి నాగూరు విజయముతో జోళ మండలము హస్తగతమాయెను. అంతట విఠ్ఠల చినతిమ్మరాజులు నాగూరునుండి బయలువెడలి తన్నరుసు నాటిపైన నడచిరి. ఇప్పటి తంజావూరు తిరుచిరాపల్లి రామనాథపుర జిల్లాలోని కొంత భాగముల కప్పుడు దన్నరుసునాడనుపేరు చెల్లుచుండినది. ఈ మండలమును బాలించుచుండిన మన్నెవారు రాయల యధికారము దిరస్కరించి కప్పము జెల్లింపక తిరుగుబాటు చేసియుండిరి. చినతిమ్మవిఠ్ఠలులా చిన్నచిన్న దొరలను సులభముగ నోడించి వారీయవలసిన కప్పమును సంపూర్ణముగ వసూలు జేసిరి. తన్నరుసునాటి యుద్ధమును జయవంతముగ కొనసాగించి, యచటినుండి దక్షిణము నడచి పాండ్యరాజ్యము సరిహద్దు జేరిరి. అప్పటి పాండ్య రాజ్య మిప్పటి తిరునెల్వేలి మండలము నందిముడి యుండినది. దానికి రాజధాని తెంకాశి. తత్కారణము నచట పాలించుచుండిన పాండ్య వంశజులకు దెంకాశి పాండ్యులనిపేరు. అప్పుడచట రాజ్యము సేయుచుండిన ప్రభువు పేరు తెలియదు. కాని యాతడు దన పొరుగున తూత్తుకుడి కాయుత్తారుల యేలికయ్యైన బెట్టుపెరుమాళ్ల క్రోధమునకు గురియై యతనిచే యుద్ధమున బరాజయుమంది రాజ్యభ్రష్టుడై వచ్చి విఠ్ఠల చినతిమ్మరాజుల శరణుజొచ్చి తన రాజ్యమును దనకు మరల దీసి యీవలయునని ప్రార్థించెను; వారతని కభయమిచ్చి బెట్టుపెరుమాళ్ల రాజ్యముపై నెత్తిపోయి యతని యుద్ధమున బరిభవించి పాండ్యుని యతని రాజ్యమున బునః ప్రతిష్ఠితుని గావించిరి: బెట్టుపెరుమాళ్ల మీద దాడి సేయుచుండగా విఠ్ఠల చినతిమ్మరాజులకు బంచతిరువడులతో గొంత ఘర్షణ కలిగినది. వారతనికి బ్రాపుగవచ్చి రాయరాణువతో బోట్లాడినట్లున్నది. రాయల యాధిపత్యమును ద్రోసిపుచ్చి కప్పము జెల్లింపక నిరాకరించుటయేకాక రాయసేనలపై గత్తి దూయుటవలన వారిని శిక్షించుట యత్యాంతావశ్యక మాయెను. కావున నా యన్నదమ్ములు దళములతో దిరువడుల రాజ్యముపై నడచిరి. రాయసైన్యము వచ్చుచున్నదని విని తిరువడులందఱు నేకమై తోవాళ ఘట్ట దుర్గముకడ పాండ్యదేశమునుండి తమ దేశమునకు వచ్చు కనుమమార్గము నడ్డగించిరి. కాని యుద్ధమున నిహతులై యథాయథలై పాఱిపోయిరి. అంతట విజయనగర సైన్యము నిరాటంకముగ దిరువడి దేశమును బ్రవేశించి గ్రామములను బట్టణములను చూఱగొనెను. పరాజితులైన తిరువడులలో నొక్కడైన ఇనిక్వితిబిరి విఠ్ఠల చినతిమ్మరాజులకు లొంగి వారి కరుణకు బాత్రుడాయెను. అతడట్లు రాయ దండాధీశులకు లోబడుటకు గారణము లేకపోలేదు. తూత్తుకుడు కాయత్తార్ల ప్రభువైన బెట్టుపెరుమాళ్ల రాయరాణువను మార్కొని పరాజితుడాయెనని ముందు చెప్పియున్నాడను గదా. పరాజితుడయినను నతఁడు సంధికొడబడక బీరము బిగియ మరల రాయ

రాణువ నెదుర్పనాకాంక్షించుచుండెను ఇనిక్విత్తింబిరిచే బంధితుడై యుండిన కన్యాకుమారి రా జతని సాయము నర్థించి యుండెను గదా. అతని వేడికోలు నాస్పదము జేసికొని యతడు దండెత్తి సముద్ర మార్గమున కన్యాకుమారికిబోయి యా రాజుతోగూడి ఇనిక్విత్తింబిరిపై యుద్ధమునకు నడచెను. వారి నెదుర్కొనుటకు వలసిన బలసంపద లేకపోవుటచేత నతఁడు దన రాజ్యమును శత్రులనుండి సంరక్షించుకొనుటకు రాయ దండాధీశుల నాశ్రయించుటకంటె నన్యమార్గము లేదని యెఱిగి వారి శరణుజొచ్చెను. తిరువడి రాజ్యములపై రాయల సామ్రాజ్యాధిపత్యము నిరవధికముగ సాగవలయునన్న బెట్టుపెరుమాళ్లవంటి శత్రువులను నిర్మూలమొనర్చుట తప్పనిసరి. కావున విఠ్ఠల చినతిమ్మలు ఇనిక్విత్తిబిరింప్రార్థన నంగీకరించి బెట్టుపెరుమాళ్లపైన నడచిరి. ఉభయపక్షములకు ఘోర సంగ్రామము సంఘటిల్లెను. ఎంత ధైర్యముతో బోరాడినను బెట్టుపెరుమాళ్లు రాయరాణువ తాకునకు దాళజాలక పరాజితుడై శత్రులచేజిక్కి బందీకృతుడాయెను. అంతటితో విఠ్ఠల చినతిమ్మల దక్షిణ దండయాత్ర కార్యము విజయవంతముగ గొనసాగినది. తరువాత వా రనంతశయనమునకుబోయి యనంత పద్మనాభస్వామిని సేవించి కన్యాకుమారికి జని యచట జయస్తంభమును నెలకొల్పిరి. రామరాజు సంతుష్ట హృదయుడై విఠ్ఠలరాజును దక్షిణదేశముపై రాజప్రతినిధిగ నియమించెను. క్రీ. శ. 1564 నందు జరిగిన రక్షసి తంగిడి యుద్ధమువఱకును రాయల పక్షమున బరిపాలించుచుండినట్లు శాసనములవలన దెలియుచున్నది. రాయల యాజ్ఞ శిరసావహించి విఠ్ఠలరాజు ద్రావిడ దేశమునకు బాలకుడై యచటనె నిలిచిపోవగా జినతిమ్మరాజు నిజపరివారముతోగూడ బయలుదేరి కతిపయదినములకు విజయనగరమునకు మరలివచ్చి చేరెను.

## రామరాజు పోర్చుగీసులు

పోర్చుగీసులు క్రీ. శ. 14 వ శతాబ్దము తుద ప్రపథమమున హిందూదేశమునకు వచ్చినప్పటినుండియు సదాశివరాయల రాజ్యాభిషేకకాలమువఱకును రాయపీఠాధిపతులతో మైత్రి పాటించుచు వచ్చిరి; కాని 1542 లో భారతదేశమందలి పోర్చుగీసు రాష్ట్రములకంతటికి గవర్నరుగ నియుక్తుడై వచ్చిన డిసోజాయను నతఁడు పూర్వుల మార్గమును విసర్జించి రాయ సామ్రాజ్యముపై గత్తికట్టి యందలి రేవుపట్టణములను దేవాలయములను దోచుకొన నారంభించెను. చోళమండల తీరప్రాంత దేశమునం దిత డొనర్చిన దుష్కృతులు పూర్వప్రకరణమందు సూచింపబడియున్నవి. కాని యచిర కాలముననె ఇతని ప్రభుత్వము సమాప్తినందెను. ఇతని యనంతరము గవర్నరుగావచ్చిన డికాస్ట్రో భిన్నస్వభావము గలవాడు. రామరా జతనితో సఖ్యము గుదుర్చుకొని యుభయరాజ్యముల మధ్య వర్తక వ్యాపారములు యథాపూర్వము నిరవధికముగ నడచునట్లేర్పాటు గావించెను. కాని యీ సఖ్యము చిరస్థాయియై నిలువలేదు. చోళ మండల తీరమందు పోర్చుగీసు మిషనరీల యత్యాచారములవలన రామరాజు కుపితుడై వారిని శిక్షించుటకొఱకు క్రీ. శ. 1557 లో నొక సైన్యమును వారి కెంకియైన మైలాపూరువిగ్గాది కంపెను. ఆ దండ కకస్మాత్తుగ మైలాపూరుపై బడి పట్టణమును ధ్వంసము గావించి పట్టణవాసులపై నొక లక్ష వరహాలు దండుగ విధించి యందు సగము మొత్తము నప్పుడె వసూలు జేసికొని మిగత సగమును మరుసటి యేట జెల్లించున ట్లేర్పాటుచేసి యందనుక పట్టణవాసులను గొందఱిని బందిగొని మరలి రాజధాని జేరెను. రామరాజీయమునందు రామరాజునకు బిరుదు గలదని చెప్పియున్నది. అనగా నతడు పై గోవ పట్టణమునకు భయము గల్గించిన వాడని యర్థము. కెళదినృప విజయమను కన్నడ చరిత్ర గ్రంథమున దీనికి వివరణము గలదు. పోర్చుగీసులనుండి గోవాపురమును గొనవలయునని రామరాజు నిశ్చయించి తన జ్ఞాతి సోదరుడైన విఠ్ఠల రాయని రప్పించి యతనికి బ్రాపుగ నిక్కేరి సంకణ్ణ నాయకుని నియమించి సైన్యముతోగూడ సత్వరమ నడచిపోయి యా పట్టణమును జయించి స్వాధీనము జేసికొనెననియు నందు చెప్పియున్నది. ఇందెంత నిజము కలదో తెలియదు. దీని యాదార్థ్యమును రుజువు సేయగల సాక్ష్య మన్యత్ర యెందును గానరాదు. కాని రామరాజు మైలాపురముపై నెత్తిపోయినప్పుడు విఠ్ఠలరాజును పై గోవ మీద కంపియుండిన నుండవచ్చును. ఇం దసంగత మెద్దియును లేదు...

## రామరాజు–దక్కనీ తురుష్క ప్రభువులు

క్రీ. శ. 16 వ శతాబ్ద ప్రారంభమున బహమనీ సల్తనతు విచ్ఛిన్నమై తత్స్థానమున నహమదునగరు, విజాపూరు, గోల్కొండ, బీదరు బీరారను నైదు చిన్నరాజ్యము లేర్పడెనని ముందు చెప్పి యున్నాడను. ఈ యైదు రాజ్యముల వారును దమ తమ యేలుబడిక్రింది రాష్ట్రములతో దృప్తిపడి శాంత చిత్తులై యుండక మన్నాసచే నిరంతర మొండొరులతో గలహించుచు బోట్లాడుచుండిరి. ఈ తురుష్క ప్రభువు లొకరుగాకపోయిన మఱియొకరు రామరాజు సహాయము నర్థింపగా నతడు వారిలో నెవ్వరైన యొక్కరితో చేరి నితరులతో యుద్ధము జేయు చుండువారు. ఈ యుద్ధముల వృత్తాంతమును ఫెరిష్టా, సయ్యిదు ఆలీతబాతబా, పేరెఱుగరాని గోల్కొండ చరిత్ర రచయిత మున్నగు మహమ్మదీ యైతిహాసకారులు వర్ణించియున్నారు. వీరి రచనలు నిష్పక్షపాతమైనవి కావు—ఏ వంశమున కాశ్రితులా వంశమువారి పక్షము నవలంబించి చరిత్రాంశములను వారి దృక్పథమునకు సరిపడునట్లు వివరించియున్నారు. ఇందువలన వారి వ్రాత లేకవిధమున నుండక తఱచుగ బరస్పర విరుద్ధములుగ గన్పించును. మఱియు రామరాజు హిందువగుటచేత నతని చారిత్రమును జెయ్దములను వారు గర్హించియున్నారు. అర్వాచీన రాయసామంత చరిత్రలలో నందును ముగగెళదినృపవిజయ వెలుగోటి వారి వంశావళులయందు రామరాజుయొక్క దక్కనీ దండయాత్రలకు సంబంధించిన చరిత్రాంశములు కొన్ని వర్ణింపబడియున్నవి. పై బేర్కొనిన యాధార గ్రంథములలోని విషయము లన్నిటిని జక్కగ పరిశీలించి యా యుద్ధముల వృత్తాంతమును నిష్పక్షపాతముగ వివరించుట చరిత్రకారుని విధి.

### విజాపురము

కయ్యమునకు మొట్టమొదట కాలు ద్రువ్వినది రామరాజు కాదు; దక్కనీ మహమ్మదీయ ప్రభు ప్రముఖులలో నొక్కడైన విజాపుర సుల్తాను ఇబ్రహీమ్ ఆదిల్‌శాహే. క్రీ. శ. 1542–3 సంవత్సరమునందొండొరులతో యుద్ధము సేయుచుండిన విజాపుర మహద్నగర సుల్తానులు రాజీపడి యుద్ధము చాలించి యొడంబడిక జేసికొనిరి. ఈ యొడంబాటు ప్రకార మహమదునగర సుల్తాను బీదరు రాజ్యమును జయించుటకును నట్లే విజాపుర సుల్తాను విజయనగరము జయించుటకును హక్కు గలదని నిశ్చయించుకొనిరనియు నటు పిమ్మట నిబ్రాహీమాదిల్‌శాహు విజయనగర రాజ్యముపై దండు వెడలిపోయి చాల దేశము నాక్రమించుకొని తనరాజ్య వైశాల్యము బెంపొందించెననియు పేరు తెలియని గోల్కొండ చరిత్రకారుడు చెప్పుచున్నాడు. ఈ దండయాత్ర నడచినది వాస్తవమని కెళదినృపవిజయము రుజువుసేయుచున్నది. రాయల మహత్త్వమును బరిగణింపక విజాపుర సుల్తాను డొక గొప్ప దండును సాతెయఖానుడను దన ప్రధానముఖ్యుని నాయకత్వము క్రింద విజయనగరముపై దండుసేయ నంపెననియు రాయల యాజ్ఞానుసారము కెళది ప్రభువైన సదాశివ నాయకు డట్లు వచ్చిన దండయాత్రికులను యుద్ధమునందెదిర్చి పరాభూతుల గావించి తఱుమగొట్టెననియు గలదు. విజాపురసుల్తాను దండయాత్ర విషయమై మీద బేర్కొనిన చరిత్రకారు లిరువురును నేకీభవించినను దాని పర్యవసానమునుగూర్చి పరస్పర విరుద్ధాభిప్రాయములను బ్రకటించియున్నారు. ఈ దండయాత్ర యనంతరముగూడ విజాపుర విద్యానగర రాజ్యముల సరిహద్దులుమారక యథాపూర్వముగనే యుండుటను జూడ నాదిల్‌శాహునకు దత్ఫలితముగ విశేషలాభ మెద్దియు గల్గిన ట్లగపడదు; కావున కెళదినృప విజయమందు చెప్పిన ట్లాదిల్‌శాహు బలము యుద్ధమున బరాజయమునంది వెనుదిరిగి పోవుటయే సత్యమని తోచుచున్నది.

పై దండయాత్ర జరిగిన తరువాత స్వల్ప కాలములోపలనే రామరాజున కిబ్రాహీమ్ ఆదిల్‌శామీద గసి తీర్చుకొనుటకు మంచి యవకాశము చిక్కినది. కల్యాణి కలుబరిగె కోటలకొఱకు విజాపురహమదు రాజ్యములకు రెంటికిని యుద్ధము పొసగినది. బహమనీరాజ్యము విచ్ఛిన్నమైన పిమ్మట నీ కోటలు రెండును బీదరు సుల్తానగు బరీదుశాహు యేలుబడిక్రింద నుండినవి. క్రీ. శ. 1548 లో నహమద్నగర సుల్తానగు బుర్హాన్‌నిజామ్‌శాహు కల్యాణి నాక్రమించుకొన నిశ్చయించి దండెత్తివచ్చి యా దుర్గమును ముట్టడించెను. బీదరు ప్రభువైన ఆలీబరీదు నిజామ్‌శాహు సైన్యము నెదిర్చి తన రాజ్యమును సంరక్షించుకొన శక్తి

లేక ఇబ్రాహీమ్ ఆదిల్‌శాహును సహాయము వేడెను. తన కాయవాంతరమున దోడ్పడి శత్రుని దఱుమగొట్టిన గల్యాణి నతనికే యిచ్చివేయుదునని యొడబడెను. అంతట నాదిల్‌శాహు సైన్యముతో గదలివచ్చి నిజామ్‌శాహున కా కోట పట్టుబడనీయ కడ్డుపడెను; కాని నిజామ్‌శాహంతటితో దన ప్రయత్నమును మానుకొనక విజయనగరమునకు దూతల నంపి రామరాజుయొక్క సహాయము నర్థించెను. ఆదిల్‌శాహంతకు మునుపు నిష్కారణముగ దనపై దండెత్తివచ్చినందులకు బ్రతిక్రియ జేయుటకు రామరాజునకు మంచి యవకాశము లభించెను. కావున నతడు బుర్హాన్ నిజాంశాహు కోరికమేర కతనికి దోడ్పడ నిశ్చయించి దండుతో బయలు వెడలిపోయి కల్యాణి దుర్గముకడ నతని గలిసికొనెను. ఇట్లేకీభవించిన యహమదునగర విజయనగర సైన్యముల నెదుర్కొని పోరశక్తి చాలక ఇబ్రాహీం ఆదిల్‌శాహు నిజ సైన్యమును మరల్చుకొని తన రాజ్యమునకు బోయి చేరెను. కల్యాణి యంతట బుర్హాన్ నిజామ్‌శాహునకు సులభముగ పట్టువడెను.

## అహమదు:నగరుపై దండయాత్ర

బుర్హాన్ నిజామ్‌శాహు క్రీ. శ. 1553 వఱకు రాజ్యము బరిపాలించి మృతుడయ్యెను. అంతట నతని పుత్రుడు హుసేనునిజామ్‌శాహు రాజ్యాధిపత్యము వహించెను. ఇతనికి రాజ్యకాంక్ష మెండు. తనతండ్రి సాధించిన కల్యాణి దుర్గముతో దృప్తినంది యుండక మఱి కొన్ని దుర్గములను రాష్ట్రమును స్వాధీనపఱచుకొన దలపెట్టి గోల్కొండ సుల్తానగు నిబ్రాహీమ్ కుత్బుశాహుతో సఖ్యము జేసికొని యతనితోగూడ 1557 లో విజాపుర రాజ్యముపై దండెత్తివచ్చి గుల్బర్గ కోటను ముట్టడించెను. ఇబ్రాహీమ్ ఆదిల్‌శాహునకు వారి నేకాకియై యెదుర్కొన ధైర్యములేక విజయనగరమునకు రాయబారమంపి రామరాజును దనకు సహాయము రమ్మని వేడుకొనెను. అతని వేడికోలు నంగీకరించి రామరాజు స్వయముగ సైన్యము నడుపుకొనిపోయి యతని గలిసికొనెను. కాని రామరాజున కా తురకరాజు లొండొరులతో బోటాడుట యిష్టము లేదు. యుద్ధమును మాన్పించి వారినెట్లైన సఖ్యపఱచవలయునని యతని యాశయము; కావున నతడు యుద్ధమువలన రక్తపాతమును, జనక్షయమును, దేశనాశనమును గల్గుననియు నెట్లైన సమాధానపడి మైత్రి గల్గియుండుట యందఱకును శ్రేయస్కరమనియు నత డిబ్రాహీమ్ కుత్బుశాహు కొక లేఖ వ్రాసి యంపెను. ఇబ్రాహీమ్ కుత్బుశాహు రామరాజునకు మిత్రుడు. అతని తండ్రియైన సుల్తాన్ కుల్లీ మృతినందినపిమ్మట గోల్కొండ రాజ్యాధిపత్యము వహించిన యన్న జమ్‌షీదు కుత్బుశాహునకు వెఱచి విజయనగరమునకు బాఱిదెంచి రామరాజు నాశ్రయించెను. రామరాజును నతని మన్నించి యతని యంతస్తునకు దగిన రీతిని సత్కరించి యతని దిన వెచ్చమునకు వలసిన ధనమిచ్చి పోషించి యుండెను. కావున నతడు రామరాజునెడ సౌహార్దముగలిగి తన యన్న మరణానంతరము గోల్కొండ సింహాసనము నధిష్ఠించిన పిమ్మటగూడ నతని కనుకూలుడై యుండుటచేత నిబ్రాహీమ్ కుత్బుశాహు దన కోర్కెను నెఱవేర్పకపోడని యెంచి పై లేఖను వ్రాసెను. ఇబ్రాహీమ్ కుత్బుశాహు రామరాజుమాట నుల్లంఘించలేదు. అతని యభీష్టము చొప్పన యుద్ధమునకు సంసిద్ధులై వచ్చిన రాజుల నల్వురను కృష్ణాభీమరథుల సంగమ ప్రదేశమున సమావేశపఱచెను. ఈ సమావేశమందు పై నల్వురును నప్పటి రాజకీయ పరిస్థితులను, యుద్ధకారణములను జక్కగ పరిశీలించి యటుపిమ్మట నట్టి యుద్ధములు సంభవము గాకుండుటకై యొక సమయ మేర్పఱచుకొనిరి. దీనికి నల్వురు రాజుల యొడంబడిక యను పేరు కల్గినది. ఈ యేర్పాటు ప్రకారము పై నల్వురు రాజులలో నెవ్వరైనను మఱి యొకనిపై యుద్ధముసేయ దలపెట్టినట్లయిన దక్కిన వారిర్వురును యుద్ధమునకు గురియైన పక్షమవలంబించి యుద్ధమును దలపెట్టిన కడకను భగ్నము సేయవలయును. ఈ యేర్పాటున కందరును సమ్మతించి యుద్ధమును సాలించి యెవ్వరి రాజ్యమునకు వారు తిరిగిపోయిరి.

## బీదరు

ప్రథమ అహమద్‌నగర దండయాత్ర ముగిసిన పిమ్మట రామరాజు బీదరుపై దండు వెడలిపోయి యా దేశ పాలకుడైన బరీదుశాహు నోడించి జయము గొన్నటు శివతత్త్వరత్నాకర కెళదినృపవిజయములు దెల్పుచున్నవి, మహమ్మదీయ చరిత్రలయందీ దండ

యాత్రల ప్రస్తావ మెందును గానరాదు. కాని రామరాజు అలీయదిల్‌శాహు ఇబ్రహీం కుత్బ్‌శాహులతో గూడ రెండవమా రహమద్‌నగర రాజ్యముపై దండు చేసినపు డతనికి ప్రాపుగ నలీబరీశాహు యుద్ధమునకు వెడలెనని ఫెరిష్తా వ్రాసియున్నారు. మఱియు రామరాజు రెండవ యహమద్‌నగర దండయాత్రయైన తరువాత గోల్కొండపై నెత్తిపోయినప్పు డతనికి సహాయముగ నలీబరీదుకుత్బ్‌శాహు రాజ్యముపై యద్ధమునకు నడచెనని పేరు తెలియని గోల్కొండ చరిత్రకారుడు తెల్పుచున్నాడు. కావున శివతత్త్వరత్నాకర కెళదినృపవిజయములలో జెప్పినట్లు రామరాజు బరీదు నోడించి యతని దనకువశ్యుగ జేసికొనయుండినది రెండవ యహమద్‌నగర గోల్కొండ దండయాత్రలకు పూర్వమే నడచియుండవలయును.

రామరాజు బీదరువిూది కెత్తిపోవ గారణ మెద్దియో తెలియరాదు. కాని యూహించి చూడగా నతడు యాదిల్‌శాహునకు వత్తాసిగ బీదరుపై నెత్తి చనియుండవచ్చునని తోచుచున్నది. ఏలనగా బరీదు ఆపదలనుండి తప్పించుకొనుటకొఱకే డెడప దడప ఆదిల్‌శాహు నాశ్రయించినను వారిరువురును బ్రాకృత శత్రులు. ఆదిల్‌శాహుబరీదు నాక్రమించుకొన నాద్యమునుండి పెక్కుమారులు బ్రయత్నము సల్పుచుండువాడు. బరీదు ప్రబ్బలివైరివలె శత్రువాహిని తలముస్కలై వచ్చినప్పుడు నమ్రుడై సంధి జేసికొనుచు వచ్చినను సమయ మనుకూలమైనప్పు డెదురు తిరుగువాడు. ఇబ్రాహీం ఆదిల్‌శాహు మృతుడైన పిమ్మట బాలుడైన యతని పుత్రుడగు నలీయాదిల్‌శాహు యొక్క యశక్తతను ఇక్కట్టులను సందర్భ పఱుచుకొని ప్రతిఘటించి యుండవచ్చును. అలీఆదిల్‌శాహు రామరాజుయొక్క సహాయము నర్థించి యుండవచ్చును. రామరా జతని ప్రాపై బరీదుశాహు విూదికి యుద్ధమునకు వెడలియుండవచ్చును. ఇది యూహ మాత్రమే. వాస్తవమును దెలుపు నాధారము లెవ్వియు దెలియరావు.

ఈ దండయాత్రయందు జరిగిన యుద్ధ విశేషములను గూర్చి తెలియవచ్చునది స్వల్పమే. విజయనగర సైన్యము దనరాజ్యము విూదికి వచ్చుచున్నదను వార్త విన్నంతటనే కోపోద్రిక్తుడై తన సైన్యము నంతటిని స్వయముగ నడుపుకొని శత్రుల నెదుర్కొని తలమగొట్టు నుద్దేశముతో సరిహద్దు ప్రాంతములకు బోయి చేరెను. శత్రులు లారసిలిన పిమ్మట ఘోర యుద్ధము సంప్రాప్తమైనది. బరీదుశాహొక గంధ సింధురమునెక్కి దళములను బురికొల్పుచు మిక్కిలి యుద్రేకముతో బోరెను; కాని లాభము లేకపోయెను; ఓటువడి మంత్రులతోగూడ శత్రులకు బట్టువడెను. అతని రాజ్యాంగములన్ని విజయులైన హిందువులకు హస్తగతమాయెను. ఈ యోటమి కారణము నలీబరీదు రామరాజుతోడను నలీయాదిల్‌శాహుతోను గూడుకొని వారి శత్రువులైన నిజాం శాహు కుత్బ్ శాహులవిూదికి యుద్ధమునకు నడువవలసి వచ్చెను.

## రెండవ అహమదునగర దండయాత్ర

దండయాత్రకు కారణము హుసేన్ నిజాము శాహుయొక్క దుష్ప్రవర్తన. నల్వురురాజుల యొడంబడికకు సంతకముపెట్టిన వారిలో దానొక్కడైనను దాని నుల్లంఘించినవారిలో నతడే ప్రథముడు. ఈ యొడంబడిన పిమ్మట నచిరకాలమున నే ఇబ్రాహీమ్ ఆదిల్‌శాహు మృతినందెను. అతని మరణానంతర మతని పుత్రుడు ఆలీఆదిల్‌శాహు విజాపుర సింహాసనము నధిష్ఠించెను. అప్పుడతడు తరుణ వయస్కుడు; రాజ్యతంత్ర నిర్వహణమునం దనుభవము లేనివాడు. హుసేన్ నిజాముశాహు కల్యాణి మొదలగు విజాపుర దుర్గముల నాక్రమించి తనరాజ్యమును బెంపొందించుకొనుట కదియే యనుకూల సమయమని నిశ్చయించి నల్వురు రాజుల యొడంబడికను విస్మరించి దండెత్తివచ్చి కల్యాణి దుర్గమును ముట్టడించెను. అలీయాదిల్‌శాహు తన రాజ్యమును సంరక్షించుకొన శక్తిలేక, విజయనగరమునకు బాఱుతెంచి రామరాజు నాశ్రయించి తనకు దోడు రమ్మని ప్రార్థించెను. రామరాజు కనికరించి నాల్గురాజుల యొడంబడిక ప్రకార మాతని సంరక్షించుట తన విధియని యెంచి సర్వసైన్యసమేతుడై యతనివెంట బయలువెడలుచు గోల్కొండ సుల్తాన్ ఇబ్రాహీమ్ కుత్బ్‌శాహుకు పైని యొడంబడిక షరత్తుల ప్రకారము దనతోగూడి హుసేన్‌నిజామ్ శాహుతో యుద్ధముసేయ రమ్మని యాహ్వానమంపెను. ఇబ్రాహీమ్‌కుత్బ్‌శాహుకు నాలుగురాజుల సంధిని ఆచరణకు దెచ్చుటకుగాని హుసేన్‌నిజామ్‌శాహు

నెదిర్చి పోరుటకుగాని యిష్టములేదు. కాని రామరాజు వంటి బలవంతుడైన మిత్రుని యాహ్వానమును త్రోసి పుచ్చి యతని కోపమునకు గురియగుట కొల్లక సైన్య ముతోగూడ బయలువెడలివచ్చి యతని గూడెను. ఇట్లు యేకమై వచ్చుచున్న విజయనగర, విజాపుర, బీదరు, గోల్కొండ సైన్యముల నెదుర్కొన జాలక హుసేనునిజామ్‌శాహు తన కొలువునందున్న భోపాల రాయను హిందూసర్దారుని కల్యాణి దుర్గమునకు గాపుపెట్టి తక్కిన దళములతో నిజరాజ్యమునకు దిరిగిపోయెను. రాజధానియైన అహమదునగరమున నుండుట శ్రేయస్కరముగాదని తలచి దూరమున గోదావరీతీరమునందుండు ప్రతిష్ఠానమునకు బోయి యచట విడిసి యుండెను. రామరాజంతట వెను దిరిగి పోలేదు. సమయోల్లంఘుకుని దగునట్లు శిక్షించినగాని యతడట్టి కార్యమును మరల జేయ కుండ జాలడని యెంచి తను సైన్యమునం దొక్క భాగమును విడదీసి కల్యాణి దుర్గమును ముట్ట డింప నియమించి తక్కిన దళములతో నడచిపోయి యహమదునగరమునకు ముట్టడి వేసెను. ఈ ముట్టడి రెండు నెలల కాలము సాగినది. మిత్ర ద్రోహమును దలపెట్టి ఇబ్రాహీమ్‌శాహి సర్దారులకు రహస్యముగ నెన్ని విధముల సాయమొనర్చినను నది శత్రులకు హస్తగతము గాకపోయెను. ముట్టడిని సత్వరము జయసంతముగ ముగించు నుద్దేశముతో రామరాజు తన సర్దారులలో నొక్కడైర కెళది సదా శివనాయకుని బిలిచి యతని నిజదళములతో నా పరిసర దేశముపైబడి చూఱగొని ధ్వంసముసేయ నాజ్ఞాపించెను. రామరాజు ఆజ్ఞమేరకు సదాశివ నాయకు డహమదు నగరప్రాంత దేశమును ధ్వంసము సేయుచుండగా జంబుఖండియను గ్రామముచెంత ఘర్షణ జరిగినదని కెళదినృపవిజయమందు చెప్పి యున్నది. ఈ ఘర్షణ ప్రస్తావము సయ్యిద్ ఆలీ విరచిత బుర్హాన్—ఇ—మ ‘అసీరను చరిత్ర గ్రంథము నందును గలదు. సదాశివ నాయకుడు దేశమును చూఱగొన బయలువెడలుచున్నాడని తెలియవచ్చి నంతటనె హుసేన్‌నిజామ్‌శాహు తన కొలువు నందున్న ఇరాకీ ఖురాసానీ గుఱ్ఱపు ఫౌజును మవలీ ఖాన్, సంజార్‌ఖాన్, దౌలత్‌ఖాన్, దస్తూర్‌ఖాన్‌మ, వజీర్‌ఖాన్, సాత్యయను సర్దారుల యాధిపత్యముక్రింద

నాతనిని నడ్డపెట్ట బంపెననియు వారాతని జంగా వమను చోట దార్కొని ఘోర యుద్ధము జేసి రనియు నందు చెప్పియున్నది. జంగావన్, జంబు ఖండి యనునవి యహమదునగర జిల్లాలోని ఖంఖే డను గ్రామమునకు నామాంతరములు; కావున నీ యుద్ధము అహమదునగర సమీపమున జరిగెనని నిశ్చయముగ జెప్పవచ్చును. జయమెవ్వరిదో నిశ్చ యించి చెప్పుట సులభసాధ్యముగాదు; మహమ్మ దీయ లకె సంపూర్ణ విజయము కలిగెనని సయ్యిద్ ఆలీ యనుచున్నాడు. సదాశివనాయకుడు పైబేర్కొ నిన తురక సర్దారులనందఱి నోడించి తఱుము గొట్టుటయేకాక బొక్కసింగడను నిజాంశాహీ హిందు సర్దారు నొక్కనిబట్టి కైదుచేసెనని కెళదినృప విజయకర్త వచించి యున్నాడు’— సూక్ష్మముగ విచారించి చూడగా నీ యుద్ధమున హిందువులదె విజయమని తోచుచున్నది. ఏలనఁగా నింత గొప్ప విజ యము జేకూఱినను భోపాలరాయ శత్రులకు లొంగి కల్యాణదుర్గమును వారికి వశబఱచబోవుచున్నాడని విని నిజాంశాహు వెంటనే సదాశివరాయలతో సంధి జేసి కొనెనని సయ్యిద్‌ఆలీ చెప్పుచున్నాడు. కాని తక్కిన మహమ్మదీయ చరిత్రలలో నీ జంగావీ యుద్ధ ప్రస్తా పమే లేదు; కాని యందు సయ్యిదుఆలీ చెప్పక విడచిన మరికొన్ని యుద్ధ విషయములు వివరింపబడియున్నవి. రామరాజు కడగొట్టు తమ్ముడైన వెంకటాద్రి సైన్య ముతో గూడ గోదావరిని దాటి దౌలతాబాదు పర్యం తముగల నిజాంశాహీ రాష్ట్రమును బరశురామప్రీతి గావించి ధ్వంసమొనర్చెనని ఫెరిష్తా తెలుపుచున్నాడు. అప్పుడే కావలయును రామరాజ భూషణుడు చెప్పి నట్లు వెంకటాద్రి ధాటి కాగజాలక నిజాముడు ‘గౌతమి దాటువేళ నిజకాంతాశ్రు ప్రవాహప్తిగాల్నడ దప్పన్ జడుడై యుడుపాలంబనంబున’ దరించి చనినది. వెంకటాద్రి యతనిని వెన్నంటి తఱుముచు బోయి యతఁడు తలదాచుకొనియున్న దౌలతాబాదు దుర్గమును బట్టుకొనియెను. ఈ యపజయ పరం పరలవలన రాయరాణువతో బోరుటకు సాధ్యము గాదని యెఱిగి హుసేన్‌నిజాంశాహు సయ్యిదుఆలీ చెప్పినట్లు సదాశివ రాయలతో సంధి జేసికొనియెను. ఈ సంధి ప్రకారము కల్యాణి దుర్గము నతడు ఆ అలీ యాదిల్‌శాహునకు సమర్పించుకొనవలసివచ్చెను.

# గోల్కొండపై దండయాత్ర

రెండవ యహమదునగర దండయాత్ర విజయవంతముగ ముగిసిన పిమ్మట రామరాజు గోల్కొండ కుతుబుశాహి రాజ్యముపై దండు వెడలెను. ఈ దండయాత్రకు గారణము మహమ్మదీయ చరిత్రకారు లొక్కొక్క రొక్కొక విధమున వివరించియున్నారు. ఇబ్రాహీమ్‌కుత్బ్‌శాహు రామరాజునకు బ్రాపుగ నతని గూడి యహమదుపై దండు చేసినప్పుడు, రామరాజు విజయములనుగాంచి యీర్ష్య నంది యహమదునగరు ముట్టడి సమయమునం దా దుర్గమును సంరక్షించుచుండిన నిజాంశాహీ బలములకు రహస్యముగ సహాయము సేయగడగెననియు నతని ద్రోహప్రవర్తన తెలియవచ్చినంతటనె రామరాజును నలీయాదిల్‌శాహును దానికేమి సమాధానము జెప్పెదవని యతని నడిగిరనియు జవాబేమియు జెప్పజాలక రాత్రికి రాత్రియే చీకటి మరుగున శిబిరము లేవనెత్తికొని పరారియై గోల్కొండ మార్గమును బట్టెననియు నతని శిక్షించుటకొఱకె రామరాజు అలియాదిల్‌శాహుతో గూడ కుత్బ్‌శాహి రాజ్యముపై దండువెడలెననియు ఫెరిష్తా తెల్పుచున్నాడు; కాని గోల్కొండ సుల్తానుల చరిత్రను వ్రాసిన అకాశరానున్న ఇబ్రాహీం కుత్బ్‌శాహుయొక్క ద్రోహప్రవర్తనను మఱుగుపఱచి దండయాత్ర కారణమును వేరొకవిధమున వివరించియున్నాడు. రామరాజు అహమదునగర ముట్టడిని విసర్జించి యచటినుండి దండును లేపుకొని పోయిన యెడల దానికి బ్రత్యామ్నాయముగ నతనికి దన యేలుబడిక్రింద నున్న కొండపల్లి దుర్గమును దాని క్రింది రాష్ట్రమును నిచ్చివేయుదునని యిబ్రాహీం కుత్బ్‌శాహు వాగ్దత్తము జేసెనట. కుత్బ్‌శాహు మాటను నమ్మి రామరా జహమదునగర ముట్టడిని విసర్జించి యచటినుండి దండుతో గదలిపోయిన పిమ్మట నిబ్రహీమ్‌కుత్బ్‌శాహు తన మాట ప్రకారము పై దుర్గమును వశపఱచక పోవుటయేకాక యలీ యాదిల్‌శాహుపై గయ్యాసేయ నుద్దేశించి హుసేన్ నిజాముశాహుతో జెలిమి జేసికొని యా చెలిమిని దృఢపఱచుకొనుటకొఱ కతని కూతు నుద్వాహమాడ నేర్పాటు గావించికొని తత్కార్య నిర్వహణమునకు నాందిగ నప్పు డాదిల్‌శాహు పాలనలోనుండినకల్యాణిదుర్గమును నిజాంశాహుతో నేకమైపోయి ముట్టడివేసెనట. ఇచ్చినమాటప్రకార మతడు కొండపల్లి దుర్గము వశముసేయ నిరాకరించినందుకు గినిసి బలవంతముగ నా కోటను స్వాధీనపఱచుకొనుటకొఱకు రామరాజు కుత్బ్‌శాహి రాజ్యముపై దండు వెడలెనట. ఈ చరిత్రకారుల వ్రాతలనుబట్టి చూడగా రామరాజు నిష్కారణముగ గుత్బ్‌శాహి రాజ్యముపై దండు వెడలలేదని తెలియుచున్నది.

కుత్బ్‌శాహి నిజాంశాహి సైన్యము లేకమై తన రాజ్యముపై నెత్తివచ్చి కల్యాణిదుర్గమును ముట్టడించిన వార్త తెలియవచ్చినంతటనె అలీయాదిల్‌శాహు స్వయముగ వారి నెదుర్కొన ధైర్యము చాలక రామరాజుయొక్క సహాయము నర్థించుటకొఱకు హుటాహుటి ప్రయాణముజేసి శీఘ్రమె విజయనగరము జేరెను. రామరాజతని కాదరపూర్వకముగ స్వాగతమిచ్చి సత్కరించి యతడు కోరిన మేరకు సాయ మొనర్ప నంగీకరించెను.

రామరాజు కుత్బ్‌శాహు నిజాంశాహుల విూద దండుసేయ ననుసరించిన పద్ధతి ఫలనిష్పాదకమైనదే. తమ్ముడైన వేంకటాద్రి యాధిపత్యముక్రింద జగదేవరాయ లయ్యనమలుక (అయిన్‌ఉల్‌ముల్‌కు) లుపసేనాధిపతులై తోడునడువ నొక సైన్యమును గుత్బ్‌శాహి రాజ్యపు దక్షిణసీమల బారి సమరనంపెను. మఱి యొక దండుతో నలీయాదిల్‌శాహుతో నేకమై కల్యాణి దుర్గమును ముట్టడించియున్న నిజాంశాహీ కుత్బ్‌శాహీల శిబిరముపై నడచెను. ఆలీఆదిల్‌శాహుకు బ్రాపుగ రామరాజు తమపై గూడిచేసి వచ్చుచున్నాడని తెలియవచ్చినంతటనె పై బేర్కొనిన శాహు లిర్వురును తమ తమ స్కంధావారములను లేపుకొని యెవరి రాజ్యమువైపు వారు మరలిపో నుపక్రమించిరి. పోవువారి నట్లే పోనీయక వారికి దగిన శాస్తి చేయుటకు నిశ్చయించి, యలీయాదిల్‌శాహును నతని సేనలతోగూడ గుత్బ్‌శాహు వెనుదగిలిపో నియమించి సైన్యముతోగూడ రామరాజు నిజాంశాహును వెన్నంటి తఱుముచుబోయి యతని రాజధానియైన యహమదు నగరమును ముట్టడించెను.

ఈ ముట్టడిట్లు యెట్లు సాగెనో యే రీతని పరిసమాప్తి యాయెనో నిశ్చయించి చెప్పుటకు వలను పడదు; ఏలనగా దీని బ్రస్తావించు చరిత్రకారు లిరువురును జెరియొక విధమున బల్కుచున్నారు.

లింగణ దనకెళదిన్నపవిజయమునందు రామరాజు పక్షమున గెళది సదాశివనాయకుడు నిజామ్‌శాహుతో యుద్ధమొనర్చి యతని బరాజితుని గావించెనని వ్రాసియున్నాడు. ముహమ్మద్‌కాసిమ్ ఫెరిష్తా చరిత్రలో రామరాజహమదునగరముట్టడి నడుపుచుండగా సేనానది ప్రవాహముప్పొంగి పొరలవచ్చి యతని శిబిరమును ముంచి యందు చాలభాగమును ధ్వంసము గావించెననియు దత్కారణమున నతడు ముట్టడి లేపుకొని పోయెననియు దెల్పుచున్నాడు. వీరియం దెవ్వరు చెప్పునది వాస్తవమో విచారించి తీర్మానించుటకు దగిన సాక్ష్యము గానరాదు; వీరి వ్రాతల సత్యాసత్యము లెట్లున్నను నీ ముట్టడివలన రామరాజెట్టి లాభమును బొందిన ట్లగపడదు.

రామరాజు రాకను విని నిజామ్‌శాహువలె నిబ్రాహీమ్‌కుత్బ్‌శాహు కూడ నిజరాజ్యమునకు మరలి పోగడెడని గదా. అతని ప్రయాణము నిరాటంకముగ సాగలేదు. వెనువెంట దగిలివచ్చెడి యాదిల్‌శాహి బలము లతని నడుగడుగునకు హింసింపదగినవి; పలుమార్లుభయ పక్షములకు బోరాటము గల్గెను; ఒకానొకచోట యుద్ధము తీవ్రముగ నడచెను; కుత్బ్‌శాహకు ఘన పరాజయము గలిగెను; మార్గమున నానాకష్టముల పాలయి తుదకెట్లో యాతడు నిజరాజధానికి బోయి చేరగల్గెను. అప్పటికె యాతని రాజ్యము కలగుండువడి యుండినది. వెంకటాద్రి సైన్యముతో బ్రవేశించి దేశము నంబడి పెట్టుచుండెను. ఇది చాలనట్లు రామరాజు అహమదునగరమునుండి మరలి చక్కగ దన రాజ్యమునకుబోక కుత్బ్‌శాహి రాజ్యముపై నడచివచ్చి రాజధానియైన గోల్కొండ నగరమునకు ముప్పదిమైళ్ల దూరమునందుండు తర్పల్లమను గ్రామమున బాళెము విడిసెను—అచటినుండి యతని బాఱదోల నిబ్రాహీమ్ కుత్బ్‌శాహు సర్వవిధముల బ్రయత్నముజేసెను గాని యతని గదల్పజాలడాయెను. మఱియు నతనికి రాజ్యము నడుమ్రలోనికి దెచ్చుకొని దళములను గూర్చుకొని శత్రువు నెదుర్కొన నతని కవకాశముగూడ గలుగదాయె. రామరాజు తర్పలిపాలెమున గూర్చుని మిన్నక యుండలేదు. తమ్ముడు వెంకటాద్రికిని నతనికి బ్రాసైన క్షేత్రయాత్ర సాగించుచుండిన జగదేవరాయా వ్యానములకకును గోల్కొండ పరిసర ప్రదేశముల జూఱగొని ధ్వంసముసేయ నాజ్ఞాపించెను. మఱియు గొండవీటి పాలకుడైన దన మేనల్లుడు సిద్ధిరాజు తిమ్మరాజునే బదివేల పదాతి వర్గముతో గొండపల్లి మచిలీపట్టణములమీది కంపెను; సితాపతి (చితాపఖాను)ని విదియాద్రిని రాజమహేంద్రమునుండి యేలూరిపై నెత్తిరా నియోగించెను.

తన్నిట్లు పరివేష్టించియున్న శత్రుమండలమును భేదించుట కిబ్రహీమ్‌కుత్బ్‌శాహునకు మార్గమొక్కటి కాన్పించినది. సిద్ధిరాజు తిమ్మరాజును గొండవీటినుండి సైన్యముతోగూడ రామరాజు కొండపల్లి మచిలీపట్ణములమీదికి పంపెను గదా. అతని పోకవలన యాదుర్గ సంరక్షణకు దగిన బలమందు లేకపోయెను. అట్టియెడ తా నా దుర్గమును ముట్టడించిన దాని గాపాడుటకై రామరాజుగాని యతని యాజ్ఞానుసారము దన రాజ్యమున దండుసేయుచుండిన యతని దండనాయకులుగాని తన్ను వెనుకొని రావచ్చుననియు దన్మూలమున దనపై శత్రుల యెత్తిడి తగ్గవచ్చుననియు దలచి దండు నడుపుకొని స్వయముగ కొండవీటికి బయలువెడలెను. అతనితోగూడ ముస్తఫాఖాన్, ఆజిమ్‌ఖాన్, యాకూబ్‌ఖానాది యమీరులును చింతగుంట ధర్మారావు మున్నగు నాయక్‌వాడి దొరలును యుద్ధమునకు నడచిరి. సైన్యమందొక భాగము మున్నాడి కొండవీటికిబోయి యా దుర్గమును ముట్టడించెను. ఇట్టి యెత్తుగడ రావచ్చునని రామరాజు మున్నె గ్రహించి దాని నెదుర్కొనుటకు దగిన యేర్పాటు గావించియుండెను. అతనిచే నాజ్ఞప్తుడై యతని తమ్ముడెఱ తిమ్మరాజు, కొండవీటిని గోల్కొండ తురకదండు ముట్టడించెనని తెలియవచ్చినంతటనె వారి నచటినుండి పాఱదోలుటకు గొంత దండిచ్చి తన భృత్యులలో నొక్కడైన వెలుగోటి నాయనిబంచెను. ఇతని పరాక్రమణ విజృంభణ వెలుగోటివారి వంశావళియందు చక్కగ వర్ణింపబడియున్నది. మొట్టమొదట నతడు కొండవీటిని ముట్టడించిన గోల్కొండ దళముల దలపడి హోరాహోరిగ బోరి వారిని జెల్లాచెదురు గావించెను. అంతట గోల్కొండ దండంతటయు ముస్తఫాఖానుని నాయకత్వముక్రింద గృష్ణానదిని దాటి దక్షిణతటమందలి మలప్రాంత భూముల బ్రవేశించి యచటి బోయజాతుల గళవళపెట్టుచున్నట్లు తెలియవచ్చెను. రామరాజెఱతిమ్మ భూవిభాశ్వ

రుల పంపున జినతిమ్మానాయుడు మల్ప్రాంతమునకు బోయి ముస్తఫాఖానుని యుద్ధము నోడించి బోయల యభయమును మాన్పెను. తరువాత ముస్తఫాఖానుని వెన్నంటి కృష్ణాతటమువఱకు దఱుముచుబోయెను. కృష్ణను జేఱగనే గోల్కొండ సైన్యమందలి యొక లంక నాశ్రయము జేసికొని పశై మేర్పఱచుకొని చిన తిమ్మానాయని మార్గము నరికట్టి పోటుచూపెను. ఉభయపక్షములకును ఘోరసంగరము సంఘటిల్లినది. ఈ యుద్ధమున జినతిమ్మానాయని ప్రతాపమిట్లు వర్ణింపబడినది.

తన నేత్ర నీరజద్వయము సంహరలిచ్చు
  నిగురుబోటి బుట్టినిల్లు గాగ
తన యశఃకందుకం బొనరు మాట మిటారి
  యబ్బు చన్నకు బెన్నుద్దిగాగ
తనముద్దుమోము కాంతా ద్యక్చకోర
  దంపతులకు నెఱ చందమామగాగ
తన ప్రతాపాగ్ని కందర్ప దర్ప ధ్వంసి
  చుఱుగంటికిని నీడ జోడుగాగ

వెలసె నెవ్వాడు మధుమదావృత తురుష్క
వర్మరక్తరసచ్ఛటా వర్ధమాన
భంగసంఘాత కృష్ణా తరంగిణీకు
డధిపమాత్రుండె పిన్నతిమ్మపని విభుడు.'

ఈ యుద్ధమున గోల్కొండ సైనికు లెంత పౌరుషము చూపి పోరినను, రాయరాణువకు తాకునకు నిలుపోపక విఱిగి వెన్నిచ్చి పఱచిరి. అంతట జినతిమ్మానాయ డళియరామరాజయొక్క యాజ్ఞానుసారము దండుతో గూడ గృష్ణనదిని దాటి కుత్బుశాహు రాజ్యముపై బడి యేకధాటి నాగులపాడు నల్గొండ యుండ్ర కొండ దేవరకొండ యరవపల్లి వాడపల్లి చిటెల మున్నగు దుర్గముల నాక్రమించుకొని గోల్కొండ పరిసరప్రదేశమునకు వచ్చిచేరెను. అదే సమయమున గోల్కొండ రాజ్యమున మఱియొక ప్రాంతమున జగదేకరావు పన్నుగడల మునపల్లరులు రేగెను. ఈ జగదేకరావ్నమున దెలింగాణ వాస్తవ్యుడు కుత్బ్‌శాహి నాయకవాడి దొరలలో ప్రముఖుడు; ఇబ్రాహీమ్ కుత్బ్‌శాహి యన్నయైన నజమ్‌షీదుశాహు రాజ్య కాలమున నారాజు ననుగ్రహమునుబొంది యతని కార్యఖడ్గములకు గర్తయై ప్రఖ్యాతి వహించెను.

ఇబ్రాహీమ్ కుత్బ్‌శాహు గద్దెనెక్కిన పిమ్మట నచటి పరిస్థితులు దనకనుకూలములగుటచేత నతడు స్వదేశమును విడిచి విజయనగరమునకువచ్చి రామరాజు నాశ్రయించెను. రామరాజు తన శక్తిసామర్థ్యముల నెఱగిన వాడగుటచేత నతని జేరదీసి దన కొలువున గొప్ప యుద్యోగమిచ్చి తన యాంతరంగికులలో నొక్కనిగ జేసికొనెను. జగదేవరావు తెలింగాణము విడిచి వచ్చినను నతనికి నాయకవాడి దొరలో నింకను జక్కని పలుకుబడిగలదు; కావున నతడు వారితో మంతనములు సాగించి తన్మూలమున గోవిలకొండ, పానుగల్లు, గణపురము మున్నగు ముఖ్యదుర్గములను రామరాజునకు స్వాధీనపఱచునట్లుచేసెను. ఇకరామరాజుతో బోరాటము సాగింప సాధ్యముగాదని ఇబ్రాహీమ్ కుత్బ్‌శా హతనితో సంధిజేసికొన నిశ్చయించెను. పానుగలు గణపుర దుర్గములను రెంటిని దనకిచ్చివేసినచో దాను యుద్ధమును జాలించి నిజరాజ్యమునకు మరలిపోయెదనని రామరాజు తెలుపఱచెను. ఇబ్రహీమ్ కుత్బ్‌శాహు వాని నిచ్చివేయుట కియ్యకొనగా నిరుపక్షముల వారికిని సంధి కుదిరినది. అంతట రామరాజు సైన్యములను మరల్చుకొని నిజరాజ్యమునకు బోయి జేరెను.

ఇట్లు రామరాజు కుత్బ్‌శాహుపై విజయము నందినను నది లాభకారిగాక యనర్థమునకు దారితీసినది. అందుమూలమున నిబ్రాహీమ్ కుత్బ్‌శాహునకు రామరాజునెడ గల ద్వేషము ముమ్మరించినది. ఎట్లైన నతని నిర్మూలము సేయకపోయిన నిజరాజ్యమునకు భద్రత యుండబోదని గ్రహించి తత్కార్యసాధనకు వెరవరయుగడగెను. తన కొక్కని కది యలవియైన కార్యముగాదు. దక్కనీతురక లైకమత్యములేక యొండొరులతో బోరాడుచున్నంత కాలమును రామరాజు గ్రేలువంచ దరముగాదు. కాని దక్కనీ తురుష్క ప్రభువుల విరోధములను దాత్కాలికముగనైన మాన్పి వారినందరి నేకముఖమునకు దెచ్చి యతని ఢీకొనినగాని దనకోరిక నెఱవేరదని నిశ్చయించి తత్సిద్ధికొఱకు గృషి సేయ గడగెను. విజయనగర వినాశమునకు హేతుభూతమైన రాక్షసితంగిడి సంగ్రామమునకు బ్రస్తావన ఇట్లు జరిగినది.

[సమాప్తం]

# పాదపూజ

## శ్రీ కొండముది శ్రీరామచంద్ర మూర్తి

నా మనః కాళిందిలో ఆరు పడగల ఆశాకాలనాగు బుసల
పొగలు ఉమియు విషమ సమయాన నీ మృదు చరణ ఘలంఘలలు
విన్పింపవేమి స్వామీ ?......

నా జీవన మైదానం మీాద బుధ్యహంకృతులు కళ్లెములు తెగిన జవ
నాశ్వముల భ్రాతి పరువులెత్తు సాంధ్య సమయాన, సచివుడవై సారథివై
వానిపై స్వారిచేయవేమి తండ్రీ ?......

నాయీ పాంచభౌతిక దేవాయతనంలో ఓంకార ఘటిక శబ్దించు మధుర
సమయాన నీ దివ్యదర్శన రోచి నను పూతమ్ముచేయదు; నీ వాక్పరీమళము
నను స్పర్శింపదు; ఇది యేమి స్థితి నాకు ననుగన్న ప్రభువా ?......
నేనై నిన్ను చేరంగలేను; నీవై నాకు కైదండ నందింపవలయు !
నేనై నిన్ను చూడంగలేను; నీవై నాకు దర్శనము కల్గింపవలయు !
నేనై నిన్ను వినగలాడను కాను; నీవై నాకు నీ మురళి విన్పింపవలయు !
జడత్వమ్ము నేను—ఇందు చైతన్య కీల నీవు !!
నా బ్రతుకన్నది మృత్తు—వేయి రూపాల దాని విశ్లేషించు విచిత్ర కళాకారుడవు నీవు !!!
నా వాఙ్మురళి స్వర విహీన— అందు కైవల్యగీతి వాయించు మోహనుడ వీవు !!!!
జీవన కేదారంలో విచ్చుకొనని పసరు మొగ్గలు, తొలిదినాల నా అనుభవాలు ··
వాని సౌరభ సౌందర్యాలు నీ దయాపూర్ణ ప్రసారితాలు.
అంతలో పుట్టి ఇంతలో గిట్టు సంద్ర కెరటమ్ము నేను
అంతలో వీచి ఇంతలో సమయు మలయు తరంగమేను.
చలిత ఛాయా చిత్రమ్ము నేను—
కాల గర్భమ్ములో నీవు వదలిన రూప శకలమ్ము నేను—
తత్గళ సీమను వ్రేలెడు నిత్యవాసనాభరిత పారిజాతముల దండను—
నన్ను రక్షించు తల్లిదండ్రీ—హరిహరాద్వైతమూర్తీ
నీ పాదముల కిదే నాదు పదశతము నతము !

---

# సంఘాభ్యుదయ పథంలో గ్రంథాలయాల పాత్ర

శ్రీ మందివేడు ప్రభాకర రావు

(గత సంచిక తరువాయి)

## యుద్ధానంతరం ఏర్పడిన పరిస్థితి :

ప్రథమ ద్వితీయ ప్రపంచ సంగ్రామాల అనంతరం గ్రంథాలయ ప్రక్రియలో నూతనోత్తేజం పొడ సూపింది. ఆరోహణక్రమం (Vertical line) లో ప్రవర్తించే నూతన ప్రయోగాలను తదనుభవాలను తులనాత్మక దృష్టిలో (Comparitive Aspect) పరిశీలించి పుస్తకాలయాధికారి సర్వజనులకు అందిస్తున్నాడు. నార్లికర్స్, కొరనన్ విజయాలు వ్యక్తిగత విజయాలు కావు. సముద్రగర్భ పరిశోధనాశాస్త్రం (Oceanography) లోను, జీవకణం (Cell), మస్తిష్క (Brain) విషయాల్లోను అంతర్జాతీయ పరిశోధనా సంస్థలు (International Research Centre) కలసి సమాఖ్య (Unit) గా ఏర్పడి వైజ్ఞానిక వికసమే ధ్యేయంగా కృషిచేస్తున్నారు. ఆ కృషి ఫలితం అందిన వెంటనే దేశీయ వైజ్ఞానికులు (National Scientists) తిరిగి ఆయా ప్రయోగాలు చర్విత చర్వణం చేయకుండ అంత వరకు అంతర్గర్భితమైయుండి బుజువుపరచబడిన వైజ్ఞానిక ఫలితాలను వెంటనే స్వీకరించి కాలాన్ని,శ్రమను తగ్గించుకొని ముందుకు సాగిపోవచ్చును. ఈ అభిప్రాయాన్నే Dr. S. R Ranganathan గారు తమ Prolegomena to library classification అనే గ్రంథంలో ఇలా అంటున్నారు. 'To conserve the research potential of the world by eliminating the unwanted and unintended repetition of investigation it has become necessary to feed each research worker with the latest results and the nascent idea bearing on his work—pin-pointedly, exhaustively and expeditiously.' p – 122.

ఇది, Documentation and Abstracting articles in periodicals అనే నూతన ప్రకియల వల్ల సాధ్యమౌతుంది. ఈ ప్రక్రియల్ని గ్రంథాలయాధికారి సేవలద్వారా (Reference Service) సాధిస్తున్నాడు. ఇలా చేయడంవల్ల వైజ్ఞానిక, సాంకేతిక క్షేత్రాల్లో సమాన వికాసాన్ని సాధించి, ఇతర దేశాల చేతుల్లో దేశీయులు కీలుబొమ్మలు కావలసిన స్థితి నివారింపబడుతూంది.

## పుస్తక ప్రపంచం :

సంఘాన్ని, దేశాన్నిగూర్చిన భావవిని మయాన్ని సంపాదించేందుకు తేటగా, సుస్పష్టమైన మార్గంలో వ్యక్తీకరించే గ్రంథాలున్నాయి. నేడు భారతదేశాన్ని గూర్చి తెలుసుకోవటానికి పాఠకుడు మిస్ మాయో (Miss Mayo) గ్రంథాలు చదువ నక్కర లేదు. కమ్యూనిజాన్ని గూర్చి తెలుసుకోవాలంటే అమెరికన్ రచయితల గ్రంథాలు చదువనక్కర లేదు. గ్రంథాలు సమకాలిక ప్రాచీన రచయితల్ని వేర్వేరుగా పాఠకునికి పరిచయం చేస్తాయి.

భాషాంతరీకరణం తదితర భాషావిషయిక సమస్యలన్నీ స్వయంచాలన భాషాంతరీకరణ యంత్రాల (Automatic translating machines) ద్వారా నిముషాలమీద చక్కబెట్టవచ్చు. అంతర్ గ్రంథాలయ పుస్తక ఋణ విధానం (Inter library loan system) సాయంతో ప్రాంతీయ గ్రంథాలయం (Regional library) మొదలుకొని జాతీయ గ్రంథాలయం (National library) వరకు పరస్పర సహాయ సహ

కారాలు పొందవచ్చు. యునెస్కో (UNESCO) వారు తయారుచేసిన భాషాంతరీకరణ సూచి (Index Translationum) విదేశ భాషల్లో అనువదింపబడిన గ్రంథాల పేర్లను ఏకత్రితంచేసి చూపుతోంది. దీని వల్ల చాలా సమస్యలకు, పరిష్కార మార్గాలను ఆయా దేశాల్లోని పరిశోధన కేంద్రాల్లో ఏవిధంగా తీసుకోబడిందో తెలుసుకొని గ్రంథాలయాధికారి దేశీయులకు చక్కని మార్గాన్ని చూపడానికి శీర్షికల సూచికను (Subject Bibliography) దేశీయ సూచికలను (National Bibliography) తయారు చేయును. అదేవిధంగా దేశంలో ప్రచురింపబడ్డ విశిష్ట గ్రంథాలను ప్రపంచ వార్షిక చిత్రపటం (World year maps) లో సూచించి తదనుసారం శీర్షికల సూచికను, గ్రంథకర్తల సూచిక (Author Index) ను తయారు చేసి ప్రపంచ పౌరుల కందించేవాడు పుస్తకాలయాధికారి ఒక్కడే.

గ్రంథాల క్రోడీకరణం (Acquisition) ప్రమాణీకరణం (Standardisition) వ్యాపనము (Distribution) లలో విశిష్ట విధానానుసరణాన్ని అంతర్జాతీయ, జాతీయ స్థాయుల్లో గ్రంథాలయాధికారి చేస్తున్నాడు. యువకులకు విద్యాబోధనతోబాటు తర్ఫీదు (Training) నివ్వడంలో నూత్న నైపుణ్యం మారే సాంకేతిక విలువల దృష్ట్యా చెప్పడంలోను, దేశాభివృద్ధికి దోహదకరమైన వృత్తి విద్యను బోధించటంలోను ఆతని పాత్ర స్మరణీయ మౌతూంది. అంతర్జాతీయ లిఖిలపత్రాల సూచికలు (International documentation lists) ప్రపంచ పుస్తకాలయాధికారులకంతా మిక్కిలి ఉపయోగకారి. దీనితో వారు వ్యవస్థ నంతటినీ ఏకీభవింపజేయుటంలో ఊర్ధ్వ ముఖ నిర్మాణాన్ని సరళరేఖా నిర్మాణాన్ని (Vertical & Horizontal Construction) పెద్ద యెత్తున చేస్తున్నారు. దాని కిప్పటి పరిస్థితులే సర్వవిధాలా అనువైనవి. ఆ సూచికలు ఎంత త్వరగా తయారైతే అంత త్వరగా కర్మాగారాలనుండి, పరిశ్రమలనుండి లాభాలను ఆశించినంత పొందవచ్చు. కాని ఒక్కటి మాత్రం గుర్తుంచుకోవటం అవసరం. అదేమంటే ఈ సూచికలు ఎప్పుడు నిర్మించినా అది నిత్యనూతన నిర్దిష్టం (up-to-date) గా ఉండేటట్లు అనుశీలింపవలసి ఉంది.

## కొన్ని అపోహలు - సమాధానాలు

మన దేశంలో కొందరి అభిప్రాయ మేమంటే గ్రంథాలయాధికారుల సేవలు (Librarians Services) గ్రంథాలయ విజ్ఞాన నైపుణ్యాలు (Library science and its technique) సంఘాని కేమాత్రం ఉపయోగపడవని పైగా దేశాభివృద్ధికోసం ఖర్చు చేయబడే ఆర్థిక పెట్టుబడుల్ని అపమార్గానికి త్రిప్పేస్తూందని అపోహపడుతున్నారు. ఇంతేకాకుండా గ్రంథాలయాధికారుల సేవలు ఉత్పత్తిదాయకాలు (Production Oriented) కావనీ పూరింపరాని వినిమయాలే (Irreparable Consumption) నని భ్రాంతి పడుతున్నారు.

సాంకేతిక నైపుణ్యంతో కూడిన ఒక ఉద్యోగ నిర్వహణానికి అభ్యాసమే గాక (Practice) అనుభవమే (Experience) గాక మానవ మనస్తత్వ జ్ఞాతత్వం ఎంతో అవసరం. ఇది యంత్రం (Machine) తో మానవ మస్తిష్కం (Human mind) పోటీపడడం లాంటిది. గ్రంథాలయాధికారి పాఠకులకు ఉత్తమ స్నేహితుడుగా, మార్గదర్శకుడుగా, గురువుగా, కుటుంబ సభ్యునిగా, తత్వవేత్తగా అన్నిరకాల శాయశక్తులా సాయపడుతున్నాడు. ఏ యితర ఉద్యోగ విషయంలోను యిన్ని రకాలుగా యిన్ని ముఖాలుగా ఒక వ్యక్తి వ్యవహరించడంలేదు. ఇలాంటి బహుముఖ ప్రజ్ఞాశాలి, విరాట్ స్వరూపంల వాడొక్క గ్రంథాలయాధికారి మాత్రమే !

లిఖితాధార పత్రాలు (Documentation lists) వాటి ప్రత్యేకమైన సూచికలు (Special Indexes) తయారుచేయటంలోను, ఆ యా సంవత్సరాల్లో వెలువడ్డ ఉత్తమ గ్రంథాలను ప్రజల ఉపయోగార్థం వారి వారి విద్యా, గ్రహణస్థాయుల్నిబట్టి అందించడంలోను ఒక గ్రామీణ గ్రంథాలయాధికారి సైతం ఈ విజ్ఞాన పరిశోధనా మహాయజ్ఞంలో తానూ ఓ సమిధగా మారిపోతున్నాడు. పై చెప్పిన అపోహకు ముఖ్యకారణ మేమంటే గ్రంథాలయాధికారి రాజకీయ నాయకుల్లా వేదిక లెక్కి ఉపన్యసించడు. ఆతని కార్యక్రమాలు, మేధాశక్తులు, నైపుణ్యాలు ప్రత్యక్షంగా సంఘానికి కనబడవు. ఆతడు పరోక్షంగా

విజ్ఞాన విస్తృతినిచేసే ఓ మేధావి అనటం సమీచీనంగా ఉంటుంది.

భారతదేశంలో ప్రతి సంవత్సరం 15,000 వైజ్ఞానిక పట్టాలు (Scientific Patents) నమోదవుతూన్నా అవి నూతన విషయ ప్రతిపాదకాలు గాక పాతవానినే తిరగవేస్తున్నాయి. ఇలా వైజ్ఞానికులవే, సాంకేతిక నిపుణులచే ఓ ప్రయోగం చర్విత చర్వణం కాకుండా ఉండాలంటే వారికి ప్రపంచంలో జరిగే విషయాలను తెలిపే ప్రామాణిక లిఖితాధార పత్రాలను, తత్సూచికలను అందుబాటులో నుంచాలి. వీని వ్యాప్తికి పాటుపడేవాడెవరు? ఆతడే గ్రంథాలయాధికారి.

## గ్రంథాలయాలు–కొన్ని సమస్యలు

పురోగమించే దేశాల్లో (Deve oping Countries) గ్రంథాలయాలు మిత వ్యయమనే సమస్యను ఎదుర్కోవలసి ఉంటుంది. ఏ గ్రంథాలయమూ ప్రపంచంలో వెలువడే అన్ని గ్రంథాలు, సూచికలు, పత్రికలు కొనటానికి తగిన ఆర్థిక స్తోమతను గల్గియుండదు. ఇది ఆర్థిక సమస్య. పైగా వార్తాపత్రికలు, సంక్షిప్త చిత్రాలు (Documentary films) ఫోటోస్టాట్ కాపీలు, తాళపత్ర గ్రంథాలు (Palm-leaf manuscripts) మృణ్మయ ఫలకాలు (Clay tablets) ప్రాచీన బంగారు నాణాలు (Ancient gold Coins) గ్రామఫోను రికార్డులు, టేప్ రికార్డులు, ప్రతిమలు (Statues) ఇలాంటి వస్తువుల్ని సేకరించడంలోని వ్యయ ప్రయాసలూ, సేకరించిన తరువాత భద్రపరచడంలోని తగు జాగ్రత్తలూ గ్రంథాలయంలో స్థలాభావం (Space Problem) యిలాంటి వన్నీ సమస్యలే. ఇవి విజ్ఞానాన్ని సత్వరంగా విస్తరింపజేయటంలో మాధ్యమికాలు. (Mediums) ప్రజల్లో గ్రంథాలయ బుద్ధిని (Library Consciousness) ప్రేరేపించడంలో వీటికెంతో విలువ ఉన్నది.

వీటిని భద్రపరచిన తర్వాత వివిధ అభినివేశాలు గల పాఠకులకు అందుబాటులో నుండేటట్లు చూడడం ఒక్క గ్రంథాలయాధికారివల్లనే జరగదు. ఇతర ఉద్యోగుల్ని నియమించాలి. ఇది మళ్లీ ఆర్థికవిషయంతో లంకె. కాబట్టి ప్రపంచపౌరుల సహకారమే గాక దేశీయ ప్రజల్లో పౌరసత్వం, తమ ఉదాత్త జాతీయవారసత్వంపై భక్తివిశ్వాసాలుంటేనేగాని గ్రంథాలయం సర్వతోముఖాభివృద్ధి నొందజాలదు.

ఏదో ఒక సంఘానికే ఒక భాషాప్రజకే పారిభాషిక పదజాల సమస్య జనింపదు. ఈ యిక్కట్టును తగ్గించుకోవటానికి భాషా ప్రభేదాల సమస్యను నివారించడానికి కొన్ని సంకేతములు (Symbols) సాంకేతిక పద్ధతుల్ని పాటించాలి. పంచ్‌కార్డులు (Punch Cards) భాషాంతరీకరణంచేసే కంప్యూటర్లతో భాషా జనిత భేదాలను తొలగించడానికి భావ సామగ్రిని గుర్తించుటకు వీలుగల్గుచున్నది. ఇవి నేటి నూతన విధానాలు. మరొకటి ఏకైక భాషలో అనూదిత గ్రంథాల పేర్ల పట్టిని (Catalogue) వర్గీకరించి ప్రకటించుట. భాషాంతర భాషాంతరీకరణమే దీనికి (Translation Translationum) సరైన పరిష్కార మార్గము. ఇలాంటి క్యాటలాగును ప్రచురించడానికి పూనుకొన్న యునెస్కో (UNESCO) సంస్థవారు ఫ్రెంచి, రష్యన్ ఆంగ్లభాషల్లో వెలువడ్డ అనువాద గ్రంథాల పట్టికను ప్రచురించింది. ఇలాంటి కార్యానికి మనదేశంలో యింకా కొంతకాలం పట్టవచ్చు. విదేశ భాషలు తెలిసినవారు ఆ కార్యక్రమ విధానాన్ని పరిశీలించి రాష్ట్రస్థాయిలోనో, దేశస్థాయిలోనో అట్టి గ్రంథతంత్ర సూచికలను ప్రచురింపవచ్చు. ఇలాంటి కార్యక్రమాన్ని పాటించడంలో సత్వర సహాయాన్ని అందించి మార్గనిర్దేశం చేసేవాడు గ్రంథాలయాధికారి ఒక్కడే.

వార్షిక గణాంక గ్రంథాలు (Statistiscal year books) సర్వవిషయ సమీక్షా స్వరూపాలైన మాస పత్రికలు (Cumulative Monthlies) ఆధునికంగా అభివృద్ధిచెందే నూతన భావాలు—వీటి నన్నిటినీ గ్రంథాలయాధికారి ఎప్పటికప్పుడు పాఠకులకు తెలియపర్చటం వల్ల సమాజం కొత్త శక్తిని పుంజుకొని ఆ శక్తి యితర ప్రాంతాలకూ వ్యాపిస్తోంది.

## ప్రస్తుత పరిస్థితి :

ఈ నాడు నూరు అంతర్జాతీయ వ్యవస్థలు నలభై రెండు దేశాల్లో ఒకే కార్యనిర్వహణకు కలిసి కట్టుగా కృషి చేస్తున్నాయి. ఆ యా వ్యవస్థలోని వ్యక్తులు 'వివిధ దేశీయులేయైనా వారి ఉత్సాహ

ప్రోత్సాహాలకు భాషా భేదాలుగాని, జాతీయ భేదాలుగాని ఏవీ అడ్డురావటం లేదు.

నేడు నివేదన పత్రాల (Reports) నిర్మాణ విషయంలోగాని, వాటి రచనాస్థాయిని ఉత్తమంగా ప్రదర్శించడంలోగాని, అది అందరికీ ఉపయోగపడేట్లు చేయడంకూడ ఓ సాంకేతిక విద్య (Technical still)గా పరిగణించబడుతోంది. గ్రంథతంత్ర సూచికా ఉపకరణాన్ని (Bibliographical tool) ఉపయోగించటం, విశిష్టంగా నిర్మించటంకూడ ఓ ప్రత్యేక నైపుణ్యంగా గుర్తించబడుతోంది.

## గ్రంథాలయాధికారి గౌరవస్థానం

దేశ విదేశీయులు కలిసి చేసే పరిశోధనలవల్ల ఆధునిక ప్రపంచంలో గ్రంథాలయాధికారి స్థాయి పెరిగి ఉన్నత స్థానంతోబాటు సంఘంలో బాధ్యత మరింత పెరిగింది. ఆధునిక ప్రపంచంలో గణిత శాస్త్రం (Mathematics) భౌతిక విజ్ఞానశాస్త్రం (Physics) అంతరిక్ష పరిశోధనలకు దారితీసోంది. ఒక శాస్త్రవేత్తకు మరో శాస్త్రంలో ప్రవేశంఉన్నా ఆయా శాస్త్రజ్ఞులకు వారి వారి క్షేత్రాల్లోనే ఎక్కువ ప్రావీణ్యం ఉంటుంది. కాని ఆయా శాస్త్రవేత్త ఇతర శాస్త్రాలను తన శాస్త్రజ్ఞాన స్థాపనకు నిపుణంగా మలచుకొంటాడు. ఒక సమస్యను గ్రహించి పరిశీలించడంలో ఇద్దరు వ్యక్తుల దృష్టికోణం (View Point) భిన్నంగా ఉంటుంది. దీనికి కారణం మనస్తత్వంలోని భేదమేగాని విద్యా వయః పరిమితులు కావు. ఉదాహరణానికి—

నేరము శిక్షలపై (Crime and punishment) పరిశోధనలు జరిపినచో జీవశాస్త్రం (Biology) జీవోత్పత్తిశాస్త్రం (Genetics) మనస్తత్వ శాస్త్రం (Psychology) జనసంఘ శాస్త్రం (Sociology) న్యాయశాస్త్రం (Law) రాజకీయ విజ్ఞానం (Political Science) మనో ఆత్మల సంబంధశాస్త్రం (Psychiatry) ప్రజాపరిపాలన (Public Administration) శిక్షాస్మృతి శాస్త్రం (Penology) ప్రయోగాత్మక జనసంఘ శాస్త్రం (Applied Sociology) మనుష్యవర్ణన శాస్త్రం (Anthropology) యిత్యాది శాస్త్రాల ఆధారాలు లేనిదే తీర్పు జరగడానికి వీలులేదు. ఇటువంటి పరిశోధనలు పెద్ద యెత్తున ప్రతి సమస్యావిషయంలోనూ చేయటం కుదరదు. గ్రంథాలయాధికారి ఒక్కడే యిట్టి పరిశోధనల్లో నైపుణ్యం, అనుభవం గలవాడై తన సహాయ సహకారాది సేవలు అల్పవ్యవధిలోగాని (Shart Range Reference Service) విస్తృత వ్యవధిలోగాని (Long Range reference Service) అందించును. అన్యశాస్త్ర జ్ఞానావశ్యకత నేడు ప్రతి పరిశోధనలో తప్పనిసరి ఔతూంది.

గతంలో సమకాలీనత్వాన్ని సూక్ష్మదృష్టితో పరిశీలిస్తేనే తెలుస్తుంది. లేకుంటే ఆ విషమ స్థానాలు చల్లగా జారుకొనే మంచుబిందువులే.

## ఆధునిక నాగరకత—మానవుని మేధస్సు:

ఓ నాల్గురోడ్ల కూడలిలో ఓ గాడిద మూటలు మోస్తూపోవడం, కుర్రవాళ్లు సైకిలు తొక్కడం, కార్లు జెట్టుల్లా ప్రాకడం, ఆకాశంలో విమానాలు పయనించడం యిలాంటి వివిధరకాలైన వాహనాలు మానవజాతియొక్క 2000 సంవత్సరాల అనుభవాన్ని తమతో మోసుకొని తిరుగుతున్నాయి. ఈ వాహనాలనుపయోగించే ప్రజలు వివిధ అంతస్తులకు చెందిన వారని చెప్పనక్కరలేదు. ఇంతటి విపరీతత్వానికి, తారతమ్యానికి కారణం? ప్రతివ్యక్తి తన బౌద్ధిక వికాసాన్ని సృజనాత్మకంగా మలచుకోలేక పోవడమే. ఆవశ్యకమైన మార్పును, ఆలోచనలను సకాలంలో గ్రహించి నిపుణతతో వాటిని అభివృద్ధి చేసుకొనే పద్ధతిని విద్యార్థికింకా మనదేశంలో బోధింపబడడం లేదు. విద్యార్థికి సైతం విద్యార్జనపట్ల ఆసక్తినీ, గ్రంథాలయ బుద్ధినీ (Library Consciousness) గల్గించే విద్యావిధానం ఏర్పడలేదు. విద్యార్థిలోనూ సూక్ష్మపరిశీలనాదృష్టి ఇంకా పరిపక్వదశకు చేరలేదు.

## నేటి విద్యావిధానంలోని లోపాలు:

విద్య అంచెలంచెలుగా అభివృద్ధి చెందే స్వభావం గలది. అంతేకాని ఏకధారగా సరళరేఖవలె సాగే అభివృద్ధిమాత్రం కాదు. ఆ స్థితికి చేరుకొంటే మనం ప్రతిసంవత్సరం రామన్లనూ, టాగోర్లనూ తయారుచేయవచ్చు. విషయసామగ్రిని, బోధనా పద్ధ

తుల్నీ మానవునియొక్క సహజబుద్ధి శక్తితో సమస్య యించేటట్లు ఏర్పాటుచేయటంలో విద్యావేత్తలు తప్ప టడుగు వేస్తున్నారు. మనదేశం మానవుని సహజబుద్ధి వికాసానికి దోహదం తగినంతగా కల్పించటం లేదు. ఎందరో ఇంజనీర్లు, సాంకేతిక, కళా పట్టభద్రులు నిరుద్యోగులుగా నిలుచున్నారు. పెద్దయెత్తున దేశ సహజ సంపదలను (Natural Resources) వారిని చదివించటంలోనే వెచ్చించినా నేడు వారు తమ కనీసపు కోర్కెల్ని సైతం తీర్చుకోలేక పోతున్నారు. వ్యాపార వృత్తాలను (Trade Cycles) స్వాధీనంలోకి తెచ్చుకొన్న సక్రమ ప్రణాళిక ఉన్నా దేశసంపద ఎందుకు నష్టమౌతూ వుందో నిరుద్యోగుల సంఖ్య నానాటికీ ఎందుకు పెరిగిపోతూందో తెలియటం లేదు.

మనది ప్రజాప్రభుత్వం. (Democracy) అబ్రహాం లింకన్ ప్రవచించిన నిర్వచనం నేడు మన దేశం ఎంతవరకూ పాటిస్తోందో తెలియటం లేదు. ప్రజా ప్రభుత్వం సఫలీకృతం కావాలంటే ప్రజల్లో నైతిక విలువలు ధర్మబద్ధంగా ఉండాలి. దేశభక్తి, ఐకమత్యం, నిస్వార్థ సేవ ఉంటేనే ఈ ప్రభుత్వం సుస్థిరంగా నిలబడుతుంది. పై చెప్పిన అంశాలన్నిటినీ నిస్వార్థంగా నిర్వహించే సేవకుడు గ్రంథాలయాధి కారిగా ఉండాలి. సంఘ సేవే అతని జీవన లక్ష్యంగా మారాలి. అప్పుడు ప్రతిపౌరుడూ ఓ గ్రంథాలయాధి కారియే!

## సింహావలోకనం—ఉపసంహారం :

పురోగమిస్తున్న దేశంలో (Developing Country) గ్రంథాలయాధికారి ప్రపంచ పోకడల్ని క్రోడీకరించటం, పఠనసామగ్రినంతటిని చదువరుల కందుబాటులో నుంచటం, దేశీయ వైజ్ఞానికులను, మేధావంతులను అంతర్జాతీయ పరిశోధనా మార్గానికి తెచ్చి నిలబెట్టటం, సర్వతోముఖాభివృద్ధికి సర్వవిధ సహాయ సహకారాలను ఉదాత్త దృష్టితో లందించ టంలో ఆతనిపై గురుతరమైన బాధ్యత ఉంది. మన సాంకేతిక విలువలు నేడు ప్రపంచంలో పెరిగే పోటీలముందు నిలవడానికి చాలనందున పౌరుని సహజశక్తి సామర్థ్యాలకు పదునుపెట్టి అంతర్జాతీయ స్థాయికి తేవటంలో గ్రంథాలయాధికారి ప్రముఖ పాత్ర నిర్వహిస్తున్నాడన్న విషయాన్ని విస్మరించ రాదు.

(అయిపోయింది)



# శబ్దాలు

## శ్రీ నెల్లుట్ల వేంకటేశ్వరరావ్

నిఘంటువుల మూసిన పుటల,
నిశ్శబ్దపు పొరల్లో,
నిద్రిస్తున్న శబ్దాల; మౌన గర్భాలలో,
బడబాగ్ని రూపంగా,
జఠరాగ్ని కోపంగా,
పూల గుండెలలోని,
పుప్పొడికి సమంగా,
అణగి వున్నాయి అర్థాలు.
నీటి గుండెల గుబుర్లలో,
సిగమాల వూపిరులున్నాయి,
నిరీశ్వరవాదం ఆవిరులున్నాయి,
పగడాల పెదవులమీద కదలే,
చిగురుటాశల సొగసులున్నాయి.
వెన్నపూసతో పోటీ చేయగలవు కొన్ని,
వెన్నుపూస విరిచే లాఠీ చేవగలవి కొన్ని.
నియంతల దురంతాలపై,
నిప్పులై కురియగలవు కొన్ని.
నీరజాక్షి దృగంచలాలలో,
వెన్నెలై విరియగలవు కొన్ని,
గాలి తరగల్లాంటి వూహలకు,
పూల దుస్తులు వేసేవి కొన్ని,
కడలి తరంగాల్లాంటి భావాలకు,
కత్తుల వాడిని పంచేవి కొన్ని.
ఎన్ని యుగాలు గడచినా,
వాడనివీ శబ్ద సుమాలు !
ఎన్ని యుద్ధాలు చేసినా,
వాడి తగ్గనివీ శబ్ద కృపాణాలు !
మాలలుగా అల్లుకోవచ్చు,
మంటలుగా మార్చుకోవచ్చు.
మాసిపోని మమతల మల్లెలుగా,
మనసుల్లో దాచుకోవచ్చు,
ఒకచోట హిమబాలలై
నర్తిస్తాయి యివే !
ఒకచోట సుమ శరాలై,
దూసుకుపోతాయి యివే !
ఒకచోట కాలుతున్న హృదయంతో కలిసి,
ఫాలనేత్రంలోని జ్వాలలై,
భగ్గుమంటాయి యివే !
ఈ నిద్రిస్తున్న శబ్దాలలో,
అలలెత్తే చైతన్య స్రవంతు లున్నాయి,
అలసట తీర్చే మమతల మారుతా లున్నాయి,
అలకలుతీర్చే చెలికాని వలపుపాట లున్నాయి,
అనురాగం పెంచే,
జవరాలి చిలిపి వలపుల మూటలున్నాయి,
ఆధియుగంలోని, అంధజీవితం వుంది,
ఆగాయి యుగంలోని, విమల ప్రభాతం వుంది,
నిద్రిస్తున్న యీ శబ్దాలే,
కళ్లుతెరిచే,
ఊహలకు, భావాలకు,
ఉద్యమాలకు, ఉద్రేకాలకు,
హృదయంలో మొలిచే ప్రతి ఆలోచనకు,
అధరాల అంచుల చేరే ఆవేశాలకు,
మంచి రూపాలను,
పంచ ప్రాణాలను,
ప్రసాదించే పుణ్యదేవతలు !
ఈ శబ్దాలే వజ్రాయుధాలు,
ఇవే వకుళ సుమాలు,
మారణ గీతాన్ని లిఖించుకోవచ్చు,
వీటితో !
జీవన గీతాన్ని రచించుకోవచ్చు,
వీటితో ! !

# ప్రపంచ అక్షర వికాసం

శ్రీ గాదంశెట్టి శ్రీరాములు

మనోభావాలను ధ్వనులద్వారా వ్యక్తపరచుటకు భాషోత్పత్తి జరిగింది. ఆ ధ్వనులను చిహ్నాలద్వారా, బొమ్మలద్వారా అభివ్యక్త పరచుటకు అక్షరోత్పత్తి జరిగింది. అక్షరమనగా క్షరము లేనిదని గదా! అర్థం. ఈ అక్షర వికాసాన్నే 'లిపి వికాసం' అన్నారు. తొట్ట తొలుత భాషోత్పత్తి ఎలా జరిగిందీ? అన్న విషయం పైన భేదాభిప్రాయాలున్నట్లే అక్షరాలు ఎలా పుట్టుకొచ్చాయి? అన్న విషయంపైనకూడా విభిన్న దేశాలలో విభిన్న అభిప్రాయాలున్నాయి.

భారతీయులు వేదాలను అపౌరుషేయములన్నట్లే భారతీయ లిపులకు పట్టుకొమ్మ అయిన బ్రాహ్మీ లిపిని బ్రహ్మదేవుడే సృష్టించాడని నమ్ముతారు. ఇలాగే ఈజిప్టు, బాబిలోనియా, యూనాన్ మొదలగు దేశస్థులుకూడా తమ తమ లిపులు ఆయా దేశాల పౌరాణిక వ్యక్తులద్వారా ఉత్పన్నమైనట్లే నమ్ముతారు. కాని భాషవలె లిపి విషయంలోకూడా ఈ లాంటి నమ్మకాలు మూఢనమ్మకాలేనని తేలిపోయింది. తనకు తోచిన విధంగా మానవుడే లిపిని పుట్టించాడన్న వాదమే నేడు సర్వసమ్మతమైనది.

నేటి ప్రపంచ లిపులలో ఏదీకూడా ఒకేమారు స్థిరీకరించబడినదికాదు. ఒకనాటి చిహ్నాలూ, బొమ్మలూ పిచ్చి గీతలుగావున్న స్వరూపాలే కాలక్రమేణా వికాసం పొంది ఈ నాటి స్థితికి వచ్చాయి.

లిపి వికాసం విషయంలో నేడు మనకు లభించిన ప్రాచీన సామగ్రి ఆధారంగాచూస్తే క్రీస్తుకు పూర్వం నాలుగువేల సంవత్సరాల ప్రాంతంవరకూ వ్రాతకు సంబంధించి స్థిరీకరించిన పద్ధతి ఏదీ వికాసం చెందినట్లు లేదు. షుమారుగా క్రీస్తుకు పూర్వం ఆరువేల సంవత్సరాల క్రితంలో లిపియొక్క ప్రారంభిక వికాసం జరుగుచుండినట్లు ఆధారాలు లభించాయి.

## లిపి వికాసక్రమం :

లిపి వికాసక్రమంలో ముఖ్యంగా (1) చిత్రలిపి (2) సూత్రలిపి (3) ప్రతీకాత్మక లిపి, (4) భావమూలిక లిపి, (5) ధ్వని మూలక లిపి లనునవి ప్రముఖ స్థానాన్ని ఆక్రమించాయి. వీటియొక్క సంక్షిప్త పరిచయం ఈ క్రింద ఇవ్వబడుచున్నది.

## చిత్రలిపి :

బొమ్మల వ్రాత—చిత్రలిపి—క్రమంగా అక్షరాలుగా పరిణమించింది. వ్రాత చరిత్రలో అతిపురాతనమైన లిపి చిత్రలిపిగా పేర్కొనబడినది. ఈ చిత్ర లిపి క్రమక్రమంగా ఒకవైపున అందమైన అక్షరాలకు దారితీయడమేకాక మరియొకవైపున చిత్రకళకు కూడా ఆధారభూతమైనది. ఆనాటి మానవుడు పర్వత గుహలలోనూ ఇతర వస్తువులపైనహా చెట్లు చేమలు, ఫలపుష్పాలు, మానవ శరీరాంగాలు వగైరా బొమ్మలూ మరి ఎన్నో వంకరటింకర బొమ్మలూ వేసి వుంటాడని ఊహించబడుచున్నది. ఈలాంటి బొమ్మలు ఈజిప్టు, ఫ్రాన్స్, స్పెయిన్, మెసపటేమియా, ఇటలీ, పోర్చుగల్, సైబేరియా, సిరియా, గ్రేట్ బ్రిటన్, కేలిఫోర్నియా, బ్రెజిల్, ఆస్ట్రేలియా మొదలగు దేశాలలో లభించినవి. ఈ బొమ్మలు, రాళ్లు, బొమికెలు, కర్రఫలకలు జంతువులకొమ్ములు, ఏనుగు దంతములు, చెట్లబెరడు, జంతువుల చర్మము, మట్టిపాత్రలు వగైరాలపైన చెక్కబడి లభించినవి.

ప్రాచీన కాలంలో చిత్రలిపి బహుళ ప్రచారంలో వుండివుండవచ్చును. ఎందువల్లననగా దీని ఆధారంతో ఏ వస్తువునైనా దాని బొమ్మ గీయడం ద్వారా ఇతరులకు తెలియచేయవచ్చును. ఒకవిధంగా ఆనాడు ఈ లిపి అంతర్జాతీయ స్థానాన్ని పొందియుండవచ్చును. ఎందువల్లననగా ఏ వస్తువుయొక్క

గాని, జంతువుయొక్కగాని బొమ్మలు ప్రపంచమంతా వకేరకంగా వుండును గదా?

ఈజిప్టు చిత్రలిపులు ఫినీషియా, గ్రీసు, రోము దేశాలమీదుగా తక్కిన పాశ్చాత్యదేశాలు చేరడానికి నాలుగువేల సంవత్సరాలు పట్టింది. ఈ మహా ప్రయాణంలో ఎన్నోమార్పులు జరిగాయి. దూరం మారిపోయింది. దారిమారింది. నాగేటిచాలులాగా కుడినుండి ఎడమకు మరల ఎడమనుండి కుడికి ప్రయాణం చేశాయి. ఫినీషియనుల ఓడలలో ప్రయాణం చేశాయి. గులాములు మోసకపోయే పెప్పైరస్ చుట్టల బుట్టలలో ఊరేగాయి. దేశాలు తిరిగే సన్యాసుల వీపుల సంచులలో విశ్రమించాయి. ఈ సముద్ర సంచారంలో పోయినవి పోగా పాతవాటికి కొత్త అక్షరాలు తోడయాయి, ఇంతగా తిరిగి తిరిగి పూర్వ స్వరూపం గుర్తుపట్టనంతగా మారిపోయి నేటి పాశ్చాత్య లిపులరూపం దాల్చాయి.

## చిత్ర లిపిలోవున్న ఇబ్బందులు :

వ్యక్తి వాచకనామములు వ్యక్తీకరించుటకు ఇందులో సాధనాలు లేవు. మనిషి బొమ్మ వ్రాయ వచ్చునేగాని రాముడు, గోపాలుడు, సీత అన్న పేర్లు ఎలా వ్రాయడం? ఈ దశలోనే అక్షరాలు ఆవిర్భవించాయి.

స్థూలవస్తువుల బొమ్మలు గీయవచ్చునేగాని భావాత్మకమైన బొమ్మలు గీయడం సాధ్యపడేదిగాదు. త్వరత్వరగా బొమ్మలు గీయడం సులభం కాదు. కాలము మొదలగు భావాలను వ్యక్తీకరించుటకు ఈ లిపిలో సాధనాలు లేవు. ఇంతేగాకుండా బొమ్మలు గీయడానికి ప్రతి వ్యక్తీ కళాకారుడు గావడం సాధ్యపడేదిగాదు.

చిత్ర లిపియే వికాస క్రమంలో సంకేతాత్మక మైంది. ప్రతి వస్తువుకూ బొమ్మగీసి చూపించడం అధిక కాలహరణకు దోహదం చేస్తుంది గాబట్టి ఒక్కొక్క వస్తువుకు ఒక్కొక్క గుర్తుగీసి చూపించడం ఆచారమైపోయింది. ఆయా గుర్తులు ఆయా వస్తువుల బొమ్మలయొక్క సంక్షిప్త రూపములుగానే ఉండెడివి. ఈజిప్టువారు ఇరవై అయిదు ధ్వనివాచక సంకేతాలను వాడడం మొదలుపెట్టారు. ఇది చాల సులువుగా జరిగింది. ఈజిప్టువారి భాషలో చాల చిన్న పదా లున్నాయి. ఉదాహరణకు 'రు' అంటే నోరు. నోటి బొమ్మ నోరు అనేదానికే గాక ఈ పదం మొదటి అక్షరమైన 'ర్' (R) అనేదానికి గూడా సంకేతమైంది. ఈ విధంగా పెక్కు చిత్రలిపులు అక్షరాలుగా వాడుకకు వచ్చాయి.

## సూత్రలిపి లేక ముళ్ళవ్రాత :

సూత్రలిపి చరిత్ర కూడా చాలా పురాతనమైనది. దీని పరంపర ప్రాచీనకాలంనుండి నేటివరకూ ఏదో ఒక రూపంలో వస్తూనే ఉన్నది. జ్ఞాపకం కొరకు నేడు కూడా తుండుగుడ్డకు ముళ్ళు వేసుకోవడం ఉన్నది. వ్రాత తెలియకముందు ప్రజలు ఇలాంటి ముడుల వ్రాతనే వాడేవారు. నేటికీ మన దేశంలోని కోయలు, లంబాడీలు మున్నగు ఆదిమజాతివారు గుర్తులకోసం ఇలాటి రకరకాల ముళ్ళు వేసుకొంటూ ఉండేవారు. పాతకాలంలో చీనా దేశీయులు ఈ విధంగానే వ్రాసే వారట. దక్షిణ అమెరికా ఖండంలోని పెరూ దేశీయులు ఈ ముళ్ళవ్రాతలో నేర్పు సంపాదించారు. నేటికీ ఆ దేశం గొర్రెల కాపర్లకు ఈ గ్రంథిభాష తెలుసు.

రంగు రంగుల దారాలు కర్రకుచుట్టి ముడి వేస్తారు. ఈ ముళ్ళు దగ్గర దగ్గరగాఉంటే అతి ముఖ్య విషయం. నల్లదారపు ముడి మరణానికి సూచన. తెల్లదారపు ముడి వెండి లేకపోతే శాంతి. ఎర్రదారపు ముడి యుద్ధం. పసుపుదారపు ముడి బంగారం. ఆకు పచ్చ ముడి ధాన్యం. ముళ్ళకు రంగులు వేయకపోతే సంఖ్యలన్న మాట. ఒంటి ముళ్ళు పదులు. జంట ముళ్ళు వందలు, ముమ్ముళ్ళు వేలు. ఈ అక్షరాలను చదవడం సులభం కాదు. దారాలు సన్ననా, లావువా, ముడి వదులుగా వుందా, బిర్రుగా ఉందా, ఎలా వేశారు, ఏ వరుసలో ఉన్నాయి? అనేవి చూడాలి. మనమంతా పిల్లతనంలో ఓనమాలు నేర్చుకున్నట్లే పెరూదేశపు పిల్లలుకూడా ఆ కాలంలో ఈ గ్రంథి వర్ణమాలను—ముళ్ళ అక్షరాలను—నేర్చుకొన్నారు.

ఈలాంటి వ్రాతను అయిదవ శతాబ్దపు గ్రంథ కారుడు హేరోడోటస్ ప్రస్తావించాడు. పెరూదేశపు 'క్వీ పూ' వర్ణమాల ఇందుకు సర్వశ్రేష్ఠమైన ఉదాహరణ.

## ప్రతీకాత్మక లిపి :

సరియైన అర్థంలో లిపి లేకపోయినా, పంపిన వస్తువుద్వారా దూరపు వ్యక్తుల అభిప్రాయాలను

తెలుసుకొనే పద్ధతి ఒకటి, ఒకప్పుడు అమలులో ఉండేది. కోడిపిల్ల గుండెకాయ, దాని కొవ్వు ముక్కలు మూడు, ఒక మిరియపు గింజ కలిపి ఒక యఱ్ఱరంగు కాగితంలో పంపిస్తే యుద్ధానికి సిద్ధంగా ఉండమని అర్థం. రైలుగార్డు యఱ్ఱజండా, పచ్చజండా చూపించడం యుద్ధాలలో తెల్లజండాలు ఎగుర వేయడం, శ్రీరామచంద్రుడు సీతాదేవికి ఉంగరం పంపడం మొదలైనవి ఇందులోనుండి వచ్చినవే. మూగ, చెవిటివారల సంభాషణలుగూడా ఈలాంటి ఆధారాలపైననే జరుగుతుంటాయి.

అనాది జాతులలో నేటికీ ఈ అలవాట్లున్నాయి. ఒకతెగవారు మరొక తెగవారిపై కయ్యానికి కాలు దువ్వదలిస్తే బల్లెమో, బాణమో, పంపించేవారు. బుద్ధుని సదుపదేశం విని సన్మార్గానికి వచ్చిన అంగులీమాలుడనే వ్యాధ చోరుని కథ మనం వినే వున్నాము. అతడు ఎంతమందిని చంపాడో గుర్తు తెలియడానికి చంపిన వారి వక్కొక్క వేలుకోసి మాలగా గుచ్చి మెడలో వేసుకొన్నాడట. కనుకనే అతనికి అంగులీమాలుడనే పేరు వచ్చింది, ప్రజలు వ్రాత నేర్చుకోడానికి ముందు వస్తువులతోనే జాబులు వ్రాసుకొనేవారు. ఈ పరంపరలో కొన్ని నేటికీ జరుగుచునే ఉన్నాయి. అల్లూరి సీతారామరాజు ఫలానా అప్పుడు దాడి చేయబోతున్నట్లు చీటీవ్రాసి, వక మిరపకాయను జతచేసి, బాణానికి గుచ్చి పోలీస్‌స్టేషన్లకు విసిరేవాడట. ఈ మిరపకాయ టపా ఆ రోజులలో ప్రభుత్వానికి కారం రాసినట్లుండేదట. నేటి కాలంలోగూడా సత్యాగ్రహాలలో, సమ్మెలలో చేరని పెద్దలకు కొంటె కోణంగులు గాజులు, కుంకుమా, పసుపూ బంగీలు పంపడం ఈ వరసలోదే.

ఇతర వ్రాతలమాదిరి ఈ ప్రతీకాత్మక వ్రాత ఎక్కువ వ్యాప్తిచెందలేకపోయింది.దీని ప్రయోగం చాలా తక్కువగానే కనుపిస్తున్నది.

## భావమూలక లిపి :

చిత్ర లిపియొక్క వికసితరూపాన్నే భావ మూలక లిపి అంటారు. చిత్రలిపిలో బొమ్మలు వస్తువులనే తెలిపాయి. కాని భావలిపిలో స్థూలవస్తువులనే గాక భావాలను కూడా తెలిపాయి. ఉదాహరణకు చిత్ర లిపిలో సూర్యునికి ఒక గుండ్రము గీచి చూపించేవారు. కాని భావ లిపిలో ఈ గుండ్రమే సూర్యునికే కాకుండా సూర్యునితో సంబంధించిన ఇతర భావాలను అనగా సూర్యభగవానుడు, ఎండ, పగలు, వెలుగు అనే అర్థాలను కూడా వ్యక్తపరచేది. కాలు, బొమ్మ చిత్ర లిపిలో కాలిని సూచిస్తే భావ లిపిలో నడకను సూచించేది. దుఃఖానికి నీళ్ల జారుస్తున్న కన్నుబొమ్మ, వినుట అనేదానికి ద్వారమువద్ద చెవి ఆనించిన బొమ్మ గీసేవారట. ఉబ్బిన తరచాప బొమ్మతో 'గాలి'ని సింహం బొమ్మతో 'ధైర్యాన్ని' చూపించేవారట. ఈ భావక మూలక లిపికి ఉత్తర అమెరికా, చైనా, ఆఫ్రికా పశ్చిమ ప్రాంతాలలో ఉదాహరణలు లభించినట్లు మన గ్రంథాలు చెబుతున్నాయి.

చిత్ర లిపి, సూత్ర లిపికంటే గూడా ఈ భావ లిపి అభిప్రాయ వ్యక్తీకరణలో అధిక ఉచ్ఛదశకు చెందినది. చీనీ మొదలగు కొన్ని లిపులలో చాలా చిహ్నాలు నేటికి కూడా ఈ వర్గానికి చెందినవే కనుపిస్తున్నాయి.

## ధ్వని మూలక లిపి :

చిత్ర లిపి మరియు భావమూలక లిపిలో వాడిన గుర్తులు లేక బొమ్మలు ఏదో ఒక వస్తువును లేక భావాన్ని ప్రకటించును. కాని అవి ఆ వస్తువుయొక్క గాని భావముయొక్కగాని పేరుతో సంబంధముగలవి కావు. ఇందుకు భిన్నంగా ధ్వని మూలక లిపిలో వాడిన గుర్తులు లేక చిహ్నాలు ఆయా వస్తువునుగాని, భావాన్ని గాని ప్రకటించకపోగా ధ్వనిని మాత్రమే ప్రకటించును. ఆ ధ్వని ఆధారంగా ఆయా వస్తువుయొక్కగాని, భావముయొక్కగాని పేరు వ్రాయుటకు వీలు కలిగేది. 'నాగరీ' లిపి, అరబ్బీ, ఇంగ్లీషు భాషల లిపులు ఈలాంటి ధ్వని మూలకమైనవే.

## ప్రపంచంలోని ప్రముఖ లిపులు :

ప్రపంచంలోని ప్రముఖ లిపులను రెండు వర్గాలుగా విభజించవచ్చును.

(1) అక్షరాలుగాని, వర్ణాలుగాని లేనటువంటి 'క్యూనీఫార్మ్' మరియు చీనీవంటి లిపులు.

(2) అక్షరాలూ, వర్ణాలూ కలిగినటువంటి నాగరి, రోమన్‌లాంటి లిపులు.

మొదటివర్గంలో (1) క్యూనీఫార్మ్ (2) హీరో గ్లాయిఫిక్ (3) క్రీట్‌లిపి (4) సింధు

ప్రాంత లిపి (5) హిట్టాయిట్ లిపి, (6) చీనీలిపి (7) ప్రాచీనమధ్య అమెరికా, మెక్సికో లిపులు ప్రధానమైనవి.

రెండవవర్గంలో (1) దక్షిణసామీ లిపి (2) హిబ్రూలిపి, (3) ఫొనేషియన్ లిపి, (4) ఖరోష్ఠిలిపి, (5) ఆర్మేయిన్ లిపి (6) అరబ్బీ లిపి (7) భారతీయ లిపి (8) గ్రీక్ లిపి, (9) లాటిన్ లిపి ప్రధానమైనవి.

నేటి పాశ్చాత్య దేశాల వర్ణసమామ్నాయానికి మాతృక అయిన తొలి వర్ణ సమామ్నాయాన్ని కని పెట్టినవారు 'సెమ్' తెగకు చెందిన 'హిక్కు'లనే వారు. వీరిని సెమెటిక్కులు, సామీలు అనిగూడా వ్యవహరిస్తారు. వీరు ఈజిప్టు వారినుంచి వ్రాత నేర్చుకొని బొమ్మలుగాని, చిత్రలిపిగాని అవసరం లేకుండా కేవలం అక్షరాలతోనే పదాలు వ్రాయడం కనిపెట్టారు. ఇది వీరి అమూల్యమైన, అపూర్వ మైన కృషి. ప్రపంచంలోని వర్ణమాలలలో వీరిదే మొదటిదని కొందరంటారు. వీరు ఈజిప్టు వారి చిత్ర లిపులనుంచి ఇరవై యింటిని మాత్రం తీసు కొన్నారు. ఆ చిత్ర లిపులను అతిసులభమైన పద్ధతిని అక్షరాలుగా మార్చుకున్నారు. ఈ సెమెటిక్ లిపిలో చెక్కిన ఒక శిలా శాసనం పాలస్తీనా ప్రాంతంలోని 'ఢీబాన్' అనే చోట 1868 లో ఒక క్రైస్తవ పాదరీకి దొరికింది. స్పష్టమైన అక్షరాలతో స్పష్ట మైన అర్థంతో ఉన్న అతిప్రాచీన శాసనాలలో మొదటిది ఇదేనని పలువురి అభిప్రాయం. అంటే క్రీస్తుకు వేయి సంవత్సరాల ముందుండి చిత్రలిపి పూర్తిగా మాయమై విస్పష్టమైన వర్ణమాలకు దీనితో స్థిరత్వం ఏర్పడింది.

## భారతీయ లిపులు :

**సింధులోయ లిపి :** భారతదేశంలో అత్యంత ప్రాచీన కాలంనుండే వ్రాత తెలిసి ఉన్నట్లు ఆధా రాలు లభించాయి. పశ్చిమ పంజాబు రాష్ట్రంలోని మాంట్‌గోమరీ జిల్లాలో హరప్పా అనే గ్రామం ఉంది. సింధు రాష్ట్రంలోని లడ్ఖానా జిల్లాలో మోహన్—జో—దారో అనే గ్రామం ఉంది. ఈ రెండుగ్రామాల త్రవ్వకాలలో ఇతర వస్తువులతోబాటు ప్రాచీన లిపుల ముద్రికలు కూడా లభించాయి. ఇలాటి ముద్రికలే మెసపొటేమియాలోనూ దొరికాయి. మెసపొటేమియా సుమేరియా జాతివారు పాలించినది. ఇవన్నీ ఇప్పటికి ఐదువేల సంవత్సరాలనాటివి. వాటిని బట్టి మనదేశంలో దొరికిన ఈ ముద్రికలు గూడా ఐదువేల సంవత్సరాల కిందివని శాస్త్రజ్ఞులు నిర్ణయిం చారు.

హేరాస్, లాంగెడన్, స్మిత్, గైడ్, హంటర్ మొదలగువారు వీటిని చదవడానికి ప్రయత్నించారు. కాని ఇంతవరకు పూర్తిగా ఎవరూ సఫలత చెంద లేదు. సింధురాష్ట్రంలోని లిపులు వెలుగులోనికి రాక పూర్వము భారతదేశంలో వ్రాత కళ చాలా తర్వాత ఆవిర్భవించినట్లు విద్వాంసుల నమ్మకం ఉండేది. మాక్స్‌ముల్లర్‌గారు పాణిని కాలాన్ని క్రీస్తుకుపూర్వం నాలుగవశతాబ్దిగా అంగీకరించారు. పాణిని తన అష్టా ధ్యాయిలో లిపిని గురించి ఏమీ ప్రస్తావించలేదు. కాబట్టి మాక్స్‌ముల్లర్ ప్రకారంగా క్రీస్తుకు పూర్వము నాలుగవ శతాబ్దికి ముందుగానే భారత దేశంలో లిపి జ్ఞానం ఉండేదని తెలియుచున్నది.

ప్రాచీన శిలాశాసనాలపైన, నాణ్యాలపైన రెండురకాల లిపులు లభించాయి. వానిలో ఒకదానిని బ్రాహ్మీ అని మరొకదానికి ఖరోష్ఠి అని అంటారు. కాని కొన్ని ప్రాచీన గ్రంథాలలో అనేక లిపుల ప్రస్తావన ఉన్నది. 'జైనుల పన్నవణా' సూత్రంలో పద్దెనిమిది లిపుల పేర్లు ఉన్నాయి. అలాగే బౌద్ధుల సంస్కృత పుస్తకమైన 'లలితవిస్తార్'లో అరవైనాలుగు లిపులు పేర్కొనబడినాయి. ఇందులో మొదటిది బ్రాహ్మీ, రెండవది ఖరోష్ఠి. ఈ రెండు లిపులను గురించి మాత్రమే నేడు భారతదేశంలో ఆధారాలు లభించు చున్నాయి.

## ఖరోష్ఠి లిపి :

మనదేశం పశ్చిమభాగంలోనూ, వాయవ్యభాగం లోనూ ప్రచారంలోఉన్న ఖరోష్ఠి లిపిలోని ప్రాచీన మైన శాసనాలు శహబాజ్‌గఢ్, మన్‌సేరాలలో లభిం చాయి. తరువాత తరువాత కొంతమంది రాజుల నాణ్యాలు, శాసనాలపైన కూడా ఈ లిపి కనుపిం చింది. ఈ లిపికి ఈ పేరు ఎలా వచ్చింది ? అనే విషయంపై విద్వాంసులలో భిన్నాభిప్రాయా లున్నాయి. ఈ లిపికి ఖరోష్ఠి అనే పేరు ఉన్నదని తెలియకముందు బాక్ట్రియన్, ఇండో

బాక్ టియన్, బాక్ట్రో, పాలీ, వాయవ్య భారత లిపి, ఈరాని—పాలీ అని ఆధునిక పరిశోధకులు అనేక పేర్లు పెట్టారు.

ఈ ఖరోష్ఠి లిపి మొదట ఉరుదూ లిపి మాదిరి కుడినుండి ఎడమకు వ్రాయబడుచుండెడిది. తర్వాత బ్రాహ్మి లిపి ప్రభావంతో వర్తమాన భారతీయ లిపుల మాదిరి ఎడమనుండి కుడివైపుకు వ్రాయబడుతూ వచ్చింది. ఈ లిపి పూర్తిగా వైజ్ఞానికమైనది కాదు. ఉరుదూ మాదిరి ఊహాత్మకంగా చదువవలసి వుంటుంది. ఇందులో దీర్ఘస్వరాలు (ఆ ఈ, ఊ, ఐ, ఔ) అసలు లేవు. ఈ లిపిని చదవడానికి అనేకమంది ప్రయత్నించారు. కాని చివరకు జేమ్సు ప్రిన్సెప్ అనే బ్రిటిష్ ఉద్యోగి 1834 లో ఈ ప్రయత్నంలో సఫలుడయ్యాడు.

## బ్రాహ్మి లిపి :

బ్రాహ్మి ప్రాచీన భారతదేశ లిపులలో సర్వశ్రేష్ఠమైనదిగా భావించబడింది. ఇదే మనదేశంలోని మొదటి లిపి అని నమ్మవచ్చును. ఈ లిపి ఉత్పత్తిని గురించి గూడా విద్వాంసులలో అభిప్రాయ భేదాలున్నాయి. ఒక వర్గంవారు విదేశ లిపులలో సంపర్కం కలిగిందని చెప్పగా, మరొక వర్గంవారు అక్షరాలా భారతీయ లిపే అంటారు. ఈ లిపిలోని ప్రాచీన తమ నమూనాలు క్రీ పూ. అయిదవ శతాబ్దంనుండి లభించాయి తరువాత తరువాత ఉత్తర భారతదేశ రూపము దక్షిణభారతదేశ రూపాలలో తేడా కనుపించసాగింది. ఉత్తర భారతదేశపు రూపము ప్రాచీన రూపానికి సమీపంగా ఉండగా దక్షిణ రూపాలు క్రమక్రమంగా మార్పుచెంది భిన్నత్వాన్ని పొందాయి ఈ లిపి భారతీయ సరిహద్దులు దాటికూడా పోయింది. అచ్చట కూడా దీని రూపంలో అనేక మార్పులు వచ్చాయి. మధ్య ఏషియాలోని బ్రాహ్మి లిపిలోనే ప్రాచీన 'ఖోతానీ', తోఖారీ', భాషల శాసనాలు లభించాయి. ఈ బ్రాహ్మి లిపిని మౌర్యలిపి, అశోక లిపి అని కూడా ఇటీవలి పరిశోధకులన్నారు. క్రీ. పూ. అయిదవ శతాబ్దం మొదలు క్రీస్తుశకం మూడువందల యాభై సంవత్సరాలవరకు భారతదేశంలో లభించిన బ్రాహ్మి వ్రాతలు కొద్ది గొప్ప తేడాలతోనున్ననూ బ్రాహ్మి పేరుతోనే పిలవబడుచున్నాయి. క్రీస్తుశకం మూడువందలయాభై తరువాత దీనికి రెండు రూపాలు స్పష్టంగా ఏర్పడ్డాయి. (1) ఉత్తర ప్రాంత రూపము. (2) దక్షిణ ప్రాంతరూపము.

ఈ ఉత్తర ప్రాంత రూపమునుండే క్రమక్రమంగా అనేక లిపులు ఉద్భవించాయి. వాటిని గుప్తలిపి, కుటిలలిపి, ప్రాచీన నాగరీలిపి, శారదా లిపి, టాకరీ, సిరమౌలీ, డోగ్రీ, చమేఆలీ, జౌనసారి, కోఛీ, కుల్లుయీ, కష్టవారీ, లండా, ములానీ, వానికో, గురుముఖీ, నాగరి అంటారు. ఇందులో నాగరీలిపి మాత్రమే ఎక్కువ వైజ్ఞానికమైనది. మళ్లీ ఇందులోనుండి గుజరాతీ, మహాజనీ, మోడీ, కైథీ, మైథిలి, బంగాలా, అసమియా, ఉడియా, మనిపురీ, నేపాలీ మొదలగు లిపులు కొద్ది కొద్ది మార్పులతో వికాసం పొందాయి. కాగా బ్రాహ్మిలిపియొక్క దక్షిణ ప్రాంత రూపంనుండి తెలుగు, కన్నడ, గ్రంథ, కలింగ, తమిళ వగైరా లిపులు వికాసం పొందాయి.

## విదేశీ లిపులు :

ప్రాచీన సామీ లిపియొక్క ఉత్తరశాఖనుండి ఆర్మేయిన్ లిపి, దానినుండి 'ఏషియానిక్ లిపి, దానినుండి యూనాని లిపి ఉద్భవించాయి. కొంతమంది విద్వాంసుల అభిప్రాయం ప్రకారం ఇందుపైన ఫోనీషియన్ లిపి ప్రభావంకూడా పడింది. ఇది పూర్తిగా ఫోనీషియన్ లిపినుండే పుట్టినదని కొందరంటారు. క్రీ పూ. 11 వ శతాబ్దంలోనే యూనానీ లిపి జన్మించినదని నిర్ధారణ చేయబడింది. తరువాత దీనినుండి ఎట్రుస్కన్, దానినుండి లాటిన్ లిపులు పుట్టాయి ఈ విధంగా చూస్తే యూనానీ లిపి గొప్ప మహత్వపూర్ణమైనది.

లాటిన్ లిపి లేక రోమన్ లిపి ప్రపంచం మొత్తంలోనే మహత్వపూర్ణమైనది. ప్రాచీన ప్రపంచ జ్ఞానం ఎక్కువగా ఈ లిపిలోనే సంరక్షింపబడింది. అరబ్బీ లిపి లాటిన్ లిపి ఉత్పత్తి కూడా ప్రాచీన సామీ లిపియొక్క ఉత్తరశాఖనుండే జరిగింది. ఎట్రుస్కన్ లిపినుండి క్రీ. పూ. ఏడవ శతాబ్దంలో లాటిన్ లిపి వికాసం పొందింది.

లాటిన్ లిపిని ఐరోపా ఖండమే గాకుండా మరికొన్ని ఇతర దేశాలు కూడా తమ తమ భాషలకు స్వీకరించాయి. ఇంగ్లీషు, ఫ్రెంచ్, స్పేనీ, ఇటలీ, పోర్చుగీస్, రుమానిక్, జర్మన్, జెక్, పోలిష్, తుర్కీ ఇంకా కొన్ని ఆఫ్రికా భాషలు లాటిన్ (రోమన్) లిపిలోనే వ్రాయబడుచున్నాయి. ఇందులో కొన్ని భాషలవారు కొన్ని కొన్ని చిహ్నలనూ, ధ్వనులనూ తమ తమ భాషలకు అనుకూలంగా మార్చుకోవడం జరిగింది. నేటి ఇంగ్లీషులోని అక్షరాలు ఇవే! ఆధునిక యూనానీ లిపి ప్రాచీన యూనానీ లిపినుండియే ఉద్భవించింది.

## మన తెలుగు లిపి :

బ్రాహ్మీ లిపినుండియే మన తెలుగు లిపి పరిణమించింది. పూర్వపు బ్రాహ్మీ లిపి వంకరటింకర గీతలవలె కొక్కిరిబిక్కిరిగా ఉన్నా, ఆ వంకరటింకర గీతలే రాళ్లపైన రాగిరేకులపైన తాటాకులమీద తాపడగా రాపడగా నేడు కనిపించే గుండని రూపాలు తిర్చుకొన్నాయి. ఈ చక్కని రూపాలు రావడానికి రెండువేలఏండ్లు పట్టింది. మనకు నేడు లభించిన మొట్టమొదటి తెలుగుశాసనం రేనాటి చోళరాజయి ఎరిక్ ముత్తరాజుది. ఇది కడపజిల్లా కమలాపురం తాలూకా, ఎర్రగుడిపాడు గ్రామంలో చెన్నకేశవాలయం ప్రక్కవ రాతిపై చెక్కిఉంది. క్రీస్తుశకం 575 నాటిది. తరువాత దొరికిన రెండవ తెలుగుశాసనం గూడా రేనాటి చోళులదే. దీనిని సత్యాశ్రయుడనే రాజు వేయించాడు. ఇది కూడా కడపజిల్లాలోనే పొట్లదుర్తి మాలెపాడు అనే గ్రామంలో దొరికింది.

తెలుగు లిపియొక్క క్రమిక వికాసాన్ని, ఒత్తుల వయ్యారాలను, గుణింతాల గమ్మత్తును, అంకెల అందచందాలు, కాయితాల కథ, అచ్చుముచ్చట, పుస్తకాల భాగ్యాభాగ్యాలు వివరంగా తెలుసుకొనగోరు వారు శ్రీయుత తిరుమల రామచంద్రగారి 'మన లిపి—పుట్టుపూర్వోత్తరాలు' అను గ్రంథం చదువకోరెదను.

(శ్రీ భోలానాథ్ తివారీగారి భాషావిజ్ఞాన్ పుస్తకం ఆధారంపైనను, శ్రీ తిరుమల రామచంద్ర గారి గ్రంథం ఆధారంగాను ఈ వ్యాసం తయారు చేయబడినది.)

---



# "కథకుని జ్వరం"

## (చైతన్యస్రవంతిలో రచన)

### శ్రీ పి. ఎస్. శాస్త్రి

..."సిస్టర్! సిస్టర్! నాకు...నాకు సంధా సిస్టర్? సంధేనా సిస్టర్?...సంధి సంధి...విసంధి జీవన్మరణాల సంధి!...భలేగా వుంది!...సంధ్యావందనం వందనం వందనం...నందనవనం...వనం వనం నందన వందన...వనం!...ఏమిటి... ఏమిటి......ఏమిటది?... సంధించు...సంధివేయు...సంధించిన బాణం విడువని వాడు...వాడు వాడు శ్రీరాముడు! అవునవును! అవునన్నా! వాడే నా రాముడు . కాపాడేవాడు...పాడేవాడు... వాడు శ్రీరాముడు! జగదోద్ధారకుడు! రామా... శ్రీరామా!...' ననుపాలింపగ నడచి వచ్చితివా?' 'అమలిన శుభ చరిత్రా, కమలదళ సమాననేత్ర'... రామా...నన్ను కాపాడు తండ్రీ!...'లాటీ చిత్త సరోమరాళ కుకురీ లావణ్యలోలాత్మకరాటీ' ..అబ్బ ఏం గొప్పగా వుంది! గొప్ప గొప్పన్నరా?...అదికాదు .. అదికాదు...ఇది...ఇది విను నేస్తం!...అప్పుడర్థమవుతుంది సమస్తం!...'గగన కల్లోలినీ కల్లోల మాలికా, హల్లీసకములతో అవఘళించి, చరమ సంధ్యాకాల సంఫుల్ల మల్లికా స్తబక పంక్తులతోడ సరసమాడి...' ఎలా వుంది పద్యం? మద్యం త్రాగినట్టు లేదూ?... ఎవరు, ఎవరు, ఎవరు, రాసారో తెలుసా?...తెలుసా నీకు నా మనసా?...'సకల విద్యాసనాథ శ్రీనాథ'... అవునవును...ఆయన... ఆయన .. ఆయనే! అహో ఆ మహనీయుని కవితా ధార!...హేలగా సాగిపోయే కమనీయ కవితాధార!...ధార కాదది అమృతంపు సోన!... దీనారటంకాల తీర్థమాడిన కవిసార్వభౌమునిదా అమృత కవితాధార ! ... అమ్మా ! అబ్బా ! భయం భయం ... బ్రతుకు భయం ... నయం నయం ... అబ్బో బెదురుగా వుంది!...ఎవరూ ఎదురుగా రారేం? సిస్టర్! సిస్టర్! కోపమెందుకు సుగుణ మణీ! వజ్రాల ఖనీ! ఖనీ గనీ మణీ!...సిస్టర్ మణీసిస్టర్!... డాక్టర్! రత్నాలరావు...డాక్టర్...రావూ డాక్టర్... డాక్టర్ ఏడుపొస్తోంది...ఎవరో నన్ను చంపడానికొస్తున్నారు. కాపాడండి కాపాడండి...యముని మహిషపు లోహ ఘంటలు మబ్బుచాటున ఖణేల్మన్నాయి...' ఘంటలు ఘంటలు...మంటలు మంటలు...ఒళ్లంతా మంటలు... బాధ బాధ...బాధ! అయ్యో! అమ్మా!' ఈ యెరిగిన యినుపడేగ. ఈ పండిన మంట పంట...' అమ్మా... కవిత్వం!...త్వం కవి!...అహో! ఓహో!...'ఇపుడా నను పలకరింతురు?'...

'...చూర్ణమాన ఘూర్ణమాన దీర్ణమాన గిరి శిఖరాల్ గిరగిరగిర తిరుగుతున్నాయి...' జగన్నాథ జగన్నాథ జగన్నాథ రథచక్రాల్ ... చక్రాల్ రథ చక్రాల్!' ... విషవాయువు మరఫిరంగి టార్పిడో టార్పిడో ... 'బాబోయ్ ! భయం భయం చావు భయం!' ... మీ రక్తం కలగికలగి ... మీ ప్రేవులు కనలి కనలి, ఏడవకం డేడవకండి ...'ఏడవను ఏడవను! శ్రీశ్రీగారూ రక్షించండి!' వయస్సుముళ్లిన, ఎముకలు క్రుళ్లిన సోమరులారా చావండి' అనకండి! ... నాకు వయస్సు మళ్లలేదు... లేదు లేదు లేనేలేదు ! నాకు ఎముకలూ క్రుళ్లలేదు! నిజం నిజం నన్ను నమ్మండి!... రామా! భద్రాద్రిరామా! ... నీవే నన్ను కాపాడాలి...

'...ఎటుల బ్రోతువో తెలియ నేకాంతరామయ్య!

రామా! 'బాలకనకమయచేల సుజనపరిపాల ..' రామా! రామా!... 'రామా ! రామ, కరికుంజరు హస్తము క్రిందుచేసె తాపంపక బంటుపల్లి!...' బంటుపల్లి తురగా రామన్నగారిని క్రిందుచేసింది ! మరి... మరి బొడ్డుపల్లి? ... 'బొడ్డుపల్లినినమ్మి గొడ్డేరిబోతి'... పాపం...పాపం మా శ్రీనాథుడు!... సరే సరే! ఆపు ఆపు అధిక ప్రసంగం ఆపు !...

రామప్ప కథ చెప్పిందెవ్వరు?... ఎవ్వరేమిటి?... ఎవ్వరా? ఎవరూ అని అడుగుతావా? అడుగు తీసి అడుగువేస్తే అక్షరలక్షలు విలువజేసే తేటతెనుగు మరిపించే కథా సార్వభౌముడు...సాహో! మల్లాది రామ కృష్ణశాస్త్రి!... జాను తెనుగుకు సానబెట్టి, వజ్రంలా, మణిలా, మాణిక్యంలా ప్రకాశింపజేసిన మహనీయు డెవరయ్యా ?... 'పిచ్చుకత్తులవారు ముందు పరుగు తీయగా...బల్లెములవారు వెనుక అంగ వేయగా... బాకు పట్టినవారు వెంట తరటుపోవంగా...' అదీ అదీ! అలా ప్రాచీన తెలుగుదేశ చరిత్రనూ, సంస్కృతినీ...రాజుల రాణీల సోహళింపులనూ; రంజుగా చెప్పిన రసిక చక్రవర్తి...

'...నవ్వులు పువ్వులై రాసులు దేరంగా— మేటంత పత్రిలో కొండంత దేవుడై, అంతలో కను మిక్కిలి వెలుగై వెలిగే నివ్వరిమొనవాసి బిందువై— బిందు సందోహమై, సందోహమే నాదకోహళమై... మసకతోచి, మబ్బుతోచి, మబ్బంతగిరిదోచి, గిరికంద రాన మంద్రమై, శిఖరి కెగసితారమై, తారకయై, సడియై, స్వనమై, నినదమై, నినాదమై, సంబ రమై, సంరంభమై, భరమై వరమై, దహరమై, తాలమై, కేవలము తానై...' అబ్బ! 'ఏమందమేమి సేయుద...'ము!...అబ్బబ్బా ! అహో ! 'వన మాల' అది ! మనస్సు సంతోషంతో, ఆనందంతో గంతులేస్తోంది......అది తెనుగు...కాదు !...కాదు ! కాదది ! అచ్చతెనుగు ! వచనం కాదది కవిత్వం... అవునవును వచన కవిత్వం......ఊహు ! కవిత్వపు వచనం...వచన వచన...'కవిత్వం రోకటిదంపు పాట కాదు'...కాదు !

'...ఆ నవ్వే నవ్వులై ... ఆ నవ్వులు లేలేత గొజ్జంగిరేకలై, ఆ రేకలు కెంపులై—వాని అరుణిమ తళుకు—మంచుగా—చినికి, చినికి...జడిగట్ట...ఆ ముద్దు ముత్తైదువై కనుల ఆనందనీలాలు చిలుకంగా ఆ జిలుగులు చివురించంగా...' ఏమైంది ఏమైంది? ఏదో అయింది !...కాని ఆ శైలి !...శైలా అది తెనుగురాసి !

...బాబోయ్ ! జ్వరం...జ్వరం ..వేడిజ్వరం... వళ్లు కాలుతోంది! ఏంచెయ్యనేంచెయ్యను? సిస్టర్ ! మణీ సిస్టర్ ! నీలమేఘశ్యామా !...రారమ్మా ! సిస్టర్! నీ చల్లని చేతో నాతలను తాకు సిస్టర్ ! తెల్లని నీ దుస్తులు—చల్లని నీ చూపులు—కావాలి కావాలి సిస్టర్ !...లేవా లేవా సిస్టర్? ఎక్కడి కెళ్లావ్?... ప్రక్కనే వున్నావా? సిస్టర్ ! సిస్టర్ ! నీ చేయి పట్టుకోనీ సిస్టర్ !...పడిపోతున్నా...'అగాధ, జలాంధ కార తరంగాలపై' పడిపోతున్నా సిస్టర్ ! అమ్మా ! రామా ! శ్రీరామా !...నను కాపాడరావా? డాక్టర్ ! డాక్టర్ !...త్వరగా రండి డాక్టర్ !... ఇది నిశాంత తమఃక్రాంతమిది దరిద్ర వీూ నిశాంతమ్ము మధ్య...' భయమేస్తోంది డాక్టర్ ! నేను చచ్చిపోతున్నా ! 'ఏను మరణించుచున్నాను, ఇటు నశించు నా కొరకు చెమ్మగిలు నయనమ్ములేదు!'...ఏడు పొస్తోంది! ఏం చెయ్యనేం చెయ్యను డాక్టర్!...'వీరు మనసారగా ఏడ్వ నీరు నన్ను, యవనికాభ్యంతరమున వెక్కి వెక్కి రోదింతును వినువులేక...' అమ్మా! కాళీ మాతా! కరుణించు తల్లీ!...

'సూర్యనారాయణా వేదపారాయణా, లోక రక్షామణీ, దైవ చూడామణీ, ఆత్మరక్షామణీ!... 'స్వామీ సూర్యదేవా! నీవే దిక్కు!...బాబోయ్ చీకటి చీకటి...కటిక చీకటి...స్మశానం...దయ్యాలు భూతాలు అంతా భీతావహంగా వుంది...కొరివి దెయ్యాలు... మంటలు...గంటలు... శంఖలు ! 'శ్రీ ఆంజనేయం, ప్రసన్నాంజనేయం, ప్రభా దివ్యకాయం . ఓ వీర హనుమంత, ఓంకార శబ్దంబునన్ భూతప్రేత పిశాచ శాకినీ ఢాకినీ, కామినీ మోహినీ గాలిదెయ్యంబులన్, నీదు వాలంబునన్ జుట్టి నేలంబడంగొట్టి...అహో!

ఓహో! అమ్మమ్మమ్మయ్య! అయ్యో!...పారిపోయాయి దెయ్యాలు...దెబ్బకు దెయ్యం వదిలింది...

...స్మశానం...కశ్మలంతో నిండిన ప్రదేశం... కాలయముని కేళీవిహార స్థలం!...'ఇది పిశాచులతో నిటాలేక్షణుండు గజ్జె కదలించి యాడు రంగస్థలంబు ..' అవునవును! ఆ మంజీరాల ధ్వని వినిపిస్తోంది...నా గుండె అదురుతోంది!...ఎందుకు ఎందుకెందుకు? డమరుక నాదానికి!...' ఇచ్చోటనే సత్కవీంద్రుని కమ్మని కలము నిప్పులలోన కరగి పోయె'...అమ్మ బాబోయ్! . నేనూ నా కలమూ అలా కరిగి పోవడమే?...ఊహూ! వద్దు వద్దు! నాకు మరణం వద్దు! నా శ్రాద్ధం వద్దు!...బ్రతకాలి నేను!...నిజం నిజం!...' నేనేదో విరచిస్తానని నా తపస్సు ఫలించి, నా గీతం గుండెలతో ఘూర్ణిల్లగ, నా జాతి జనులు పాడుకునే మంత్రంగా ప్రయోగించాలనీ' అనుకున్నాను...కనుక నా మీద దయదలచి నన్ను వదలండి...వదలండిరా యమదూతల్లారా! ..
...'చంద్రశేఖర. చంద్రశేఖర, చంద్రశేఖర పాహిమాం... చంద్రశేఖర, చంద్రశేఖర, చంద్రశేఖర రక్షమామ్!... చంద్రశేఖర మాశ్రియే మమ కింకరిష్యతి, వై యమః?' .. పారిపోయారు...శివుని దెబ్బకు తాళలేకపోయారు... యారు పోయారు ... యారు? ... వారు కాలని భటుల ...కాలికి బుద్ధి చెప్పారు...భలే భలే!...పొగుడు పొగుడు శివుణ్ణి పొగుడు ... 'కరాళ బాలపట్టికాద్ధగద్ధగద్ధగజ్వల ద్ధనుంజయా ధరీకృతా ప్రచండ పంచసాయకే ... ధ్ధిమిద్ధిమిద్ధిమి ధ్వనన్మృదంగ తుంగ మంగళ— ధ్వనిక్రియ ప్రవర్తిత ప్రచండ తాండవ శ్శివాః...' శంభో మహాదేవ!...

...'అమ్మా! అలుపుగావుంది...అయ్యో బాధగా వుంది...అయ్యయ్యో భయంగావుంది!' ... చీకటి... మృత్యువు ఛాయలా వ్యాపించిన పెనుచీకటి ... 'లోకంబులు లోకేశులు—దెగిన తుది నలోకంబగు పెంజీకటి కవ్వల...' ఎవరు? ఎవరు? ఎవరున్నారు?... 'సహస్ర శీర్షం దేవం, విశ్వాక్షం, విశ్వ శంభువమ్... విశ్వం నారాయణం దేవ మక్షరం పరమం పదమ్... విశ్వతః పరమాన్నిత్యం, విశ్వం నారాయణగ్ంహరిమ్!... అవునవును! ఆయనే!...నిజం! ...'నిష్కళో నిరంజనో నిర్వికల్పో నిరాఖ్యాతః' ... ...ఇంకా ...'శుద్ధో దేవ ఏకో నారాయణః నద్వితియోస్తి కశ్చిత్!' ...అంతే! అంతే! నారాయణు డొక్కడే! రెండన్నది లేదు లేదు!...లేనేలేదు!...వేరుమాట లేదు.

మరి నమకం చమకమో ? . '...ఓం అను కామశ్చమే, కామశ్చమే, సౌమనశ్చమే, భద్రం చమే శ్రేయశ్చమే... నమోరుద్రాయ విష్ణవే మృత్యుర్మే పాహి, మమ మృత్యుర్నశ్యత్వాయుర్వర్ధతామ్!' ...మరి విష్ణువా, రుద్రుడా? ఎవరు, ఎవరు, ఎవరు గొప్ప? ఎవరిని ఎవరిని పూజించను ? భజించను... సేవించను? ఎలా ఎలా ఎలా? తల పగిలిపోతోంది...

'సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి'... అంతే! అంతే! ఏదో ఒక దేవుడికి ... చెయ్యి నమస్కారం చెయ్యి చెయ్యి! వెయ్యి వెయ్యి పూలమాలలు వెయ్యి!... వెళ్ళు వెళ్ళు త్వరగా వెళ్ళు!... నీరసం...రసం లేనిది నీరసం...అమ్మా! సిస్టర్! బత్తాయి రసం యిస్తావా...నీరసంగా వుంది...వెన్నెల జల్లులాంటి నీ చిరునవ్వు చాలు చాలు సిస్టర్!... కడుపు నిండుతోంది...అబ్బే అబ్బే...పట్టిది సిస్టర్... కడుపు ఆకలితో కాలుతోంది!...ఉత్ప్రేక్ష అంతే! అంతే! అలవాటు...పొరపాటు...చెప్ప న్చెప్ప నెప్పుడూ...చప్పుడు చెయ్యకుండా పడుకోనా?...చెప్పుడు మాటలు వినడం తప్పుకాదా సిస్టర్!...నువ్వు చెప్పిందీను!... వెళ్లిపోతున్నా సిస్టర్! అమ్మా అయ్యో...దీనజన పరిపాల శ్రీరాఘవేంద్ర...రామా నన్ను బ్రోవరా...'తళుకు బంగరు కుండ, తొలి సంపంగిదండ, వలపుల సరణి జవాజి బరణి... మకరందముల వాక, మగన శాస్త్రపు టీక రతిచేతి చిల్క, మరవంపు మొల్క!' ఎవరు? ఎవరు? ఇంకెవరు తార!...ఎవరు ఎవరు రాసిందెవరు?...

...'అఖండ మండిత మహీమండలి మండనాయమాన పాండ్య మధురాధరా ఖండల శ్రీ విజయరంగ చొక్కనాథ మహీనాధ కృపాకటాక్షవీక్షణ...'ములను పొందిన శేషం వెంకటపతి...అతనికి శేషించినది కీర్తి మాత్రమే!...అదీ క్షుద్రకావ్యమని ఆధునికులచే తిరస్క

రెంచబడటం...దక్షిణాంధ్ర క్షీణప్రబంధ యుగ కావ్య మని దుమ్మెత్తిపోయబడటం పాపం...పండితులకు మాత్రమే అని ప్రచురించినా పవిత్రత పొందలేదే!... పాపం...పాపం... మరి యిది...ఏది ఏది?...ఏదది?... అదే అదే గుర్తుకురాదేం తొందరగా!..అమ్మా నొప్పి.. నొప్పి ఉన్నట్టు భయం...భయం మూలాన్ని నొప్పి .. బావుంది...బావుంది! శశీ! శశీ! నా హృదయం చీల్చేస్తున్నావు!...నువ్వు నా ప్రాణం. నా జీవనం, నా లోకం...నిన్నెవరన్నా పిలిచారా, తకారా, ఆడపులివలె విరుచుకుపడి చీలుస్తాను రెండుగా! ఆకాశం పువ్వుల్ని రాలుస్తోంది లేక దీప్తి తన సౌందర్యభారంతో బద్దలై నక్షత్రాలై రాలుతోంది...అబ్బా శశీ! నా చిన్ని శశీ!... శశీ ఎవరు నువ్వు?'...ఎవరు ఎవరు శశీ, నువ్వు?... ఎవరు ఎవరు కవీ నువ్వు? నువ్వు చలానివి—చంచలానివి...అచంచలానివి...అరుణాచల నివాసివి ... 'ఔను చలం ఔను చలం ... నీవన్నది నిజం నిజం!... ...అబ్బా రంగనాథం...నా పీక పిసుకుతావెందుకు? . 'పునరపి జననం పునరపి మరణం పునరపి జననీ జఠరే శయనమ్! . తెలుసు తెలుసు! నాకు భజగోవింద శ్లోకాలు తెలుసు...జీవితం' నళినీదళ గత జలమతి తరళమ్, తద్వజ్జీవిత మతిశయ చపలమ్!' లా చంచలమైనదనీ తెలుసు...కాని నన్ను చంపుతావేం?...బాబ్బాబు నన్ను చంపకు . 'ఉదర నిమిత్తమ్ బహుకృత వేషః' నిజమే ..కాకపోతే నీ వెలా ఉండే నా కెందుకు?...అందుకే నిన్ను చంపితే కథ రక్తి కడుతుందని కథ విన్న పదమందీ అంటే చంపేశాను! నా తప్పు వుందా? కథ రక్తి కట్టకపోతే ఎవడు వేసుకుంటాడు? డబ్బెలా వస్తుంది? పొట్టెలా నిండుతుంది? ఆలోచించు నాయనా రంగనాథం!...రక్తి కట్టిందో లేదో కాని నా రక్తం కళ్ల జూస్తావా?... బాబోయ్ బాబోయ్! చంపేస్తున్నాడు...రండి రండి రక్షించండి......

అమ్మయ్య వొదిలాడు...పీడపోయింది...పాడు గోల!...' ఐనా రంగనాథం కథలో పాత్రవికదా నీ కెందుకు కోపం? నువ్వు చస్తేయేం బతికితే యేం?.. నేను కథా విధాతని, అపర విశ్వామిత్రుణ్ణి, ఇష్టమొచ్చినట్టు ఇష్టమొచ్చినన్ని పాత్రల్ని సృష్టిస్తా! చంపుతా! హ హ హ!...'సృష్టిస్థితిలయకారక'... బాబోయ్ రంగనాథం! రాకు రాకు! నా జోలికిరాకు! మొక్కుతా! మొక్కుతా! నీ కాలికి మొక్కుతా! అమ్మా! అమ్మమ్మా! వెళ్లాడురా నాయనా!...పాత్రలు స్వస్వరూపాలతో కథకుడిమీదకు దాడి చేడితే ఎలాగ బాబూ బతికేది...ఏది ఏది ఏది దారి? ఓ మహాత్మా ఓ మహర్షీ...'కమ్మగా బతికితే అది గాంధీ యుగం' ...'లాలస లాలస ఎవరు? . అవును నీ కెట్లా తెలుస్తుంది! 'ఎవరు?' 'ఎవరో!' నే నెరుగుదును వొకప్పుడు' 'ఎక్కడ?' ఏమో! ఏం చేస్తావు వెళ్లి 'పెళ్లి''...'ఎవరికి?'...'ఏమో!' 'ఇంక కనబడవూ?'' 'ఊహూ!'.. వెళ్లండి!' 'ఏమిటి?' భగ్నమైన కల! . 'మళ్ళీ అనేది లేదు జీవితంలో! నాకు మీరు వో సాయంత్రం కల...నేను మీకు వో గంటకల!'. 'మెల్లిగా నా దృష్టి నా ఆత్మ, మైదానపు చీకట్లో ప్రసరించి వ్యాపించి, ఆక్రమించుకుని, అంతా తానై కొండలమీదనుంచి కొండశిఖరాన మెరిసే నక్షత్ర కాంతిలో లీనమయింది!' ... 'రతీస్తుంటట అతన్ని! యామవుతుందో అతని అందం? అతని హృదయం, ఏ గులాబీ పువ్వులకి కొత్త రంగు, యే నక్షత్రాలకి కొత్త మెరుపు, యే మబ్బులకి కొత్త నునుపు యిస్తుందో '...అబ్బ ఎంత అందమైన వాక్యాలు... మనస్సును సంతోష డోలికల్లు ఊగించే శైలి! శైలి! శైలి!...' మీరా! నేనూ వొస్తాను, మీరా నేనూ చస్తా! '.. మీరాబాయి ..కుంభరాణా... 'చ్ఛటచ్ఛటా శబ్దమేమి, చక్రాలకి రక్తమేమి? ఏలోకం తల్లీ యిట, కనుపించదు కాలనేమి?' ... బాలగంగాధరా .. రాళ్లగరగంగ కవితలు పాడినవాడా.. నీవు లేవు నీ పాటవుంది!'... మరి నేను లేకపోతే నా పాట వుంటుందా?... ఏ నోటేగా వినిపిస్తుందా 'జల జలమని కురిసింది వాన, జాల్వారింది అమృతపుసోన, దోసిళ్ళతో తాగి తిరిగి వచ్చాను, దుఃఖాన్ని చావునీ వెళ్ళిపొమ్మన్నాను!' .. మృత్యుంజయా! వెళ్ళిపొమ్మన్నా, చావు నిన్నెలా కౌగిలించుకుందీ? ... 'హే మృత్యో!'

పో దూరంగా పో!... రాకు రాకు నాదరికి రాకు!... చాచకు.. చాచకు నీ బాహువుల్ని!

'మేష్టారూ! మేష్టారూ! .: కొట్టకండి మేష్టారూ! చెబుతా చెబుతా! కర్మంబున ద్వితీయ యగు! 'చలువలరేడు, వెన్నెలరేడు, రేరేడు, జాబిల్లి, రేవెలు, చందమామ...' సోకుమూకలగొంగ చుట్టు గైదువుజోదు, పచ్చవిల్తునితండ్రి, లచ్చిమగడు ..' చెబుతా చెబుతా.. అమ్మా! కొట్టకండి!.. 'మిగిలినవి రేపు అప్పజెబుతా!'.. అమ్మా వదిలాడురా నాయనా... 'పొగాలము దాపురించినవారు దీపనిర్వాణ గంధము నరుంధతిని, మిత్రవాక్యమును, మూర్ఖోనరు, క రు విన తని పెద్దలు చెప్పుదురు!...' ఒచ్చిందొచ్చింది! ఈ తెలుగు మాష్టారికి పోయేకాలం వొచ్చింది! పడతా పడతా! .. వీడి భరతం పడతా!...పడతా—తా! తా. పు పడతా!..

...'తాతా ఊతునా?'...ఊఊ!...'సెప్టెంబరు తొడ్డు మీద జెస్సోరెలావుంది?' అడుగు...అడుగు... అలెన్‌గిన్స్‌బర్గ్ నడుగు!...' లక్షలకొద్దీ తండ్రులు వానలో—లక్షలకొద్దీ తల్లులు బాధలో''...'లోలో! హాలో!' లాగండ్రా బతుకు, లాగండ్రా బరువు! ...'చిరంజీవి మానవుడా త్వమేవాహం!'...చిరంజీవి..! చిరంజీవి...జీవి చిరంజీవి . జీవి.. జీ . జీవీజీ ..చాలు చాలు బతుకు చాలు...చాలు చాలు బరువుచాలు! మేలు మేలు—చావు మేలు! . అంతే అంతేనా! చివరకి యింతేనా?...చివరకి మిగిలేదేమిటి? ఏమిటి ఏమిటి...చివరకు మిగిలే .. కలగాపులగం...పులగకల . కల...అలవల...తల ..

.. అయ్యో! అయ్యయ్యో! రారయ్యో! మము గన్న తండ్రి మాపాలి దైవమా! ... 'ప్రజల రాజాధి రాజ వీరప్రతాప, రాజ పరమేశ బిరుదవిభ్రాజి...' మూరురాయర గండపెండార మణిమరీచి రింఛోళి ' బహుపరాక్ శ్రీకృష్ణదేవరాయ! ... 'ఏను దెలుంగు రాయడ నన్నడరాయ .' 'తెలుగొకండ యెన్నినృపులు గొలువ నెరుగవే బాసాడి, దేశభాషలందు తెలుగు లెస్స!'.. 'సాహితీ సమరాంగణ సార్వభౌమ'... భేష్ భేష్...దేశం తెనుగుదేశం...రాజు కన్నడరాజు...రాజుగారి దైవం తెనుగుల ఆరాధ్యదైవం శ్రీ వేంకటేశ్వరుడు... ఆహా! అన్నమయ్యా! వినుపింపుమయ్యా నీ విన్నపాలు! ...పాలు...పాపాలు... శాపాలు...అయ్యో పాపం...కర్ణాట సామ్రాజ్య ప్రాభవాన్ని పెంపొందించిన తిమ్మరుసయ్యా! ...అయ్యో అయ్యో!...అంధుడవై 'శ్రీవారి' ప్రసాదాన్ని అమ్ముకుంటూ బ్రతికావా?...ఎవరి శాప మది? ఎవరి పాప మది!...

అంతే అంతే కొందరి బ్రతుకులు అంతే! ... చూడు చూడు యింకా చూడు...రావు సూర్యారావు మహీపతిని చూడు ... ఏడు ఏడు ... చిత్తూరు నాగయ్య చరిత్ర చదివి ఏడు! ఆకశంలో ఉవ్వెత్తున ఎగిరే త్రివర్ణపతాకం చూడు...ఏడు ఏడు చీకిన దేహంతో, కూలిపోయిన గేహంతో...బక్కచిక్కి మృత్యువు కౌగిలిలో నొక్కుపడ్డ పింగళి వెంకయ్యను చూడు... ఏడు ఏడు...నీకు సాయంచేసి పేరు తెచ్చిన పెద్దలకి నువ్వు చూపించిన ఆదరానికి ఏడు!...ఆహో ఒహో మానవుడా!...ఒహో ఆహో దానవుడా' డాడా డూడూ డెడే డడై....

'వచనం లేదు, కవిత్వం అంతకంటే లేదు.' లేదా లేదా కవిత్వం లేదా? ..పిచ్చెత్తి ప్రవచించిన కవిత...' 'నోరు మూసుకో, గుండుచేసుకో, వీలైతే నాలిక తెగ్గోసుకో!...' 'అంతే అంతే! లేకపోతే ఉరి వేసుకో! కొకో...' కల్లోలపు కడలి అలల తాకుళ్ల మధ్య,... యుద్ధ తిమింగలాల రంపపు పళ్లమధ్య '...లేదూ లేదూ కవిత్వం లేదూ?' ఎవరు వీరు? ఏ యుద్ధంలో క్షతగాత్రులు? ఆ నెత్తురు కావ్య లేమిటి? ఏ సేనలో సిపాయీలు? మీ తాతా వారేరీ? ...'ఏరి ఏరీ ఏ లోకంలోకిపోయి ఈ లోకంకేసి ఆశగా చూస్తున్నారు?...నా దోసిట యాగఫలం పిడికెడు భస్మం నిలిచింది! 'అంతే అంతేనా? మానవుడి బ్రతుకు అంతేనా?'. .

...'సేవే శ్రీగిరి మల్లికార్జున మహాలింగస్ శివాలింగితమ్!'...'ధూర్జటి నిటలాక్షి!'... అక్షి అక్షి సాక్షి... నేనీ గదిలో కాపురం వుంటున్నాను. 'ఆ సంగతి యీ సిగరెట్టు ముక్కలు చెబుతున్నాయి'... '...సాలుచందా తొమ్మిది రూపాయలు. విడి ప్రతి మూడణాలు. అదా కానీ కాదు!'...'ఎందుకే అమ్మా ఏడుస్తున్నట్టున్నావు?' 'ఏమీ లేదు!' 'ఎవరే ఆయన?' 'మీ నాన్న స్నేహితుడు' 'పాపం! ఎవరు

ఎవరు ఎవరాయన? 'నాదు గుండెగాయము కుట్టు సూదికంట, అశ్రు జలధార దారమ్మై అవతరించె'... అవతరించె...తరించె... విరించె... డాక్టర్! డాక్టర్ డాక్టర్! సిస్టర్! మణి సిస్టర్! భయంగా వుంది! ఏమైపోయారు? ఒక్కరూ కనబడరేం? భయం నిజం!...నిజం భయం! అయ్యో! అయ్యో! ఏం చెయ్యను! శాంతం పాపం! పాపశాంతి! తాపశాంతి! 'ఒమ్! గాతుం యజ్ఞాయ, గాతుం యజ్ఞపతయే!... శాంతి మంత్రం. ఏది ఏది...? 'సహనా వవతు, సహనౌ భునక్తు, సహవీర్యం కరవావహై, తేజస్వి నా వధీత మస్తు, మా విద్విషావహై. ఓం శాంతిః శ్శాంతిః శ్శాంతిః...'పద్మా! నువ్వొచ్చావేం పద్మా!...ఆనాడు ఆ నదివొడ్డున నీ పాదాల చెంత కూర్చుని నీ ఆరాధనలో మునిగి, నా తల్లి దండ్రుల్ని వొప్పించలేక దూరంగా తొలగిపోయా! పద్మా! నన్ను క్షమించలేదా? నీ కళ్లు ఎర్రగా వున్నాయేం? నీ జుట్టు చెదిరివుందేం? నీ కన్నుల్లో వెలిగే తళుకులు మాయమై పోయాయేం పద్మా?...నీ భర్తతో హాయిగా కాపురం చేసుకుంటు న్నావని, నీ సంతోషించానుకదా పద్మా! ఇలా మారి పోయావేం? చెప్పు పద్మా! నన్నింక ఏడిపించకు'... 'నేనా! నేనేనా అందుకు కారణం! ..మన భగ్న ప్రేమ గురించి కథ రాయటమే నీకు ముప్పు అయిందా పద్మా! ..నీ భర్త నిన్నవమానించాడా పద్మా!...పద్మా బాధపడకు!... నీ భర్తచేత తన్నులు తినేనా నిజం చెప్పి, నీ కాపురం నిలబెడతా...పద్మా! నిజం పద్మా నన్ను క్షమించు! అపార్థాలు కలిగించి మీ కాపురం చెడగొట్టాలని అలా చెయ్యలేదు పద్మా!...పద్మా నన్ను నమ్మవూ...నా మాట వినవూ? పద్మా... పద్మా...పద్మా!

ముష్! దేవుడా! స్వామీ! రాముడా .రామయ్యా 'సీతారామస్వామీ నే చేసిన నేరంబేమి?'... అలాగని ఏకాంతం నా కాదు! మనసు చుట్టూ ఆలోచనలు! ముసుగులు వేసుకున్న భ్రాంతులు!' ఎప్పుడో వొకసారి మనస్సులో తళుక్కున వొక మెరుపు మెరిసి, హృదయం మధురంగా స్పందిస్తుంది! ఆ మధురిమ క్షణం నిల వదు! ' నిజం నిం ఏదీ నిలవదు! కాని కాని ఆ అనుభూతి విభూతి నశ్వరమైన దేహంలోంచి అయ్యో అమ్మ నా యనా! 'ఎందరో మహాను భావులందరికి నా వందనములు' ..లేరా యీ దీనుని కాపాడేవారలు?...'తానెదురైన మదకరీంద్రముడిగ్గి,'... 'ఎంకివంటిపిల్ల లేదోయి లేదోయి ' ఎంకీ యాడుం టివే యెంకి యాడుంటివే' 'నీతోటె వుంటాను నాయుడుబావా! ' బావా! బావా! రావా? .. 'లావొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యె! .. 'అలవైకుంఠపురంబులో నా మూలసౌధంబులో ...' ఎందుకు ఎందుకు భయమెందుకు నాకు ? .. 'నమృత్యుర్నశంకా నమే జాతిభేదాః శివానందరూపః శివోహం శివోహం! . ' 'ననిరోధో నచోత్పత్తి, ర్నబద్ధో నచసాధకః, నముముక్షుర్నవైముక్త ఇత్యేషా పరమార్థతా !'.. అంతే అంతే! జగత్తంతా మిథ్య నాకెందుకీ గోల మధ్య! ..

... 'అన్నా శతధా విభిన్నమైన యీ గుండెలో. సంగీతం వినపడుతోంది, చావనని నమ్మకం కలిగింది!' . 'పిల్లా అగ్గిపుల్ల!' .. 'బ్రాహ్మణ్ణి కాళ్ళు పట్టమనవు కదా?' 'బ్రాహ్మలు యెంతకైనా తగుదురు!' . 'డామిట్ కథ అడ్డంగా తిరిగింది!'... 'సమయ నికి తగు మాటలాడి...' 'సుబ్బయ్య సంతో షంగా లేడు. రాత్రి జరిగిందంతా అతని మనసును కలచివేసోంది రాత్రి పొందిన సుఖం రాత్రితోనే పోయింది! ఈ మనోరమ ఎవరు?...' ఎవరు ఎవరు సుబ్బయ్య ఎవరు? ఎవరు ఎవరు మనోరమ ఎవరు? .. '.. కాని రాణి పడలేదు. పైన బల్లులు కగిలి బూజు నా నెత్తిన పడింది !'...అంతేనా, పద్మా అంతేనా?... 'ఏతావుంగా నిలకడ నీకు?'...'కాణీలు రేగిపళ్లు కలి పితే బోగిపళ్లు అంటారు !'...బుడుగుబుడుగు చిచ్చుల పిడుగు...గిడుగుగిడుగు...గిడుగు పిడుగు !...ఎవ్వరేమన్న నం ద్రుగా కేల కొరత, నా కవిత్వంబు నిజము కర్ణాట భాష !...'కాంచీకంకణతారహార కటకగ్రైవేయ భూషా వళల్...' కనకసౌగంధిక గంధోత్తమాగంధసార విష్పంద పుష్పంధయంబు...'...మరి మా వూరు మరచిపోలేదా కవిసార్వభౌమా? '...పొం దవిభవంబు రాజమహేంద్రవరము !' ఎవరు పరిపాలించారయ్యా అప్పుడు? ఔను అప్పుడే! 'దిశ లల్లాడ నల్లాడ భూపాల్లభుండు !'...భలే భలే ! బాగుంది.

కాని పద్మా ! . 'కాని ఎప్పితిప్పలు పెట్టావురా కేటూ నన్నూ? 'నువ్వు మాత్రం తక్కువవాడివా,

డూప్లికేటూ?'...'ఔరా కూనా! సత్తువుంది, సంబరముంది, గొంతులో బిగువుంది, చూపులో పదునుంది...'...'రాలినపూవు రంగు ముదిరి రేక ముదిరి, పుప్పొడి పూసకట్టి, పూస బుడగంత కెదిగి, గాలి సోకిళ్ళ చిటుకుచిటుకు మనంగా—పుప్పొడి మంచు కమ్ముకోంగా—రాచకూనకు...' ఏమైంది?... 'ఎవ్వతె వీవు భీత హరిణేక్షణ?...' మోహోపదేశ తమో ముద్రితములైన కనుదమ్ముల హిమాంబులనుపరాదు...' 'దేవతలార యోధికృతులార, నక్షత్రంబులార యోగ్రహములార!...' వాణి నా రాణి'...'సంస్కృతాంధ్రభాషా సామ్రాజ్య సర్వంకష చతుర్విధ కవితానిర్వాహక సాహిత్య రసపోషణ రామరాజు భూషణ ప్రణీతంమైన ..'...ధాత్రీశ్వరులుగాని ధాత్రీశ్వరులుగారు ..'భలే భలే! 'శ్రీనాథు నర్పించు కరములు కరములు! . ఒకటికాదు మరొకటి అస్త్రము! అవునవు నవు నవు ను ..'కలికి నీ సొగసెల్ల గలుగ గన్గొనువేళ, గనురెప్పపాటు విఘ్నముగ నెంతు! అంతే అంతేనా పద్మా?...'పండితుల్ప్ర అట్లాగే వాగినీ ముసలి ఖయ్యంతో సుదతీ నువ్వొచ్చెయ్యి!' 'దిక్కులేదు ఆశలేదు, విని వోదార్చె జాలిలేదు తప్పించుకునే తోవలేదు!'...'ఇదంతా ఈశ్వరేచ్ఛ' ఛస్తా! ఛస్తా! ఇలాగే ఒంటరిగా ఛస్తా ..కనబడుతున్నాయి! కనబడుతున్నాయి! . తిట్టకు తిట్టకు కవీ! నీ వాక్కులు వినబడుతున్నాయి...'కనబడలేవా మరో ప్రపంచపు అగ్ని కిరీటపు ధగధగలు! ! ఎగిరించకు లోహ విహంగాలను, కదిలించకు సుప్త భుజంగాలను' .. 'కృష్ణశాస్త్రి బాధ ప్రపంచానికి బాధ. ప్రపంచం బాధ అంతా శ్రీ శ్రీ బాధ ..' నిజం నిజం బాధ నిజం ..లేదు హాజం! 'మొగులు మొగులు వెలుగులు నిగుడ; దొడగె, మెఱుగు మెఱుగు ననుఱుములు వెందుకొనియె' ..'రాజాన్న భోజన ప్రాభవశ్రీ గల్గియును, వన్యధాన్యంబు నొల్లమనరు!'.. మరి ఇంకా .. 'పాఱ జూచిన బరసేన బాఱజాచు . వింటి కొరిగిన రిపు రాజివింటి కొఱుగు!' ధూర్జటి విజయ విలాసం... చేమకూర కాళహస్తి మాహాత్మ్యం...చేమకూర చేదు బాబు...కంద...కందము...'కాకోదర కుందవరపు కవి చౌడప్పా!'...చెప్పు కందం చెప్పు...'అందంగా మధురస నిష్యందంగా'...'నీకొక సిగరెట్టిస్తా నా కొక శతకము వ్రాసి నయముగా యిమ్మా!'...'వాగ్నీతవు నీవె, మహోగ్రాగ్న్యుర్వీధరము నీవె...సిరిసిరి మువ్వా!...' 'ఎక్కడా చల్లటి నీడల్ని వర్షించే చెట్లులేని...ఎర్రటి ఎడారి జీవితంలో నడవలేక...ఎంత స్వార్థం పాపనీ నీకు! నీ మీద ఎంతమోజు నీకు!'...పద్మా మరి నువ్వో! మరి నీకో!

...కాని పద్మా సూర్యుడు కొడిగట్టినా నేను నీకు ద్రోహం చేద్దామనుకోలేదు...'అందువలన ప్రతి రచయితకీ మొదటి శ్రోతా విమర్శకుడూ తనే!' 'ఏదోవో కాయితం, ఏదో ఓ పాత కలం చేతపట్టుకుని కూర్చో! ఏదన్నా కథ వొచ్చిందా రాయి...' రాకపోతే?...ఏడు ఏడు!..' అందమైన భావమూ ఉవ్వెత్తుగాలేచే తరంగ వేగమూ, మల్లె మొగ్గ అరవిరిసీ తీరు' ..'రణరణరణ ఝుణఝుణఝుణ ... కనకపు కాలి అందె నా గీతం పులిపంజా!' ...పురిపండా పులిపంజా...పంజాపండపురిపులి . 'నీడల కొండచిలువలు వెలుతురు కుందేళ్లను మ్రింగి'...చాలు చాలు కవిత్వం చాలు! మేలు మేలు మేలు భళీ!...'డాక్టర్ యాక్టర్ సిస్టర్ మిస్టర్!' సిస్టర్! మణీ సిస్టర్. 'ఒంట్లో నీరసంగావుంది. కళ్లు మూతలు పడుతున్నాయి. నే బ్రతుకుతానా సిస్టర్?...చల్లని తల్లీ... చక్కని చెల్లీ! ఎంతమంచిమాటన్నావు సిస్టర్. మత్తుఇంజక్షను ప్రభావమా అది?...'జనావళికి శుభం పూవి' నాకు ఫరవాలేదా సిస్టర్! థాంక్యూ! థాంక్యూ! థాంక్యూ!

(అయిపోయింది)

(దిజ్మాత్మతంగా ఆంధ్రభాషా సౌందర్యాన్ని ప్రదర్శించాలన్న ధ్యేయంతో యీ చిన్న రచన చేశాను. ఇందులో ఉదాహృతభాగాల కర్తలైన ప్రాచీన, అర్వాచీన, కవులకు, రచయితలకు, కృతజ్ఞుణ్ణి. పఠనా సౌలభ్యం కుంటుపడుతుందనే దృష్టితోనూ, గ్రంథవిస్తర భీతితోనూ, అధస్సూచికలను, రచనల వివరాలను యివ్వలేదు! తరంగాలు తరంగాలుగా వచ్చే ఊహల అలజడిలో కొంత అస్పష్టత ఉన్నా సహృదయులు క్షమిస్తారని, నా ప్రయత్నాన్ని అర్థం చేసుకుంటారని ఆశిస్తున్నా.)

అంకితం : ఆంధ్ర సాహిత్యంపై అభిరుచి కలిగించిన మా పెదనాన్నగారు జగన్మోహినీ కేశవ శతకకర్త శ్రీ పెద్దాడ రామలింగయ్యగారికి భక్తితో.

---

# ఇంటిముందు లోయ

డా॥ సి. నారాయణ రెడ్డి

నా యింటి ముందు లోయ
లోయ ఒంటి నిండా
పాకుతున్న ప్రాణులు
పడిలేస్తున్న క్రిములు
నెత్తురుమీద నడుస్తున్న
నిత్య నగ్న జీవులు
పరుగులు తీస్తున్న కళ్లు
కొరకొర చూస్తున్న నొసళ్లు
తెల్లగా మండుతున్న కొప్పు ముళ్లు
సిరా కారిపోతున్న కురులగుత్తులు.
నడుం తెగిన ఊళలు
పెడబొబ్బల జోలలు
పంటికి లొంగని సంక్రాంతులు
కంఠం దిగని ఉగాదులు
తుస్సుమనే చిచ్చుబుడ్లు
తోకతెగిన ఊరేగింపులు.
నా యింటిముందు లోయ.
లోయ నరాలనిండా
వరదలాంటి చీకటి
నురగలాంటి ఆకలి

*　　*　　*

నాది ఇల్లు కాదు
గుహలాంటి జైలు
నేను నేను కాను
బల్లెంమీద బతుకుతున్న పులిని.

---

# శ్రీ రాజరాజేశ్వరస్వామి క్షేత్రం

## శ్రీ పి. ఆర్.

శ్రీ రాజ రాజేశ్వరస్వామి వారి క్షేత్రము కరీంనగర్ జిల్లా సిరిసిల్ల తాలూకాలో ఉన్నది. ఈ క్షేత్రమునకు వేములవాడ, లేములవాడ, లేంబుల వాటిక, యముడాల అని పేర్లుగూడా ఉన్నాయి ఇచ్చటి క్షేత్రమూర్తులైన శ్రీ పార్వతి, శ్రీ రాజరాజేశ్వర స్వామిని అర్చించడానికి తెనుగువారేగాక, దేశమంతటి నుంచిగూడా అనేక భాషలవారు వస్తూ ఉంటారు. కరీంనగరానికి వేములవాడ 20 మైళ్ళు. కామారెడ్డి—కరీంనగర్ రస్తాలో ఇది ఉన్నది. ఖాజీపేటలో రైలు దిగి, వేములవాడకు బస్సులో వెళ్లవచ్చు. ముఖ్యంగా శివరాత్రికి మాఘ బహుళ చతుర్దశినుంచి 3 రోజులపాటు హెచ్చుగా యాత్రికులు వస్తారు. ఫాల్గుణ బహుళ విదియనుండి 5 రోజులపాటు శివ కల్యాణ మహోత్సవం ఇక్కడ వైభవంగా జరుగుతుంది.

### క్షేత్ర మాహాత్మ్యం :

ఈ క్షేత్రంలో సంవత్సరాది, వసంత నవ రాత్రములు, హనుమజ్జయంతి, శంకర జయంతి, తొలి ఏకాదశి, శ్రావణి, కృష్ణాష్టమి, గణపతి నవ రాత్రములు, దేవి నవరాత్రములు, కోన్‌జాగిరి పూర్ణిమ, దీపావళి, కార్తీకమాసం, వైకుంఠ చతుర్దశి, ధనుర్మాసం, వైకుంఠ ఏకాదశి, దత్తజయంతి, కాల భైరవాష్టమి, త్యాగరాజ ఉత్సవాలు, హోళిపండుగ కూడా ఇక్కడ బాగా చేస్తారు. నారదుని కోర్కెను మన్నించి శంకరుడు కాశిలో ఉద్భవించి రాజేశ్వర క్షేత్రమునకు వచ్చి వాతావరణమును చూచి అక్కడే స్థిరపడిపోయాడు.

### ధర్మకుండం :

ఇక్కడి రాజేరాజేశ్వరస్వామి ఆలయం ప్రక్కనే ధర్మకుండం అనే సరస్సు ఉన్నది. ఇది గోదావరి—



వేములవాడ శ్రీ రాజరాజేశ్వరస్వామి ఆలయం



వేములవాడలోని ధర్మగుండం

మాండవ్య (మానేరు) నదులమధ్య ఉన్నది. కేదార ములో ఉదకం త్రాగితే ముక్తి. శ్రీశైలంలో శిఖరం చూస్తే ముక్తి. కాశీలో మరణిస్తే ముక్తి. రాజ రాజేశ్వర క్షేత్రంలో ధర్మగుండం నామస్మరణ మున్మాత్రంచేస్తే ముక్తి. ఇంద్రుడు వృత్రాసురుణ్ణి సంహరించిన తరువాత, ధర్మగుండంలో స్నానంచేసి, బ్రహ్మహత్యా దోషాన్ని పోగొట్టుకున్నాడు. దక్ష ప్రజాపతి విశ్వజిత్ యజ్ఞం చేశాడు. అంశుమాలి అనే రాక్షసి హవిస్సుని పుచ్చుకోవాలని వచ్చింది. భాస్క రుడు అది దాని పాలపడకుండా చేశాడు. అయనకు దానితో హస్తాలు ఊడిపోయాయి. ధర్మగుండంలో స్నానం చేసాక, హిరణ్య బాహువులను పొందాడు. అందువల్ల ఇది భాస్కర క్షేత్రంగా గూడా ప్రసిద్ధి గాంచినది. శ్రీరామచంద్రుడు, పంచపాండవులు ఈ క్షేత్రాది దైవతములను పూజించి ఈప్సితార్థసిద్ధిని పొందారు. చాళుక్యరాజులు ఈ స్వామి నర్చించి తరించారు.

కలియుగంలో రాజరాజేశ్వరుడు ధర్మగుండంలో గుప్తుడయ్యాడు. కొంతకాలం గడిచింది. ఒకప్పుడు మాళవదేశాధిపతియైన రాజరాజనరేంద్రుడనే ఒక రాజు ఉండేవాడు. మృగము అనుకొని వేటలో అతడు ఒక బ్రాహ్మణ బాలుని కొట్టాడు. తత్ఫలితంగా రోగ గ్రస్తుడయ్యాడు. అతనిదగ్గరవున్న కుక్కకు కూడా కుష్ఠు వచ్చింది. ధర్మగుండంలో కుక్క మునిగేసరికి దానిరోగం కుదిరింది. రాజుగూడా ఈ గుండంలో మునిగి తమ రోగాన్ని పోగొట్టుకున్నాడు.

అత నక్కడ విశ్రాంతి పొందుతుండగా, ఒక కల వచ్చింది. తను ధర్మగుండంలో ఉన్నానని తనను పైకితీసి గుడి కట్టించాల్సిందని రాజరాజేశ్వరుడు రాజును ఆజ్ఞాపించాడు. ఇక్కడ ఆ రాజు గుడి కట్టించడమే కాకుండా, ఆ పుష్కరిణికి మెట్లుకూడా కట్టించి, అక్కడ ఒక మహా నగరాన్ని నిర్మించాడు. ధర్మగుండానికి శివ సాగరము అనే పేరు గూడా వచ్చింది.

రాజమహేంద్రవరములో రాజరాజ నరేంద్రుడు, సారంగధరుడు మున్నగువారినిగూర్చి చిన్నకథలే ఇక్కడా వింటాము. అయితే ఇక్కడ రాజరాజు రాజమహేంద్ర వరాన్ని పాలించినవాడు కాదని, నర్మదానది తీరములో మాంధాత పురానికి ప్రభువైన మాళవ దేశస్థుడని కొందరు నిరూపించారు. ఈ రాజ్యము చాళుక్య కుల తిలకుడైన వినయాదిత్య యుద్ధమల్లుడు పరిపాలిం చాడు. అతని వంశానికి చెందిన అరికేసరి II—వేయి ఏళ్లక్రితం ఈ వేములవాడను ఇక్కడి దేవుళ్ళ నిమిత్తం దాన మిచ్చాడని ఇక్కడి శాసనాలు చెబు తున్నాయి. వేదాంతసారాన్ని భక్తి గీతాలద్వారా లోకానికి అందజేసిన శ్రీ సీతారామయోగీంద్రుల సమాధి ఇక్కడికి దగ్గరలోనే ఉన్నది.

## హరిహర క్షేత్రం

శివకేశవులకు ఈ క్షేత్రంలో సమాన ప్రతి పత్తి ఇచ్చినందువల్ల ఇది హరిహర క్షేత్రంగా కీర్తింపబడుతోంది. రాజరాజేశ్వరస్వామి ఆలయం ఇక్కడ ముఖ్యమైనది. ప్రసన్నాంజనేయస్వామి, లక్ష్మీ గణపతి, నందీశ్వరులు, గజలక్ష్ములను భక్తులు అర్చించి స్వామి దర్శనం చేసుకొంటారు. అమ్మవారు అయిన పార్వతీదేవిదర్శనం భక్తు లను పులకిత గాత్రులను చేస్తుంది. ఆలయ ప్రాంగణంలో బాలరాజేశ్వరుడు, అనంత పద్మనాభస్వామి, వీరభద్రుడు, ఉమామహేశ్వరుడు,

త్రిపురసుందరి, దక్షిణామూర్తి, చండీశ్వర, భీమే శ్వర, సప్తమాతృకల ఆలయాలు దర్శనీయమైనవి. బుద్ధుడు మున్నగువారి విగ్రహాలు ఉన్నాయి. కొందరు భక్తురాండ్రు శివలింగాలు, నాగఫణాలలో వచ్చి కల్యాణం చేసుకొంటారు. కోర్కెలు తీరిన భక్తులు స్వామికి కోడెదూడలను కానుకలుగా ఇస్తారు.

## భీమేశ్వరాలయం

ఊరుకు ఉత్తర దిశన ఉన్న భీమేశ్వరాలయం కేవలం దైవనిర్మితమా అన్నట్లు ఉంటుంది. అయితే దీనిని నిర్మించిన మహామహుడు రెండవ యుద్ధమల్లుని కుమారుడైన బద్దెగుడు. క్రీ. శ. 850 నుంచి 895 మధ్య ఈ దేవాలయం నిర్మించినట్లు భావి స్తారు. కలియుగానికి ముందువున్న వారంతా భీమే శ్వరునే అర్చించారు. ఆలయం మూలమట్టం క్రిందికి దిగిపోతోంది. చుట్టూ గోడలపై అనేక పురాణ గాథలు, పంచతంత్రము, దశావతారములు, శివలీలలు, వివిధ రకముల పక్షులు చెక్కబడియున్నవి. ఈ ఆల యపు ఆవరణలోనే వీరాంజనేయస్వామిగుడి యున్నది. ఒక అశ్వత్థవృక్షము గూడా యున్నది. భీమకవి ఇక్కడి వాడని గూడా చెబుతారు.

## గొడగూచి తరించిన చోటు

ఇక్కడ ఉండే బద్దికోచమ్మ గుడిని శీతలాదేవి గుడి అని కూడా పిలుస్తారు. బద్దెగభూపాలుడు ఇక్కడ సూర్యనారాయణమూర్తిని ప్రతిష్ఠించాడు. కాని ఇప్పుడు ఉన్నది అమ్మవారే. ఈ క్షేత్రంలో నగ రేశ్వర, కేదారేశ్వర, వేణుగోపాలస్వామి, మహాలక్ష్మి, కనకదుర్గ ఆలయాలు దర్శనీయములు. ఇక్కడ వేద సంస్కృత పాఠశాల ఉన్నది. దేవాలయ పరిపాలన కొక ధర్మకర్తల మండలి యున్నది. సాలీనా ఆదాయం పది లక్షల రూపాయలు దాటింది. యాత్రికులకు సౌక ర్యాలు ఉన్నవి. ఈ క్షేత్రంలో గొడగూచి అనే గొల్లపిల్ల స్వామిని అర్చించి శివసాయుజ్యం పొందిన కథల వంటివి ఎన్నో మనం వింటాము. కలియుగ మందున కల కైలాసం వేములవాడంటే అతిశయోక్తి లేదు.

## క్షేత్రోద్ధరణ

ఈ క్షేత్రోద్ధార కార్యక్రమము మూడుపదుల లక్షల రూపాయలను దాటుతున్నది. ధర్మకుండం మెట్లు మూడున్నర లక్షల రూపాయలతో నిర్మాణం చేశారు. మహామండపం నిర్మాణం అయిదున్నర లక్షలరూపాయలు అంచెనా. నాల్గున్నరలక్షలరూపాయలతో తిరుపతి దేవ స్థానం వారి సత్రం ఒకటి వెలసింది. ఇంకా మరి కొన్ని సత్రాలు వెలసినవి. కొత్తవి బయలుదేరు తున్నవి. ఎన్ని సత్రాలు కడ్తే శివరాత్రికి వచ్చే లక్షలాది యాత్రికులకు సరిపోతలవు? స్వామి దర్శనానికి వచ్చేవారికి ఇంటిదగ్గిర ఉన్నట్లు జరగాలంటే యాత్రకు రావడం ఎందుకు? ఉన్న వసతితో సరిపెట్టుకొని స్వామి దర్శనమే మహాప్రసాదముగా పెట్టుకోవడం యాత్రి కుల ధర్మము. ఉన్నదానిలో వచ్చినవారికి అతిథి అభ్యా గతి మర్యాదలు, సౌకర్యాలు చెయ్యడం ధర్మకర్తల విధి. అర్చనాది నైవేద్యాలు సరిగా జరిగేట్లు చూడటం అర్చకుల, అధికారుల కర్తవ్యం.

---



# తెనుగు ముఱుగులు

డా. తిమ్మావజ్ఝల కోదండరామయ్య

నన్నెచోడుని కుమారసంభవమునందలి యవతారికలో ఇష్టదేవతాస్తుతి సందర్భమున కుమారస్వామి స్తుతిపరముగా ఈ పద్య మున్నది.

తన జనకుఁ డురుస్థాణువు
జనని యపర్ణాఖ్య తా విశాఖుం డనఁగాఁ
దనరియు నభిమత ఫలముల
జనులకు దయ నొసఁగుచుండు షణ్ముఖు:

గౌలుతుస్. (1–8)

ఈ పద్యమునకు ఆకరము 'ప్రబంధ రత్నావళి' యను సంస్కృత సంకలన గ్రంథమున కాన వచ్చును. కవిపేరుగాని, అతని కాలముగాని తెలియరాదు. పయి గ్రంథము మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములో D 12008 సంఖ్య కల వ్రాత ప్రతియందు కలదు. ఆ శ్లోక మిది.

'స్థాణు ర్భవాన్ మూలవిహీన ఏవ
పుత్రో విశాఖో రమణీ త్వపర్ణా
పరే పరస్మై కుసుమై రజస్రం
ఫలన్త్యభీష్టం కి మిదం విచిత్రం'—

నీవు మూలవిహీన మయిన స్థాణువవు. పుత్రుడు విశాఖుడు. రమణియో అపర్ణ. ఇతరులు తెచ్చి అర్పించిన పూలచేత అభీష్టము లనెడి ఫలములు పండుచున్నవి. ఇది యేమి విచిత్రము!—మూలము శివపరముగా నున్న యీ వర్ణనము కుమారసంభవమునందు షణ్ముఖపరముగా మార్పు చెందినది. మూలశ్లోకమునందు పుష్పముల ప్రసంగ లవనముగా కలదు. పూలు చెట్టున రేవా ఆ ఫలము లగుట ఇతరులు తెచ్చి సమర్పించిన పూలచే అభీష్టము లనెడి ఫలములు పండుచున్నవి– అనుట విశేషము.

*　　　　*

బసవపురాణములో చతుర్థాశ్వాసమునందు ఒడయ నంబికి వాల్మీకేశుడు శివభక్తులను తెలిపినపిదప అతడు తన గర్వమును విడనాడి భక్తులనువేడి వారి కరుణను పడయుము ననుచు—

'ఆడాడ భక్తాళి కభిముఖుం డగుచు
వందంద బారెంట నంత మూరెంట
నందుండి ధరణి సాష్టాంగంబు విడుచుఁ
దాళముల్ గ్రంగన ధ్వనియించి మ్రొక్కి
వేళానుకూల విలోల రాగములఁ
బరఁగు మహాభక్త చరితలు నాద
భరితమై చనఁ దిరుపాటలు చేసి
పాడుచు నొక్కొక్క భక్తుని చరిత
వేడుకఁ బొగడు నవ్విధ మెట్టిదనిన'—

(4—312 పుట)

అనుచు ఎణ మూర్తినైనారు కథ కడమలనంబి కథ, గుగ్గులు కళియారు కథ,. అరివాళు నయనారి కథ, అడిభర్తుని కథ, ఏణాదినాథుని కథ, చేదివల్లభుని కథ, కరయూరిచోడని కథ, కళియంబ నైనారు కథ, ఇరువదాండారి కథ, దంగుళిమారయ్య కథ, గణపాలుని కథ, కుమ్మరగుండయ్యగారి కథ, పూసల నయనారు కథ, మఱికొండఱు భక్తుల కథలు వరుసగా 'తిరుపాటలు'చేసి భక్తితో గానము చేయును. ఒక్కొక్క భక్తుని చరితమును కీర్తించి తుదిని 'అడచిన యెణమూర్తి నయనారిబంట, వెలసిన యా కడమలనంబి బంట, వెలసిన గుగ్గులు కళియారిబంట, అరివాళు నయనారి కనుఁగుభృత్యుండ ... యేనాదినాథుని యిలువుట్టుబంట ... దంగుళిమారయ్య వెంగులిబంట... పూసలనయనారి దాసానుదాసి ... చన్నపురాతన శరణుల బంట, ఉన్ననూతన భక్తయూథంబుబంట, యిట మీఁద శివుఁగొల్చి యాస్సితార్థములు పటుతరంబుగఁ గాంచు భక్తులబంట'— అనుచు ఒక్కొక్క భక్తునికి తాను బంటనని, సేవకుడనని పేరుపేర పేర్కొనుచు తిరుపాటలు పాడును. ఈ తిరుపాటల రచనా విధానము సోమనాథునికి సుందరమూర్తి నయనారు రచితమగు 'తిరుత్తొండర్ తొగ్గై' అను స్తోత్రగ్రంథముతో గల పరిచయమును తెలియజేయుచున్నది. 'తొండర్' అనగా తమిళమున భక్తులని యర్థము. తొగ్గై అనగా సంకలనము. 'భక్తస్తోత్ర సంచయము' అని యీ గ్రంథనామమున కర్థము. సుందరమూర్తి నయనార్ రచించిన యీ తిరుత్తొండర్ తొగ్గైని ఆధారముగా చేసికొనియే కాలాంతరమున శేక్కిలార్ అనుకవి (క్రీ. శ. 12 వ శతా

బ్దము) పెరియపురాణములో ఆ భక్తుల చరితములను విపులముగా అభివర్ణించెను. తిరుత్తొండర్ తొగైలోని రచనా విధానమునకు సోమనాథుని రచనముతో కంపోలికను తెలిసికొనుటకై అందలి యీ క్రింది పంక్తులను చూడఁ దగును.

'ఇల్లై మలిన్ద వేనంబి ఎరిపత్తర్ క్కడియేన్
ఏనాది నాదన్ఱన్ అడియార్కుం అడియేన్
కల్లై మలిన్ద నీళ్‌నంబి కణ్ణప్పర్ క్కడియేన్
కడవూరిల్ కలైయన్దన్ అడియార్కుం
అడియేన్
మల్లై మలిన్ద తోళ్ వళ్ళల్ మానక్కంజారన్
ఎంజాద వాట్టాయన్ అడియార్కుం అడియేన్
అల్లై మలిన్ద పునల్‌మంగై ఆనాయర్
క్కడియేన్
ఆరూరన్ ఆరూరిల్ అమ్మానుక్ కాళే.'

పయి పంక్తులలో ప్రతి పాదమునను 'అడియేన్' అని కలదు. 'ఎడిపత్తర్ క్కడియేన్' అనగా అడి భక్తుని బంటను అని అర్థము. ఇట్లే అన్నిటను. అడియేన్ అనగా దాసుడు, సేవకుడు, బంటు, లెంక. సోమనాథుడు అడియేన్‌కు పర్యాయముగా ఈ పదముల నెల్ల పేర్కొనెను. సుందరమూర్తి నాయనారు గొప్ప శివభక్తుడు. క్రీ. శ. 8 వ శతాబ్దమునకు చెందినవాడు. శివభక్తుల కూటువలలో అతని యీ రచనము పఠనపాఠనము లందుండగా సోమనాథుడు దానితో పరిచయమును సంపాదించికొని యుండును. ఆ శివభక్తుని చరితమునే రచించునపుడు అతడు పాడినపాటలుగా అట్టి రచనమునే సంధానించి యుండును. ఒడయనంబి సుందరమూర్తికి మఱొక పేరు. నిజమునకు ఆపదము 'ఉడయనంబి' అని యుండదగును. తమిళమున అతడు 'ఆళుడయనంబి'గా ప్రసిద్ధుడు. ఉడయనంబి దాని సంగ్రహరూపము. ఉడైయవర్ అనగా ప్రభువని అర్థము. ఆళుడయనంబి యను పదమునకు (మనల) పరిపాలించు ప్రభువయిన నంబి అని యర్థము. ప్రొఫెసరు టి. పి. మీనాక్షిసుందరము గారి యీ వాక్యములు చూడుడు. 'St Sund rar as already seen was kn wn as Nambi. Udayavar means Swamy, Lord. Udaya, the relative participle form followed by the name Nambi means 'Nambi who is our Lord'. In Tam l he is kn wn as 'Aludaya Nambi' and 'Udaya Nambi' which becomes in Telugu Odayanambi is its shortened form'—(p. 29. Ibid.)

ఇచ్చట నొక విషయమును గమనింపవలసి యున్నది. శేక్కిలార్ అను కవి సుందరమూర్తి నయనారుయొక్క జీవితమును ప్రధాన వస్తువుగా గ్రహించి దానికి సంబంధించినట్లుగా తిరుత్తొండర్‌తొగైలో అతడు పేర్కొనిన అరువదుమూవరు శివభక్తుల చరితల నెల్ల తన పెరియపురాణమునందు అభివర్ణించెను. అట్లే సోమనాథుడును బసవేశ్వరుని జీవితాభివర్ణనమును తన బసవపురాణమున ప్రధాన వస్తువుగా గ్రహించి దానికి సంబంధపడునటుగా శైవమతమునకు చెందిన వివిధ భక్తుల కథలను జోడించి తెలిపెను. 'పూరితంబై యెప్డు పూసలలోన, దారంబు క్రియఁ బురాతన భక్తనితతి, చరితల లోపల సంధిల్లి బసవ, చరితమే వర్ణింతు సత్కృతి యనఁగ'—అని సోమనాథుడు తెలిపిన విషయము పెరియపురాణమునకును సరిపడుచున్నది. అచట బసవచరిత మభివర్ణింపబడగా పెరియపురాణమున సుందరమూర్తి చరితమభివర్ణింపబడినది. బసవేశ్వరుని వలెనే సుందరమూర్తియు స్వయము కవి, భక్తుడు. తిరుత్తొండర్ తొగైలోని భక్తుల సంగ్రహ చరితలను శేక్కిలార్ విశదీకరించి వర్ణింపగా సోమనాథుడు బసవేశ్వరుని వచనములలోను, పండితారాధ్యుని శివతత్త్వసారమునందును అభివర్ణితులయిన శివభక్తుల చరితములను తన బసవ పురాణమునందు అభివర్ణించెను. ఇందులో ఎవరు ఎవరిచే స్ఫూర్తి పొందిరో, చెప్పుట కష్టము. పెరియపురాణమును రచించిన శేక్కిలార్ క్రీ. శ. 12 వ శతాబ్దికి చెందినవాడు. 12 వ శతాబ్దిలో పూర్వార్ధమునకు చెందినవాడని కొందఱును, కాదు, ఉత్తరార్ధమునకు చెందినవాడని మఱికొందఱును ఈతని కాలము విషయమున భేదాభిప్రాయములు కలిగి యున్నారు. ఏది యెట్లున్నను అతడు క్రీ. శ. 12 వ శతాబ్దికి చెందిన వాడనుట మాత్రము సత్యము. ఇప్పటి యాధారములనుబట్టి పాల్కురికి సోమనాథుడుకూడ క్రీ. శ. 12 వ శతాబ్దికే చెందినవాడవి భావింపబడుచున్నది. కన్నడమున శివభక్తుల చరిత్రములను 'శివశరణర రగళె' అను పేర రగడచ్ఛందములో రచించిన హరీశ్వరుడు క్రీ. శ. 13 వ శతాబ్దికి చెందినవాడని కొందఱి యభిప్రాయము. ఇట్లు శివభక్తుల చరిత్రములు ఇతివృత్తముగా కావ్యములు తమిళము, తెలుగు, కన్నడము—ఈ మూడు భాషలయందును ఇంచుమించుగా సమకాలమునందే రచింపబడుట యాశ్చర్యము గొలుపును.

# మొహంజొదారో - శ్రీకృష్ణుని ద్వారకయే!

## శ్రీ జి. వేంకటేశ్వర రావు

సింధునదివద్ద సింధు నాగరకత విలసిల్లినదని మన కందరికీ తెలుసు. ఆనాటి నాగరకత చాల విశిష్టమైనది. సింధునది దగ్గర బయల్పడిన ఈ నాగరకత ఉత్తరమున హిమాలయములనుండి, దక్షిణమున కథియవాడ్, అరేబియా సముద్రం వరకును; పశ్చిమాన మకరన (Makarana) వరకు; తూర్పున హస్తినాపురివరకు వ్యాపించి ఉంది. ఆ ప్రదేశాలలో త్రవ్వ కాలవలన సుమారు నలభై వలసలు బయల్పడగా అందులో కొన్ని గ్రామములు, కొన్ని పట్టణములు, మరికొన్ని నగరాలు ఉన్నవని తెలిసింది. మొహంజొదారో హరప్పా అనేవి ఆనాటి నగరములే. ఈ నగరాలలో ప్రజలు అత్యున్నతమైన సాంఘిక జీవితాన్ని గడిపేవారని తెలుస్తున్నది. ప్రఖ్యాత చరిత్రకారుడగు శ్రీ బాబా గులాబ్‌రాయ్ ఈ విషయాన్ని విశదీకరించారు. సింధు నాగరకత పూర్వాపరాల గురించి విభిన్నాభిప్రాయాలు చరిత్రకారులలో ఉన్నవి.

మొట్టమొదట సర్ జాన్ మార్షల్ అను పాశ్చాత్యచరిత్రకారుడు సింధునదివద్ద బయల్పడిన నాగరకతను ఇండో–సుమేరియన్ నాగరకతగా గుర్తించాడు. సింధు నాగరకతకు, సుమేరియా నాగరకతకు పోలికలు ఉండటంవల బహుశా ఆయన పొరపడి ఉండవచ్చు. తరువాత జరిగిన పరిశోధనలవలన అది సింధు నాగరకత అనే నిర్ణయానికి వచ్చాడు సర్ జాన్ మార్షల్. పాశ్చాత్య చరిత్రకారులు వ్రాసిన "Cambridge History of India" అనే గ్రంథంలో "సింధు నాగరకత భారత దేశానికి సంబంధించింది కాదు" అని అభిప్రాయపడ్డారు. ఈ నాగరకత గంగాలోయకు వ్యాపించిందీ లేనిదీ తెలియడంలేదు. సింధు నాగరకత తర్వాతి కాలంలో "అకమనెడ్స్ అనే రాజుల పరిపాలన కాలంలో మొస్తరుగా పాశ్చాత్య నాగరకతలకు సరిహద్దుగా వుందనీ, ఈ నాగరకత భారతీయ నాగరకతకంటే, మెసపొటేమియా, ఇరాను నాగరకతలను కలుపునట్టిదిగా ఉందని" అన్నారు కేంబ్రిడ్జి చరిత్రకారులు. 'Whether this civilization extended into Ganges valley is not known it may be that the Indus, as in later times under the Achaemenids marked a boundary between East and West and that his culture should be linked with Mesopotamia and Iran rather than India with proper. (CAMBRIDGE HISTORY OF INDIA.) ఈ వాదనవల్ల చరిత్రకారులు భారతదేశ చరిత్రకు ద్రోహం చేశారని చెప్పడంలో సందేహంలేదు. నిజానికి మహాభారతాది పురాణాలపై ఆధారపడిన ఈ 5500 సంవత్సరములనాటి నాగరకత మహాభారత కాలంనాటి వేదనాగరకత అని గమనించగలుగుతాము. సింధులోయ నాగరకతను ద్వారకానగర నాగరకత అని స్పష్టంగా చెప్పడానికి అనేకాధారాలు భాగవతం, మహాభారతం మొదలగు ఇతిహాసాలద్వారా మనకు లభిస్తున్నాయి.

చరిత్రకారులు సుదీర్ఘ పరిశోధనలు జరిపి సింధు నాగరకత కాలాన్ని నిర్ణయించడానికి ప్రయత్నించారు. పండిత సదాశివ ముంగాంకర్, శ్రీ కేదార్‌నాథ్‌శాస్త్రి, పండిత మహేశచంద్ర కావ్యతీర్థ సంభ్యార్నవ, ఆచార్య జేసీ మహదేవములగాంకర్ మొదలగు రచయితలంతా సింధు నాగరకతా కాలాన్ని చక్కగా పరిశోధించారు. ఈనాటి ప్రముఖులైన శ్రీ ఎమ్. వి. ఎన్. కృష్ణారావు (Technical Assistant Indian Archaeological bureau,) డాక్టర్ ఫతేసింగ్ (Rajasthan Oriental Research Institute), డాక్టర్ రోమిలాథాపర్ (Jawaharlal Nehru University, Delhi), శ్రీ పి. బి. పండిట్ మొదలగువారు సింధు లోయవద్ద దొరికిన ముద్రలపై (Seals) గల భాషను పరిశోధించారు. సింధు

నాగరకత క్రీస్తుపూర్వము 3500–2000 కాలంలో విలసిల్లినదని పండితులు, పురాతత్వ శాస్త్రజ్ఞులు ఒకే అభిప్రాయానికి వచ్చారు. అనగా ఈ నాగరకత 5500 సంవత్సరములనాటిదని తెలుస్తున్నది. ఈ నాగరకత బయల్పడిన ప్రదేశములలో దేవుని విగ్రహాలు; దేవతల విగ్రహాలు, బొమ్మలు, మరికొన్ని వస్తువులు దొరికాయి దీనినిబట్టి సింధు ప్రజలు ఆ నాడు వేద సంస్కృతిని అనుసరించేవారని తెలుస్తున్నది.

సింధు నాగరకతయొక్క పతనాన్ని గురించి చరిత్రకారులలో విభిన్నాభిప్రాయాలున్నాయి. కాని వరదలవల్ల సింధు నాగరకత అంతమైందని ఎక్కువ మంది చరిత్రకారులు నమ్ముతున్నారు. మొహంజొదారో త్రవ్వకాలనుండి బయల్పడిన జలచరముల యొక్క అవశేషాలు, వరదలు కల్పించిన సర్వనాశనాన్ని ఈనాటికి కూడ ఋజువుచేస్తున్నాయి. 'హరప్పా, మొహంజొదారోలో సింధు నాగరకత ఆర్యుల దాడివల్ల నాశనం కాలేదని, వరదలవంటి ప్రకృతి వైపరీత్యాల వల్లనే ధ్వంసమైందని పురాతత్వ పరిశోధనశాఖ సూపరింటెండింగ్ ఆర్కియాలజిస్ట్ శ్రీ ఎస్. ఆర్. రావు ఇటీవలి పరిశోధనల్లో వ్యక్తంచేశారు. సింధు నాగరకత విలసిల్లిన ప్రాంతాల్లో ఈనాటికి కూడ వరదలు వస్తున్నాయని తన వాదాన్ని శ్రీ యస్. ఆర్. రావు బలపరచినారు. "An Advanced History of India" అనే గ్రంథంలో సింధు నాగరకత అంతమును గురించి వివరింపబడియున్నది. "This city was successfully destroyed and rebuilt no less than seven times, the inundation of the Indus being perhaps the chief agency of destruction. The rebuilding did not always follow the destruction, but sometimes the city remained in ruins for a Considerable period before a new city rose upon them. Thus after the foundation of the city many centuries passed before it was finally abandoned." భౌగోళిక, భూగర్భ శాస్త్రజ్ఞుల పరిశోధనలవల్ల సింధు ప్రజలు సింధు మొదలగు నదులనుండి భవనములను రక్షించుకోడానికి భవనములప్రక్క ఎత్తుగా గట్లువేసే వారని కూడ తెలుస్తున్నది.

మహాభారతాది పురాణాలపై ఆధారపడి, ఈ 5500 సంవత్సరాలనాటి నాగరకతను మనం సూక్ష్మంగా పరిశీలన చేసినట్లయితే, సింధులోయ నాగరకత మహాభారతకాలంనాటి వేదనాగరకత అను విషయాన్ని మనం గమనించగలము. అనేకమంది యాదవులు నివసించిన ఆ ప్రదేశం నేటి గుజరాతులోని ద్వారక ఎంతమాత్రం కానేరదు. ఆదిశంకరులు హిందూ ధర్మాన్నీ, సంస్కృతినీ పునరుద్ధరించడానికి గాను దేశం నాలుగు చెఱగుల్లో నాలుగు పీఠాలను స్థాపించిన సందర్భంలో ప్రస్తుతపు ద్వారకను 2500 సంవత్సరముల పూర్వము స్థాపించినారు. ఈనాటి ద్వారక నిజంగా పురాతన కాలంనాటి ద్వారక అయినట్లయితే మూలద్వారక, గోమతిద్వారక, బెట ద్వారక అనే మూడుద్వారకలు ఉండటానికి వీలులేదు. నేటి ద్వారకపౌరాణిక ద్వారకలో ఒక కూడలి స్థానం మాత్రమేనని తెలుస్తున్నది.

మహాభారత, భాగవత పురాణాల ప్రకారం శ్రీ కృష్ణుడు మధురకు సుదూరంలో ఒక అందమైన రాజధానీ నగరాన్ని నిర్మించాడని తెలుస్తూంది. మగధ రాజైన జరాసంధుడు నిత్యం కలహంతో ఉన్నందు వల్ల ఈ నగరాన్ని కృష్ణుడు నిర్మించాడు. దానినే 'ద్వారక', 'ద్వారావతి', లేక 'యదుపురి' అంటారు. మహాభారతంలోని సభాపర్వంలో ద్వారక చక్కగా వర్ణింపబడింది.

'ద్వారకలోని రాజభవనాలు సూర్యచంద్రుల లాగ ధగధగమెరుస్తూ, మేరుపర్వత శిఖరములంత యెత్తుగా ఉన్నాయి. రాజభవనాలతో ప్రకాశించుచున్న ఈ ద్వారకా నగరాన్ని దేవతాశిల్పియైన విశ్వకర్మ నిర్మించారు. నగరం చుట్టూఉన్న అగడ్తలు ద్వారక అందాన్ని ఇనుమడింపజేస్తున్నాయి. నందనవనం, మిశ్రకవనం, చైత్రవనం, వైభవరాజవనంతో నిండిన ద్వారక కళకళ లాడుతూంది. ద్వారకకు తూర్పున కైటకపర్వతం, దక్షిణాన లతావంత పర్వతం, పశ్చిమాన సుభాస పర్వతము, ఉత్తరభాగంలో వేనుమంత పర్వతం ఉన్నాయి. ఈ పర్వతములకుచుట్టూ అందమైన పూదోట లున్నాయి. నగరం తెల్లగా మెరిసే ఎత్తైన ప్రాకారంతో ఆవరింపబడి ఉంది. ద్వారకకు తూర్పు భాగంలో నూరు ధనుస్సుల కొలతలు గల పుష్కరిణి ఉంది. నగరానికి సుమారు 50 ద్వారాలు ఉన్నవి. అందమైన భవనాలు, గాలి

గోపురాలు ద్వారక అందాన్ని, గొప్పతనాన్ని తెలియ జేస్తాయి.

నగర సంరక్షణకు వాడియైన ఆయుధాలు, పిరంగులు చక్రాయుధాలు ఉపయోగించారు. నగరం యొక్క విస్తీర్ణం షుమారు 90 యోజనాలని తెలుస్తున్నది. నగరాన్ని చేరడానికి ఎనిమిది పెద్ద రహదారి మార్గములు (Trunk Roads), పదహారు చిన్న మార్గములు (Quadri Junctions) ఉన్నాయి. శుక్రాచార్య శిల్ప సిద్ధాంత రీతితో ద్వారకా నగరం నిర్మింపబడింది — అని మహాభారతంలో ద్వారక వర్ణింపబడింది. మొహంజోదారో పరిసర ప్రాంతాల లోని త్రవ్వకాలనుండి బయల్పడిన శిథిల దేవాలయ ములు, మార్గములు, స్నానఘట్టాలు మొదలగునవి శుక్రాచార్య శిల్పానికి సంబంధించిన ఈ సిద్ధాంతాన్ని నిరూపిస్తున్నది.

భాగవత పురాణంలోని దశమస్కంధంలో కూడ అదేవిధంగ ద్వారక వర్ణన ఉంది. ఈ నగరంలో దేవతా శిల్పియైన విశ్వకర్మ యొక్క సుందర వాస్తు శిల్పం నేటికి కానవస్తుంది. ద్వారకానగరంలో అనేక రహదారి మార్గాలు, కాలిబాటలు, వీధులు, ఆవరణలతో కూడి యున్న వసతి గృహాలు ఉన్నాయి. అనేక పూదోట లతో నిండిన ద్వారక అందంగా అలంకరించినట్లుగా ఉంది. బంగారు మలాము చేయబడిన రాజభవనాలు, ఆకాశాన్నంటేభవనాలు, కెంపులతో కప్పబడిన భవనాలు చూడడానికి కళ్లు జిగేల్‌మనేట్లుగా ఉన్నాయి. పశువుల శాలలు చూడ ముచ్చటగ ఉన్నాయి. వెండి, కంచు మొద లగు లోహములతో నిర్మించబడిన బంగారు గోపురాలతో ఉన్న ద్వారకానగర గోపురాల అందం దూరాన్నుంచి కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నాయి. భవనంయొక్క చేల మరకత మాణిక్యాలతో అలంకరించ బడి ఉంది. దేవాలయాలు, వసతి గృహాలు ద్వారకా నగర సౌందర్యాన్ని ద్విగుణీకృతం చేస్తున్నాయి. ద్వార కలో అన్ని వర్ణాల ప్రజలు నివసించేవారని తెలు స్తుంది. శ్రీ కృష్ణుని రాజమందిరం, ఇతర యాదవ ప్రముఖుల భవనాలు ద్వారకా నగర మధ్యభాగంలో నిర్మింపబడ్డాయి.

భాగవత పురాణంలో ద్వారకా నగరాన్ని నీటి మధ్యలో నిర్మించినట్లుగ వర్ణింపబడి ఉంది. నీటి మధ్యలో నిర్మించబడింది అనడంలో వేరే అర్థంకూడ ఉంది. వరదలవలన ఎప్పుడూ ద్వారకా నగరం చుట్టూ నీరు ఉండేదని, అందువలననే ద్వారక నీటి మధ్యలో ఉన్నట్లుగ వర్ణింపబడిందని చెప్పవచ్చు. అందువల్లనే ద్వారకా నగరానికి 'జలమయసింహ ద్వారమని' (Gate way of water) పేరు వచ్చింది.

మహాభారత కాలంలో సరస్వతీనది ఒక పెద్ద నదిగా పేర్కొనబడింది. వేదాల్లో చెప్పబడిన సప్త సింధువులలో సింధునది, జీలం, చీనాబ్, రావి, సట్లెజ్, బియాస్, సరస్వతి నదులున్నవి. ఆ సమ యంలో సరస్వతీనది సింధునదివలె పెద్దనదిగా ఉండేది. కాని కొంత కాలం తర్వాత అది అరేబియా సముద్రంలో కలిసి పోయినట్టుగా తెలుస్తున్నది. ఆ నాడు పెద్దనదిగా పేర్కొనబడిన సరస్వతి కురు క్షేత్ర మైదానంలో కాలువరూపంలో ప్రవహిస్తూ రాజస్థాన్ దగ్గర ఎక్కడో అంతమౌతున్నది. ఋగ్వే దము, మహాభారతములలో చేయబడిన భౌగోళిక నిర్ణయాలనుబట్టి ప్రస్తుతపు రాజస్థాన్ రాష్ట్ర మంతటా ఒకప్పుడు సముద్రమని తెలుస్తున్నది. ఈ విషయంకూడ సరస్వతీనది ప్రస్తుతపు రాజస్థాన్‌లో ఎక్కడో అంతమవుచున్నదను సత్యాన్ని నిరూ పిస్తున్నది. బహుశా ఇది అరేబియన్ సముద్రం యొక్క భాగమైవుండి, దానిలో సరస్వతి కలసిపోయి ఉంటుంది. కాలక్రమంలో సముద్రం వెనుకకుపోయిన కొద్దీ భూభాగం బయల్పడి ఉండవచ్చు. పైన చెప్పబడిన వాదాన్ని శ్రీ కె. ఎమ్. ఫణిక్కర్ "A Survey of Indian History" అనే గ్రంథంలో ధ్రువపరచినారు. "This civilization at Ruper and in Bikaner extended far into the interior and may have had its centre in the valley of the Saraswati, the river which disappeared in historic times in the sands of Rajasthan."

మహాభారతకాలంలో హిమాలయ పర్వతాల్లో జరిగిన అనేక కంపనాలవల్ల సరస్వతీ ముఖద్వారంతో

వెల్లువలువచ్చి జలప్రవాహమేర్పడి పెద్ద సరస్సుగా తయారైంది. నేటి భాక్రానంగల్ ప్రాజెక్టు స్థలం సరస్వతీ ముఖద్వారంగా ఉండవచ్చని తెలుస్తున్నది. భూకంపాల వల్ల అక్కడి రిజర్వాయరు శిథిలంకాగా సింధు, సట్లెజ్ నదులలోనికి విపరీతంగా నీరు ప్రవహించి. వాటి వరదలవలన ద్వారకానగరం మునిగిపోయింది. ఈనాడు సింధు నాగరకతగా పొరపాటుగా పిలువబడుతున్న ఈ నాగరకత మహాభారత కాలంనాడు 'ద్వారకలో విలసిల్లిన నాగరకత' అని నిర్వివాదంగా చెప్పవచ్చు.

మహాభారతంలోని మౌసలపర్వం, 7 వ అధ్యాయంలో ద్వారకానగరంలో జరిగిన జలప్రళయం గురించి చక్కగా వర్ణింపబడింది.

'నియతు తు జనే తస్మిన్
సాగరో మకరాలయః
ద్వారకామ్ రత్న సంపూర్ణ
జలౌ నాల్పావయత్ తదా.'

భాగవత పురాణంలో 30 వ భాగంలోని 11వ స్కంధంలో శ్రీ కృష్ణుడు ద్వారకానగరంయొక్క జలమయాన్ని గురించి ఈ విధంగా వర్ణించాడు.

'ద్వారకా యాంచ నస్థేయమ్
భవద్భి స్వస్వ బంధుభిః
మయా త్యక్తామ్ యదుపురీం
సముద్రః ప్లావయిష్యతి.'

భాగవత పురాణంలో ద్వారకానగరం జలమయమైనట్లు చెప్పబడింది.

"ద్వారకామ్ హరిణాత్యక్తామ్
సముద్రః ప్లావ యత్క్షణాత్."

ప్రస్తుత కాలంలో శ్రీకృష్ణుని ద్వారకను మొహంజోదారో (మోహన్+జో+దారో) అనవచ్చును. శ్రీ కృష్ణుని 'మోహనుడు' లేక 'అందమైన వాడు' అని కూడ అంటారు. 'దార్' అనే పదమునకు 'ద్వారము' లేక 'సింహద్వారము' అని అర్థం చెప్పవచ్చు. పురాతన ద్వారకానగరం విశాల ప్రాంతాన్ని ఆవరించుకొని ఉండేది. ప్రస్తుతపు మొహంజోదారో ప్రదేశం ఆనాటి ద్వారక యొక్క రాజధానీ నగరం. ఈనాడు ఢిల్లీనగరం ఏవిధంగానైతే 580 చ. మైళ్ళ విస్తరించిందో, అదేవిధంగా శ్రీ కృష్ణుని కాలంలో ద్వారక కూడ అనేకవేల చదరపుమైళ్లు విస్తరించిందని తెలుస్తున్నది. అంధక, వృష్ణి మొదలగు తెగలకు చెందిన యాదవుల కేంద్రీయ వ్యవస్థతో కూడిన రాజ్యము శ్రీ కృష్ణుని ఆధిపత్యంలో ఉండేది. ఆ విధంగా ఏర్పడిన సంయుక్త రాజ్యంలాగానే ఆ కాలంలో ద్వారక సంయుక్త రాజ్యంగా ఉండేది.

నా యీ చిన్న వ్యాసంలో నేను చెప్పదలుచుకున్న విషయం 'మొహంజోదారో శ్రీ కృష్ణుని ద్వారకయే' అని చెప్పటానికి ప్రాథమిక విచారణ (Prime facie case) మాత్రమే. కాని చరిత్రకారులు చేయవలసినది చాల ఉంది. పాశ్చాత్య చరిత్రకారుల వ్రాతలపై, భావాలపై మోజుపడకుండా, సత్యాన్ని అన్వేషించాలి. యదార్థ చరిత్ర రచనకు పూనుకోవాలి. అందుకు సరియైన కృషి జరగడం అత్యవసరం. చరిత్రకారులు ఈ పరిశీలనకు మన ప్రాచీన సంస్కృత గ్రంథాలను పరిశోధించినట్లయితే పైన చెప్పబడిన వాదం నిజమవుతుంది. అంటే 'మొహంజోదారో శ్రీ కృష్ణుని ద్వారకయే' అని చెప్పగలుగుతాము.

# కలగూరగంప

## రాష్ట్రౌఢవంశ మహాకావ్యము రుద్రకవి రచనయా?

కందుకూరి రుద్రకవి రచనలుగా నిరంకుశోపాఖ్యాన ప్రబంధము, సుగ్రీవ విజయ యక్షగానము, జనార్ద నాష్టకము—వాఙ్మయ చరిత్రకారు లెల్లరు నంగీకరించిరి. 'సుధాతరంగిణీ' వ్యాఖ్యానమను పేర శ్రీ స్వర్ణ సుబ్రహ్మణ్య కవిగారు నిరంకుశోపాఖ్యానమునకు విపులమైన టీకా తాత్పర్య సహిత గ్రంథమును వెలయించిరి. ఆ గ్రంథమునకు ఉపోద్ఘాతము శ్రీ కొండూరి వీరరాఘవాచార్యులవారు రచించిరి. ఆ ఉపోద్ఘాతమున రుద్రకవి రచనముగా రాష్ట్రౌఢవంశ మహాకావ్యమను సంస్కృత కావ్యము చేర్చబడినది. ఈ విషయమున వారు కవివారి వంశమున లభించిన తాళపత్ర గ్రంథమును బొంబాయిలో ముద్రితమైన గ్రంథమును పరిశీలించినట్లు వారి మాటలవలన తెలియుచున్నది. బరోడాలో ముద్రితమైన ప్రతియందు చాల వ్యత్యాసము లున్నవనిరి. 13.9.1940 వ తేది గైక్వార్ లైబ్రరీవారు వీరి కిట్లు సమాధాన మిచ్చిరి: 'మాయొద్ద 60 పుటలుగల తాటియాకుల గ్రంథము మాత్ర మున్నది. సమగ్రముగా లేదు. గ్రంథము యొక్క కడపట గద్యముగూడ లేదు. ఇంక నెక్కడనైనను గొప్ప లైబ్రరీలలో విచారింపుడు.' వీరరాఘవాచార్యులవారు లభించిన తాళపత్ర ప్రతులందలి సర్గాంత శ్లోకము లాధారముగా నీ కావ్యము కందుకూరి రుద్రకవి రచనమని యభిప్రాయపడిరి.

వారుదాహరించిన సర్గాంత శ్లోకము లివి:—

'రాష్ట్రౌఢ క్షితిపాలవంశ
ముకుటాలంకార చూడామణి
శ్రీ నారాయణ శాహజీవన విధేః
సత్కీర్తి ముక్తావళీం
విద్వత్కుండల భూషణాని
విశదశ్లోకైర గుంఫద్గుణ
స్ఫారైః పండిత మండలాంబుజ రవిః
శ్రీ రుద్రనామాకవిః.'

'శాకేభోగి శరాబ్ధి భూ పరిమితే
సంవత్సరే దుర్ముఖే
మాసే చాశ్వయుజే సితప్రతిపది
స్థానే మయూరాచలే
శ్రీమల్లక్ష్మణ పండితోదిత కథా
మా కర్ణ్య రుద్రః కవిః
శ్రీ నారాయణ శాహకీర్తి రసికం
కావ్యం వ్యధాన్నిర్మలం.'

మరొక సర్గాంతమున 'రుద్రస్య విద్యోతతే' అనియు, గ్రంథాంత శ్లోకమున—

'శ్రీమద్బాగుల భూమిపాల
తిలక శ్రీ శాహనారాయణ
స్ఫూర్జత్కీర్తి చరిత్ర చిత్రిత
పదే రాష్ట్రౌఢ వంశాభిధే
భవ్యే స్కంధపురాన్వయేన
కవినా రుద్రేణ సృష్టే మహా
కావ్యే ఒస్మిన్ కృతవైరి వీర
విజయః సర్గస్తు వింశోఽగమత్.'

'కవియట్లే కడమ యేకోనవింశతి స్వర్గములందును బహుచమత్కారముగ నీ శ్లోకాంతిమ పాదమున కథను తెలియజేయుచు సర్గసంఖ్యను వివరించుచు చిత్రించినాడు. కావ్యనిర్మాణ కాలమును తనవంశమును దన శక్తియును దెలియజేసిన శ్లోకములగూడ నిందు జొప్పబడిన'వని వీరరాఘవాచార్యులవారు వివరించిరి. ఈ మహాకావ్యమున బౌత్తరేయ రాజుల చరిత్రను వర్ణించినట్లు పేర్కొనబడెను.

వాఙ్మయ చరిత్రకారు లెవ్వరును ఈ మహాకావ్యము కందుకూరి రుద్రకవి కృతమని యంగీకరించినట్లు లేదు. సమగ్ర ఆంధ్రసాహిత్య చరిత్రమునను ఆరుద్ర దీనినిగూర్చి ప్రస్తావింపలేదు. విక్రమసింహపురి మండల సర్వస్వమున ప్రాచీనకవుల చరిత్రలో రుద్రకవి జీవితవిశేషములను వివరించుచు ఆ వ్యాసరచయిత రాష్ట్రౌఢ వంశకావ్యము రుద్రకవి రచితము కాదనిరి. వారి వాక్యములివి: 'రాష్ట్రౌఢ వంశ మహాకావ్య' మొక సంస్కృతగ్రంథ మున్నది.

దాని రచయితపేరు రుద్రకవి. కాని ఆ కవివేరు. అతని తండ్రి అనంతభట్టు: తండ్రి తండ్రి కేశవభట్టు. ఇతడు క్రీ. శ. 1556 మొదలు 1608 వఱ కుండెను. కాబట్టి నామసామ్యమున 'రాష్ట్రౌఢ వంశ మహాకావ్యము యీతని కంటగట్టుట ఉచితము గాదు. ఈతని గుఱించిన యథార్థత కల్పనలు చాల పుట్టియున్నవి. అవి యన్నియు గర్హితములు. (పుట. 228.)

ఈ కావ్యనిర్మాణమునుగూర్చి నిర్ధరించుటకు తగిన సాక్ష్యాధారము లింకను సేకరింపబడవ సి యున్నది. నేను సేకరించిన వివరములవి: వాఙ్మయ చరిత్ర పరిశోధకు లీ విషయమై చర్చించి నిర్ధరింప గోరుచున్నాను. రాష్ట్రౌఢవంశ మహాకావ్యమునందలి 'శాకే భోగి శరాబ్ధి భూ పరిమితే సంవత్సరే దుర్ముఖే, మాసే చాశ్వయుజ సితప్రతిపది' అను వాక్యము లాధారముగా కాలము శా. శ. 1458, క్రీ. శ. 1536 అగుచున్నది. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ప్రకటించిన తామ్రశాసనమునందలి కాలము— 'అద్యాశీతి చతుశ్శతాధిక సహస్రమైం శకాబ్దాః గతా' శాలివాహన శకము 1480. క్రీ. శ 1558. రెండింట కాల మించుమించు సరిపోవుచున్నది.

సంస్కృత వాఙ్మయ చరిత్రకారులలో సుప్రశస్తులైన శ్రీ యం. కృష్ణమాచారిగారు రాష్ట్రౌఢ వంశ మహాకావ్య నిర్మాణమున నిట్లు సెలవిచ్చిరి. (చూ: Classical kt litt page 273. పేరా 198.)

"Rudra was the son of Ananta and Grandson of Kesava. He belonged to the Deccan and appears to have gone abroad to courts of Northern India. In Mayuragiri, he was Patronised by King Narayana Shah and his son Pratap Shah. In his RASTRAUDHA VAMSA a Poem of 20 cantos he describes the history of the Bagulas of Mayuragiri from the first king of the dynasty, Rastraudha, king of kanouj. This poem was composed in 1596 A D. Later he wrote a work in prose, divided in o ullasas Jehangir Shah Charita."

నిరంకుశోపాఖ్యానమున రుద్రకవి తన్ను గూర్చి గ్రంథాంతమున నిట్లు తెలుపుకొనెను.

'అతులతర సోమవార
వ్రత నియమ ధురీణ హృదయ వారిజ సాధ్వీ
శత వినుత చెన్నమాంబా
ప్రతిదిన సంసేవ్యమాన పదపంకేజా.'

అనుటచే చెన్నమాంబ కుమారుడనియు, ఆశ్వాసాంత గద్యలో 'పెదలింగనార్య గర్భార్ణవ పూర్ణిమాత్రేయ' అనుటచే పెదలింగన కుమారుడనియు తెలియుచున్నది. సుగ్రీవ విజయమునను 'పెదలింగనార్య తనూజుడ'నని చెప్పికొనియున్నాడు. కాని, పై రుద్రకవి 'అనంతుని' కుమారుడు, 'కేశవుని' మనుమడునై యున్నాడు. ఇట ఆరుద్ర సమగ్ర ఆంధ్ర సాహిత్య చరిత్రలోని వాక్యములు పరిశీలనార్హములు: 'కృష్ణదేవరాయలవారి కాలంలో ఉన్న రుద్రకవీ, మల్కిభరామునిచేత మాన్యాలు పొందిన కవీ, గుంటుపల్లి భాస్కరుని కాలంలోని కవీ ఒక్కర్లే అని భావించడానికి వీలులేదు. కందుకూరి వాని వంశంలో ముగ్గురో, నలుగురో రుద్రు కవులు ఉంటారు. వాళ్లలో బహుశా రెండవ రుద్రకవి నిరంకుశోపాఖ్యానం, సుగ్రీవ విజయం మొదలైన రచనలుచేసి ఉంటాడు.' (సంపుటం--8. పుట—185.)

మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి సంస్కృత కవి జీవితములలో (పుట—526) రుద్రకవి—1 ని గూర్చి ఇట్లున్నది.

'ఇతని తండ్రి అనంతభట్టు. తాత కేశవభట్టు. దక్షిణదేశీయుడైన ఈ కవి యుత్తరదేశ యాత్ర గావించి నారాయణ షా మయూరగిరి నేలుచున్న కాలమున నతని సత్కారమంది యాతని యాస్థానమున విద్వత్కవియై యందు స్థిరపడి, ఆ ప్రభువు కుమారుడైన ప్రతాప షా కాలమున నతని సభ నలంకరించి వన్నెకెక్కిన వాడు. మొదటి కాన్యకుబ్జరాజైన రాష్ట్రౌఢ రాజులతో నారంభించి రాష్ట్రౌఢవంశరాజుల చరితము నిరువది సర్గముల కావ్యముగా నిర్మించెను. ఈ కావ్యము శా. 1518 లో సమాప్తిగాంచిన దగుట నితడు శా. 1480–153 ) నడుమనున్న వాడనుట నిర్వివాదాంశము.

ఈ కృతిలో కాన్యకుబ్జరాజులు శివునివల్ల వరము లొందినవారని వర్ణించియున్నాడు. ఇందు

రాష్ట్రీయ రాజ్యము, ఆ రాజవంశము ప్రధానముగా వర్ణింపబడినవి. కవిత్వము సరసముగనే యుండును.'

ఇతడు కందుకూరి రుద్రకవులలో నొకడయి యుండనోపు ననుటకు 'స్కంధపురాన్వయేన' అనునది ప్రబల నిదర్శనము. నిరంకుశోపాఖ్యానాది గ్రంథములు రచించిన గ్రంథకర్త తండ్రి పెదలింగన యగుటచే నితడు మరియొక రుద్రకవి గానోపును. ఆ వంశమున చాలామంది రుద్రకవులున్నారు. ఇప్పటికిని తద్వంశీయులు ప్రకాశం జిల్లా చింతలపాలెమున నున్నారు.

పి. హెచ్. డి. పట్టమునకై వేంకటేశ్వర విశ్వవిద్యాలయములో 'కందుకూరి రుద్రకవి రచనలు—సవిమర్శక పరిశీలన' అను అంశముపై డా. జె. సూర్య నారాయణగారి పర్యవేక్షణలో పరిశోధన గావించుచున్న నాకు ఈ కావ్యరచనా విషయకమైన సందేహములను తీర్చవలసినదిగా పండితులను ప్రార్థించుచున్నాను.

—శ్రీ ఆర్. అనంతపద్మనాభరావు.

## 'అనంతుని ఛందము'—
## ఒక అనన్వితపద్యము

'అనంతుని ఛందము' తెలుగు ఛందో గ్రంథములలో సుప్రసిద్ధము. ప్రాచ్యకళాశాలా విద్యార్థులకు పాఠ్యగ్రంథము. దీనిని 1958 నాటికి 'వావిళ్ల' వారు మున్మూరు ముద్రించిరి. మూడవ ముద్రణమున కీ గ్రంథమును పరిష్కరించి సిద్ధపఱిచినవారు సుప్రసిద్ధులు శ్రీ రావూరి దొరసామి శర్మగారు. ఆ ముద్రణమును సమీక్షించినవారును శ్రీ శర్మగారే. 'సమీక్ష' చివఱ వెల్లడించిన 'కృతజ్ఞత'లో 'ఈ ఛందము తృతీయ ముద్రణార్థ మిటీవల 'బరిష్కరించి యుంటినిగాన......' అని శ్రీ శర్మగారే స్వయముగా చెప్పికొనిరి.

సమర్థులగు శ్రీ దొరసామిశర్మగారు పరిష్కరించిన ఈ గ్రంథమందలి ఒక పద్యము పరిశీలనార్హమై కన్పట్టుచున్నది. వారి దృష్టి ఈ పద్యముపై ప్రసరించినట్లు కానరాకున్నది. ద్వితీయ ముద్రణ (1947) మందీ పద్య మెట్లు ముద్రితమఱియుండినదో తృతీయ ముద్రణమందును—ఎట్టి మార్పు లేకుండ—అట్లే అచ్చుపడినది. కావున శ్రీ శర్మగా రీ పద్యమును గమనించలేదని నిశ్శంకముగ చెప్పనచ్చును. వారు కాక 'కళాప్రపూర్ణ' శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్య ప్రభృతు లీ గ్రంథమందలి విషయములను విమర్శించియున్నారు. కాని వారెవ్వరును ఈ పద్యమును పరామర్శించినట్లుగాని, తడవినట్లుగాని—నా యెఱిగినందాక—యెందును కానరాదు. ఫలితము : పద్య మనన్వితముగా తయారైనది. ఆ లోపము పై పండితుల పరిశీలనాభావ జనితమని తలంపవలెనుగాని అంతమాత్రముననే వారికి అజ్ఞత నాపాదింపరాదు కదా!

ఆ పద్య మిది :

'మొగిళులు నలమగు, నిటులన్
నగణము, సగణమగు నిటు లనంగుని తండ్రీ!
తగణము; పాళులనంగా
భగణము వాకిళ్లు, భలము వాకిళు లనఁగన్.'

(అనంతుని ఛందము, 1. ఆ—22 ప; పుట—6.)

స్థూలదృష్టి కీ పద్యమం దేలోపము కానరాదు. కాని లక్ష్యలక్షణ సమన్వయము కుదురుపడదని మాత్రము చెప్పనక్కఱ గలు దనుకొందును. ఈ కందము పూర్వార్థ మిట్లుండవలెను.

'మొగిళులు నలమగు, నిటులన్
సగణము, నగణమగు నిటు, లనంగుని తండ్రీ!'

ఇట ప్రకరణమునుబట్టి 'అనంగుని తండ్రీ!, మొగిళులు—నలము, ఇటులన్—సగణము, ఇటులు—నగణము' అని కదా అనంతుఁడు చెప్పఁదలఁచినదియు, చెప్పవలసినదియును. కావున కందము పూర్వార్థము పైన చూపిన విధముగ నుండుననుటకు సందేహింపనక్కఱలేదు.

మఱి పద్యమందలి రెండవ పాదము 'నగణము సగణమగు నిటు లనంగుని తండ్రీ!' యని ముద్రితమగుటకు కారణమేమైయుండును? ఆలోచింపఁగా గ్రంథము అచ్చుపడునప్పుడు ఎఱుకచాలని— చిత్తులు దిద్దిన మహానుభావు లెవరో చేసిన 'చేమార్పు' కావచ్చు నిది అని తోఁచుచున్నది.. మునువెనుకలు చూచుకొనకుండ 'స—న'లకు యతి చెల్లదు కనుక

పాదాదిని నగణమును నిల్పి దాని స్థానమునకు సగణమును నెట్టియుందురు, ఆ చిత్తులు దిద్దినవారు, ఈ సర్దుబాటుతో యతిని సురక్షితము కావించితిమని ఏదో ఘనకార్యము చేసినట్లు వారు బుజము లెగుర వైచికొనియుందురు. ఆ అల్పసంతోషులకు లక్ష్య లక్షణ సమన్వయముచేసి చూచికొను ఓరిమిగాని, నేరిమిగాని ఎక్కడిది? ఇంతకును ద్వితీయ చరణమున తొలుత 'సగణము' అని పాఠమున్నను యతి చెల్లుబడి కాఁగలదనియు, పై సర్దుబాటు యతిని రక్షించునదైనను ప్రకరణసామంజస్యములేని అవివేకపు చర్య యనియు సహృదయులు గమనింపకపోరు. ఇఁక కందము ఉత్తరార్ధము గ్రంథమున నిట్లు ముద్రితము.

'తగణము; పాళులనంగా
భగణము, వాకిళ్లు భలము వాకిళు లనఁగన్'

ఈ పాదములందు ఛందోభంగమేమియు కన్పట్టదు. లక్ష్య లక్షణ సమన్వయము మాత్రము కుదరదు. నాల్గవ పాదమందలి అక్షరములు రెక్కలు కట్టుకొని పైకి ఎగిరినవి. మూఁడవ పాదమందలి అక్షరములు క్రిందికి వ్రాలినవి. అందులకు కారణములను ఇట్లు ఊహింపవచ్చును. ముద్రాశాలయందలి 'కంపోజిటరు' అక్షరములను అజాగ్రత్తగా కూర్చుట ఒకటి. పుటలు కట్టుకొని ప్రొలుమాలిక వలన సంభవించిన అక్షరముల జారుపాటు రెండవది. పుటలు కట్టునపుడు అక్షరములు జారిపోవుటయు, వానిని వారు ఆత్రముతో అందందు అరగొరగా దూర్చుటయు అచ్చుపనులతో అంతయో ఇంతయో పరిచయమున్న పండితులకు అనుభవసిద్ధమైన విషయమే.

ప్రకృతము—కందము ఉత్తరార్ధమునందు చిన్ని సవరణము చేసికొనిన లక్ష్య లక్షణ సమన్వయమునకు తంటా ఉండదు. పరికింపుఁడు:

'తగణము వాకిళ్లనఁగా
భగణము పాళులనభలము వాకిళులనఁగన్'

ఇప్పుడు 'వాకిళ్లు—తగణము, పాళులు—భగణము, వాకిళులు—భలము' అను సరసమగు అన్వయమేర్పడును. పైన నా సూచించిన సవరణములతో పద్యము క్రింద చూపిన విధముగ నుండును. ముద్రిత పద్యమందలి పాఠకాలుష్యములు తొలఁగిపోవును.

'మొగిళులు నలమగు, నిటుల
స్సగణము, నగణమగు నిటులనంగుని తండ్రీ!
తగణము వాకిళ్లనఁగా
భగణము పాళులన, భలము వాకిళులనఁగన్'

ఈ పద్యము గ్రంథమున—తొలుత చూపినట్లు అనన్వితముగ ముద్రితమగుటకు అచ్చుకూటమునందలి 'కంపోజిటర్లు' చిత్తులు దిద్దినవారు బాధ్యులనుట సమంజసము కావచ్చును. ముమ్మాటికి సత్యమును కావచ్చును. కాని గ్రంథమును పరిష్కరించి ముద్రణకు సిద్ధపఱిచిన శ్రీ దొరసామి శర్మగారును ఇందులకు కొంతవఱకు బాధ్యత వహింపక తప్పదు. ఇట్లు వ్రాసినందులకు శ్రీ శర్మగారు మన్నింతురని నా నమ్మిక.

ఇందలి ఔచిత్యాగామములను పండితులు పరిశీలించి, నా సూచించిన సవరణలకంటె సముచితములైన సవరణలను సూచించినచో వారికి 'ధన్యోస్మి' చెప్పుకొనఁగలను.

శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి.

---



# లేఖలు

## 'మాట' సంగతి

'74 జూలై భారతిలో 'అనేకార్థ ద్యోతకం—మాట' అనే వ్యాసంలో (కలగూరగంప) శ్రీ బండి గోపాలరెడ్డిగారు (బంగోరె) 'మాట'కు 'అర్థాలు ప్రయోగాలు మచ్చుకు కొన్ని' అంటూ బ్రౌను ఇచ్చిన అర్థచ్ఛాయ లన్నిటిని — 28 టిని ఇచ్చారు. కాని బ్రౌన్ ఇచ్చిన వాటిలో 'చిన్నమాట' లేదు. ఈ 'చిన్నమాట'ను రహస్యార్థంలో (To be kept confidential) వాడుతుంటారు. 'ఎవరూ లేని చోట; ఇదుగో చిన్నమాట' అంటూ ఆరుద్ర ఈ 'చిన్నమాట'తో ఒక చిన్నపాట కూడ రాశాడు.

ఇంకొక ముఖ్యమైన విశేషం ఏమిటంటే— 'వాడి మాట వాడి వ్రేళ్లో వేశాను.' అనేది జాతీయం—Idiom. దీనికి 'I acted as he desired' అని బ్రౌన్ ఇచ్చిన అర్థం సరికాదు. దానికి సరియైన అర్థం 'I have paid him in he same coin' అని. ఎవ డైనా అసంగతమైన ఒక మాట మాట్లాడినా, లేక అటువంటి పనిని చేసినా ఇంకొకడు అటువంటిదే వేరొక అసంగత ప్రసంగంగాని విరుద్ధమైన పనినిగాని చేసి, ఎవరైనా 'ఏమి, ఇట్లా చేశావు? అని ప్రశ్నించి నపుడు 'తప్పేముంది? వాడి మాట వాడి వ్రేళ్లోనే వేసివచ్చా' అంటూ ఉంటారు. బ్రౌన్ పొరపాటున ఆ అర్థం ఇచ్చిఉండవచ్చు. అర్థవిపరిణామం జరిగి ఉండవచ్చుననుకోవడానికి కూడ ఆస్కారంలేదు. జాతీయాలలో అర్థవిపరిణామం ప్రాయికంగా జరుగదు. క్వాచిత్కంగానైనా జరుగుతుందనుకోవడానికి ఒకటి రెండు నిదర్శనాలైనా మృగ్యం.

'మాటవాసి'కి Influence అనే అర్థం మాత్రమేకాక 'కేవలం మాట మాత్రం' Merely Putting a word without any apology and appeasement అనే అర్థం కూడ ఉంది.

—శ్రీ పాకాల వెంకటకృష్ణయ్య.

## సమ్యక్‌దృష్టి విమర్శక ధర్మం

అయ్యా,

జూలై నెలలో నేను వ్రాసిన 'వేమన్న రభస' అన్న చిన్న వ్యాసాన్ని పురస్కరించుకొని శ్రీ సర్దేశాయ్ తిరుమలరావుగారు 'అలగ్జాండర్ పోప్—వేమన' అన్న శీర్షిక క్రింద సెప్టెంబరులో రభస చేశారు. అవిచార మూలకమైన వారి వ్రాత సద్విమర్శ అయితే, నాది విమర్శాభాస' మని అంగీకరించడానికి నాకు ఆవంతైనా అభ్యంతరంలేదు. రసజ్ఞులైన పాఠకులు ఈ క్రింది విషయాలను గుర్తించగలరు.

(1) శ్రీ తిరుమలరావుగారు నేను పోపుకవి నుద్దేశించి చెప్పిన కవితా లక్షణాలనుగాని, విమర్శకాభిప్రాయాలను కాని కాదనలేదు. పోపు అనువాద కావ్య ప్రశంసనా వ్యాసానికి అప్రస్తుతం కనుక విడచిపెట్టాను. నేను యెక్కడ పోలికలు చెప్పానో దాన్ని విడచిపెట్టి, ఇతరత్ర తౌల్యములేదని చెప్పడం సద్విమర్శ అవుతుందా? ఒక శైలిలోనేగాక భావం ప్రపంచించడం లోను, తాత్త్విక చింతనలోను సాదృశ్యమేకాక, తాదాత్మ్యాన్నే కొన్నియెడల నిరూపించిన సి.పి. బ్రౌన్ దొరగారుకూడా 'సరభసం'గా వ్రాశారంటారా వీరు?

(2) అభిమానాలు దురభిమానాలుగ మార కూడదని, సాహిత్యవిమర్శ తదుచితమైన పరిధిలో మాత్రమే జరగాలని చెప్పడమే నా వ్యాసంయొక్క ముఖ్యోద్దేశ్యం. ఇందులో ఏ ఒక్క కవిని న్యూనత పరచే ప్రసక్తే లేదు. నా వ్యాసం సావధానంగా చదివిన ఏ ఒక్కరికీ శ్రీ తిరుమలరావుగారికి కలిగిన అపోహ కలిగే అవకాశంలేదు.

(3) కేవలం రీతి కవులను మహాకవులుగ గుర్తించే సౌజన్యం అందరికీ ఉండదు. నేను పేర్కొన్న కవితా లక్షణాలు, శాస్త్ర పరిభాషలో మహాకవి లక్షణాలే అయితే, నాటికి నేటికీ భారతీయ కవితా సంప్రదాయాభిజ్ఞులు వ్యాసాదులైన ఇద్దరు ముగ్గురు కవు

లనే మహాకవులుగా గుర్తించడం ఎందుకు జరుగు తోంది? మనం ఈనాడు వాడుతున్న మహాకవి శబ్దం కేవలం అభిమాన సూచకమేకాని, ఆలంకారిక సమ్మతం కాదని మనవి.

(4) నేను వ్రాసిన వ్రాతలో స్వవచన వ్యాఘాతం లేదని పై వివరణవల్ల స్పష్టమే. ఇక వారి విమర్శలోని ఈ వాక్యాలు గమనించండి.

'మనకు ఒక మహాకవి ఎప్పుడునూ మహాకవియే..' తరువాత పేరాలో 'రామరాజ భూషణుడు...ఆ నాడు మహాకవులని ప్రశస్తి చెందిన మారన, పినవీరనలు నేడు మరుగుపబడినారు.'

దీనిపై వ్యాఖ్య అనవసరం.

(5) ఇక జాన్ డోనేను (Donne) గురించి వారు వ్రాసినది ఆశ్చర్యజనకంగా ఉంది. నాకు తెలిసి నంతమటుకు 'ఈ కవిత్వోద్ధరణ 'కేవలం, శైలికి' 'మేజరీ'కి కవితా తత్త్వానికి సంబంధించినదే కాని 'ఆధ్యాత్మిక శూన్యత'ను నింపడానికికాదు. (Metaphygical అన్నమాట భ్రమపెట్టలేదుకదా!) ఇంతకూ ఈ 'రివైవల్' వారూహించినట్లు యుద్ధా నంతర పరిణామం కాదు. ఈ ఉద్యమం పందొమ్మిదవ శతాబ్దిలోనే ప్రారంభమైంది. దానికి అనన్య ప్రచా రాన్ని కూర్చాడు ఇలియట్.

శ్రీ తిరుమల రావుగారి వ్యాసం చదివాక నేను నా వ్యాసంలో పేర్కొన్న సమ్యగ్ దృష్టి—ఇది ప్రమాద భరితం అంటున్నారు వారు---విమర్శకునకు ఎంత అవసరమో పాఠకులు ప్రత్యక్షంగా గ్రహించ గలరు.

— శ్రీ గంటి శ్రీరామమూర్తి.

## 'కుల బ్రాహ్మణుడు— కులభూపతి'

శ్రీ షడ్దర్శనం—సోమసుందరశర్మగారు కడచిన నెల (నవంబరు—74) భారతిలో నన్నయభట్టు భార తంలో చెప్పిన 'తన కులబ్రాహ్మణు' అనే పద్యంలోని విశేషణాల సార్థక్యాన్ని చక్కగా వివరించారు.

కాని 'కులబ్రాహ్మణ' పదాన్ని ప్రయోగించిన నన్నయభట్టును అనుసరించే తిక్కన సోమయాజి 'కుల' పదాన్ని ఉపయోగిస్తూ 'కులభూపతి' శబ్దాన్ని వాడి నాడని విరాటపర్వంలోని 'విరటుడు నిన్ను నెప్పుడు' అనే పద్యాన్ని ఉదాహరించారు. ఆ పద్యంలోని రెండవ పాదంలో వారు చెప్పినట్లు 'కులభూపతి' శబ్దం లేదు. 'కులభూతి విశేష విధాయకుండు' అని మాత్రమే ఉన్నది. 'భూపతి' అని చెప్తే ఛందోభంగం కలుగు తుంది. 'కులభూతి విశేష విధాయకుండు' అంటే ఆ రాజవంశానికి ఎక్కువ ఐశ్వర్యాన్ని కూర్చేవాడని అర్థం గ్రహించవలసి ఉంటుంది.

'కులబ్రాహ్మణ' శబ్దాన్ననుసరించి 'కుల భూపతి' వాడబడినదని అనుకోవడం ఉచితంగా కాన రాదు.

'ఆంగీరస'.



# గ్రంథవిమర్శలు

## సురభారతీ సమితి ప్రత్యేక సంచిక

(సంపాదకులు : డాక్టర్. పి. రామచంద్రుడు, శ్రీ బి. పి. శాస్త్రి గార్లు. $\frac{1}{4}$ క్రౌను సైజు. పుటలు 122 వెల తెలియదు. ప్రకాశకులు—సురభారతీ సమితి, హైదరాబాదు.)

భారతదేశంలోని భాషల్లో ప్రధానమైనదీ, అతిప్రాచీనమైనదీ సంస్కృత భాష. మధురాతి మధురమైన ఆ భాషలోనే రామాయణాన్ని ఆదికవి వాల్మీకి మహర్షి తొలుత రచించాడు. పాశ్చాత్య దేశీయులైన విద్వాంసులు కూడా సంస్కృతాన్ని మిక్కిలి ప్రశంసించారు. బ్రిటిష్ ప్రభుత్వ కాలంలో దీనికి తగిన అభివృద్ధి కలగలేదు. కాని భారతదేశానికి స్వాతంత్ర్యం లభించాక ఏతదభివృద్ధి విషయమై ప్రభుత్వమూ, ఇతర సంస్థలూ ప్రయత్నాలు చేస్తూనే ఉన్నవి, ఒక్క తమిళనాడుతప్ప యితర రాష్ట్రాలేవీ సంంస్కృతాన్ని ఉపేక్షించలేదు.

గీర్వాణ వాణీ వ్యాప్తికి ఆంధ్రరాష్ట్రం బహుముఖాల ప్రయత్నిస్తున్నది. ఆంధ్ర విద్వాంసులందరూ సంస్కృతంలో మంచి ప్రవేశం కలవారై ఉన్నందున విద్వల్లోకం మూలంగా సురభారతీ ప్రచారం సాగుతున్నది. అయినా పటిష్ఠమైన సంస్థ ఏర్పడితే ప్రచారం బాగుగా సాగగలదనే ఆశయంతో హైదరాబాదులోని ప్రముఖులు 1970 సం. ఏప్రిల్‌నెలలో 'సురభారతీ సమితి'ని ప్రారంభించారు. జరుపుతున్న సమావేశాలవల్లనూ, నడుపుతున్న తరగతులవల్లనూ ఈ సంస్థ అచిరకాలంలోనే అందరి ఆమోదాన్నీ పొందగల్గింది. ప్రభుత్వం వారు, వదాన్యులు ఇస్తున్న ప్రోత్సాహంతో కడచిన మే నెలలో స్వంతభవనం నిర్మించుటకు పూనుకొన్నది. ఆ సందర్భంగా ఈ ప్రత్యేక సంచిక వెలువడింది.

ఇందులో పాతికకు పైగా శీర్షిక లున్నాయి. వ్యాసాలు ఆంగంలోనూ, సంస్కృతంలోనూ రచింపబడినవి. సంస్కృత శ్లోక వ్యాసాలు కూడా ఉన్నవి. ప్రముఖ ఆర్థిక విజ్ఞానవేత్త శ్రీ చింతామణి దేశముఖ్ రచించిన శ్లోకాలు ప్రత్యేకంగా పేర్కొనదగినవి. వ్యాసాలలో డాక్టర్ ఎస్. రమేశన్ వ్రాసిన శ్రీ శంకర భగవత్పాదులను గురించిన వ్యాసం, శ్రీ కె. వీరభద్రరావు, శ్రీ అనంతనారాయణగార్లు మాక్సుముల్లరును గురించి వ్రాసిన వ్యాసాలు, డాక్టర్ రామరాజుగారి సురపరం — అప్పయ్యాచార్యులను గురించి యిచ్చిన విషయం, డాక్టర్ రాఘవన్ వ్రాసిన మధురా విజయ కావ్య విమర్శ, డాక్టర్ పి. రామచంద్రుడు వ్రాసిన కాళిదాసుని సాంగ అనుకరణల సంగ్రహం, నాట్యశాస్త్రాన్ని గురించిన రావ్ జీ ఉపాధ్యాయగారి పరిశీలన, కె. కృష్ణమూర్తిగారి సాహిత్య సౌందర్య పరామర్శ, రాజేశ్వర శర్మగారి సంస్కృత భాషలో ఉన్న తెలుగు వ్యాకరణాల ఉదంతం, డాక్టర్ పి. ఎస్. ఆర్. అప్పారావుగారి నటులను గూర్చిన సమీక్ష, మామిడిపూడి — వేంకటరంగయ్యగారి అర్థశాస్త్ర విషయం వివరించే వ్యాసం, డాక్టర్ లావ్యేగారి పురాణ పరిశోధన, డాక్టర్ యశోదారెడ్డిగారి రాస, ఛలిక్య నాట్యవ్యాసం, డాక్టర్ వేంకటావధానిగారి సానుమతీ వ్యాసం పెక్కు విషయాలను తెలిపే ఆంగ్లవ్యాసాలు. ఎంగిడు, ఋష్యశృంగుల సామ్యాన్ని వివరించే తిరుమల రామచంద్రగారి పరిశోధనా వ్యాసం, బిల్హణ కవి విక్రమాంకదేవ చరిత్రను గురించి కప్పగంతుల—లక్ష్మణశాస్త్రిగారు వ్రాసిన వ్యాసమున్నూ సంస్కృత వ్యాసాలు. కాళిదాస నాటకాలలోని స్త్రీ పాత్రలను గురించి శ్రీమతి పుట్టగుంట—శ్రీ సతీశకవాణి వ్రాసిన వ్యాసం ఒక్కటే తెలుగులో ఉన్నది.

పయి వ్యాసాలన్నిటిలోనూ పరిశోధకులు గమనించి, గ్రహించదగిన విషయాలు చాలా ఉన్నవి. ఇవి సురభారతీ సమితియొక్క సంస్కృతభాషా సేవకు ప్రబల నిదర్శనాలు.

# గుంటూరు కాలేజీ శతావధానము

(శతావధాని: శ్రీ వేలూరి—శివరామశాస్త్రి, డెమ్మీ 52+58 పుటలు. సాహితీమేఖల ప్రచురణ వెల 3 రూ. ప్రతులకు–శ్రీ ఎ. వి. సుబ్రహ్మణ్యశాస్త్రి నెం. 6 1–89 G. రామగిరి, నల్లగొండ.)

శ్రీ శివరామశాస్త్రిగారు ఆంధ్ర విద్వల్లోకంలో అగ్రస్థానానికి చెందినవారు. ప్రతిభావంతులు. తిరుపతి వేంకట కవులకు శిష్యులయినా వారిలో సమానమైన యశస్సును సంపాదించుకున్న కవితపస్వులు. ఇరవై యేళ్ల వయస్సులోనే తిరుపతి వేంకట కవులతోపాటు శతావధానాల్లో పాల్గొని, తాము శతావధానాలు చెయ్యడమేకాక, శతావధాన సమయాల్లో గురువులకు చేదోడు వాదోడుగా ఉంటూ ఉండేవారు. గురుముఖతః వ్యాకరణాది శాస్త్రాలు అభ్యసించి, సంగీతంలోనూ కృషి చేశారు. సంస్కృతాంధ్రాలతోపాటు ఆంగ్ల, ఫ్రెంచి, బెంగాలీ వాఙ్మయాలలో అపారకృషి చేశారు. సంపన్నులు కావడంవల్ల జీవికకోసం సేవక వృత్తిని ఆశ్రయించక స్వతంత్ర జీవనం సాగించి, కాలాన్ని గ్రంథపఠనంలోనూ, శిష్యులకు విద్య బోధించడంలోనూ గడిపారు.

శివరామశాస్త్రిగారి గుంటూరు కాలేజీ శతావధానం శతావధానాలలో చాలా విశిష్టమైనది. సాధారణంగా శతావధానానికి నూరుమంది ప్రశ్నలకు కవిత్వ రూపంలో సమాధానాలు చెప్పడం, సమస్యలు పూరించడం జరుగుతుంది. కాని నూరుమంది దొరకడం దుర్లభం. పృచ్ఛకుల సంఖ్య నూటికి చాలా తక్కువగా ఉన్నాకూడా శతావధానంలోనికే లెక్కకు వస్తుంది. శివరామశాస్త్రిగారి శతావధానం అటువంటిది కాదు. ఇందులో నూరు ప్రశ్నలకూ సమాధానా లున్నవి. అందువల్ల ఇది సంపూర్ణ శతావధానం. శ్రీ శాస్త్రిగారు దీనిని ఇరవైయేళ్ల పిన్నవయస్సులోనే పెద్దవిద్వాంసుల యొక్కయూ, భాషాభిమానులైన విద్యాధికుల యొక్కయూ సమక్షంలో ఎంతో సమర్థనీయంగా నిర్వహించారు. దీనిని మొదట్లో కాకినాడ లోని 'సరస్వతీ' పత్రిక 1911 సం.లో ప్రకటించింది. కాని, దాని ప్రతులు చాలాకాలంనుంచీ అలభ్యంగానే ఉన్నవి. శ్రీ శివరామశాస్త్రిగారి శిష్యులు అంబటిపూడి వెంకటరత్నంగారు దానిని తిరిగీ ప్రకటించడానికి పూనుకున్నారు. శ్రీ నిడుదవోలు వేంకటరావుగారివద్ద దాని ముద్రితప్రతి ఉన్నదని తెలిసి వారిని ప్రార్థింపగా, ఆయన దానికి కాపీ వ్రాయించి యిచ్చి దీని ప్రకటనకు ముఖ్యకారకు లయారు.

ఇందులో శ్రీ శివరామశాస్త్రిగారి గుంటూరు కాలేజీ శతావధానం సమగ్రంగా ఉన్నది. అవధానం యొక్క నూరు పద్యాలేకాక వివిధ ఛందస్సులకు చెందిన సంస్కృత శ్లోకాలు కూడా ఉన్నవి. అవధాన ప్రారంభంలో శాస్త్రిగారి గురువులు శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారూ, శివరామశాస్త్రిగారూ సభాసదులను గురించి చెప్పిన మనవి పద్యాలున్నవి. గ్రంథం చివర సభాసదులు తిరుపతి వేంకట కవులు, శిష్యులు— హనుమచ్ఛాస్త్రిగారు, [illegible] — కృష్ణమాచార్యులుగారు, జూపూడి—హనుమచ్ఛాస్త్రిగారు, పంచాగ్నుల —మార్కండేయ శాస్త్రిగారు, బలిజేపల్లి—లక్ష్మీకాంత కవిగారు, వి. కృష్ణమాచార్యులుగారు, ములుకుట్ల—లక్ష్మీనారాయణశాస్త్రిగారు, గుంటుపల్లి—సుబ్రహ్మణ్యముగారు, చిటాప్రగడ—సీతారామాంజనేయులుగారు, గరికిపాటి—సీతారామయ్యగారు, ఉప్పలవరపు-కృష్ణమూర్తిశాస్త్రిగారు, గొట్టిపాటి—వెంకటరత్నముగారు, కంజంపాటి—విశ్వనాథముగారు, వడియాల—వెంకటకృష్ణుడుగారు, వేలూరి—వెంకటసుబ్రహ్మణ్యముగారు చెప్పిన ప్రశంసాపద్యము లున్నవి. అనుబంధంలో శాస్త్రిగారి యితర శతావధానాలలోని కొన్ని పద్యాలు ఈయబడినవి.

ధారణాశక్తి, ప్రదర్శన ప్రధానంగా గల శతావధానాలలో చెప్పే పద్యాలు కొంత పేలవంగా ఉండడం

సహజం. కాని శివరామశాస్త్రిగారి పద్యాలు పేలవంగా కాక రసవంతంగా, ఇంపుగా సాగుతూ ఉంటాయి.

ఉదాహరణకు — 34 వ పద్యం. శార్దూల విక్రీడిత వృత్తంలో వసంతవర్ణన — (దుష్కరమైన 'ర్ష'ప్రాసలో).

'హర్షావాప్తికి మూలమై గుమురులై
యామ్రాదివృక్షంబు లు
త్కర్షంబుల బొనరింపఁగా శుకపిక
ధ్వానమ్ము లేపార, దు
ర్ధర్షంబై మలయానిలం బెగయఁ గం
దర్పుండు సూనావళీ
వర్షంబుం గురియింప నామని కడున్
భాసిల్లె మొల్లంబుగన్.'

ప్రాసం దుష్కరమైనా ఈ పద్యం సుకరంగా ఉండి, వసంతర్తువును చక్కగా వర్ణిస్తున్నది.

అచ్చతెలుగులోనూ, శ్లేషలోనూ కూడా చాలా పద్యాలు చెప్పబడినవి. ఇవి అవధానం చేసేవారి ప్రతిభను వెల్లడిస్తున్నవి.

తమ పదహారోయేట జరిగిన సంఘటనలను గూర్చి శ్రీ శివరామశాస్త్రిగారు జ్ఞప్తికి తెచ్చిన కొన్ని జ్ఞాపకాలు, గుంటూరు కాలేజీ శతావధానమును గురించి కాలేజీ విద్యార్థులు ఉపోద్ఘాతంగా తెలిపిన విషయాలు, కాలేజీ ప్రిన్సిపలు య్యూల్ దొరగారూ, వైస్ ప్రిన్సిపలు రాయ్ స్ట్రాక్ దొరగారూ ఆంగ్లంలో ఇచ్చిన ప్రశంసాపత్రాలు, డాక్టర్ వేంకటావధానిగారు 1964 లో అవధానాలను గురించి వ్రాసిన వ్యాసం ఈ పుస్తకానికి శోభను కలిగిస్తున్నవి.

శాస్త్రిగారు మరణించిన తర్వాత వారి శిష్యులు శ్రీ వెంకటరత్నంగారు సమర్పించిన భక్త్యంజలి జలస్తోత్రం రుక్మిణీనాథశాస్త్రిగారు, ఎన్. ఆర్. కే. శర్మగారు దివాకర్ల—వేంకటావధానిగారు, కొండూరు—వీరరాఘవాచార్యులుగారు ఆంధ్రప్రభలో ప్రకటించిన వ్యాసాలు ఇందులో చేర్చబడినవి. అవి శ్రీ శాస్త్రిగారి జీవితవిషయాలను, ప్రతిభావిశేషాలను తెలిసికొనుటకు మిక్కిలిగా ఉపయోగిస్తున్నవి.

శ్రీ శివరామశాస్త్రిగారి గుంటూరుకాలేజీ శతావధానంతోపాటు ఆయనను గురించిన పెక్కువిషయాలతో ఎంతో ముచ్చటగా ఈ గ్రంథాన్ని అచ్చు వేయించి, ఆంధ్రుల కందించిన 'సాహిత్యమేఖల' నిర్వాహకులను అందరూ అభినందించవలసి యున్నది.

## తెలుగు నాడు

(గ్రంథకర్త: మహాకవి-శ్రీ దాసు శ్రీరాములు, క్రౌను 23+48 పేజీలు. వెల 2 రూ. ప్రచురణ, ప్రాప్తిస్థానం—మహాకవి దాసు శ్రీరాములు స్మారక సమితి, 1–10–97. అశోకనగర్, హైదరాబాదు—20.)

శ్రీనాథకవి సార్వభౌముని కాలంలో దేశకాల పరిస్థితులతోపాటు, ఆ నాటి తెలుగువారి జాతి మతాదులనూ, ఆచార వ్యవహారాలనూ తెలుసుకొనుటకు ఆయన చాటుపద్యాలూ, ఆయన రచించిన క్రీడాభిరామం ఎంతో ఉపకరించాయి. ఆ పద్ధతిలోనే 'తెలుగునాడు' నామంతో వివిధ మతాచారాలనూ, శాఖలనూ; వారి వారి వేషభాషలనూ, స్వభావాలనూ వర్ణించే గ్రంథాన్ని రచించడానికి గతశతాబ్దిచివర శ్రీ దాసు శ్రీరాములు ప్రారంభించారు. కాని, అందులో ఒక్క భాగాన్ని మాత్రమే వ్రాసి దివంగతులైనారు. ఈ నడుమ హైదరాబాదులో ఏర్పడిన 'మహాకవి దాసు శ్రీరాములు స్మారక సమితి'వారు ఆ విద్వత్కవివతంసుని రచనల నన్నింటినీ ప్రకటింప నిర్ణయించి, యిదివరకే అయిదు కూర్పులనుపొంది, ప్రజాశ్యోదాన్ని చూరగొన్న ఈ గ్రంథాన్ని ఆంధ్రసీకానికి అందిస్తున్నారు.

దాసు శ్రీరాములుగారు గత శతాబ్ది ఉత్తరార్ధంలో సుప్రసిద్ధులైన విద్వత్కవులు. బహుభాషావేత్తలు, బహుముఖ ప్రజ్ఞాధురీణులు. మహాకవి బిరుదాంచితులు. ఆంధ్ర వాఙ్మయంలోని వివిధ ప్రక్రియల్లో ఆయన రచనలను సాగించారు. వీరు దేవీభాగవతాన్ని ఆంధ్రీకరించారు. శతకాలను స్వంతంగా రచించడమేకాక మయూర మహాకవి సంస్కృతంలో రచించిన సూర్యశతకాన్ని ఆంధ్రీకరించారు. సంస్కృత నాటకాలను అనువదించడమేకాక స్వతంత్రంగా కూడా దృశ్యరచన సాగించారు. వీరి దేవీభాగవతం వీరి కీర్తిని విస్తరింపజేసిన ఉత్తమ రచన.

'తెలుగునాడు' రచనలలో చిన్నదయినా పండిత, పామరజనాకర్షకమైన ఖండకృతి. ఈ మహాకవి దీనిని

ఎన్ని భాగాలుగా రచింపదలచారో కాని ఈ తొలి భాగం తెలుగుదేశంలోని బ్రహ్మణులనుగురించి తెల్పుతున్నది. ఇందులో వైదికులు, నియోగులు, వైష్ణవులు, శైవులు, కరణకమ్మలు, యాజ్ఞవల్క్యులు, గోలకొండవ్యాపారులు, ద్రావిడులు అనే శీర్షికలలో ఆయా శాఖలవారి స్వరూపస్వభావాదులు వర్ణించబడినవి. కవిగారు తెల్పిన వైదిక లౌకిక విభాగం సాధారణమైనది. అలాగే శైవ, వైష్ణవభేదమున్నూ. ఈవిధంగా వివిధశాఖలవారి వర్ణనలతోపాటు సాధారణంగా అన్నాకోడండ్ల స్వభావాలూ, వివాహాలు, సంక్రాంతి అట్లతద్దె దీపావళి వినాయక చవితి సంవత్సరాది మొదలగు పండుగలనుగురించీ, తదితరవిషయాలనుగురించీ కూడా వర్ణన లున్నాయి.

వర్ణన లన్నీ ఆ కాలపు విప్రుల స్వభావాదులను కన్నులకు కట్టేటట్లు చేస్తున్నవి. ఇప్పటివారిలో చాలా మందికి ఇవి వింతగా తోచవచ్చు. కొన్ని వర్ణనలు అధిక్షేపణలుగా కనబడవచ్చు. ఉన్న విషయాలను వర్ణించడమే తప్ప ఎవ్వరినీ అధిక్షేపించే ఉద్దేశం శ్రీరాములుగారికి ఉన్నట్లు తోచదు.

రచన రసవంతంగా సాగింది. వర్ణనలు స్వాభావికంగా ఉన్నవి. మచ్చున కొక పద్యం—

'మీగాళ్ల దాటని మొకటు గావంచాల
సంది యుండని గోచి నంట దోపి,
పిల్లగాలికిఁ దూగి యల్లాడు చిన్ని నే
వెడు గాయవలె జుట్టు ముడియవైచి,
నడునెత్తి పెడచెంప వెడనెడఁ గాన్పింప
డల నొక్క యంగవస్త్రంబుఁ జుట్టి,
గీరు గంధపురేఖ దీర్ఘమైన నొసటిపై
పసపక్షతలచుక్క యెసఁగ నునిచి

వెదవి చూచుచుఁ బెఱవారి కొడిగికొనుచు
జందెపోగులు చిక్కువోఁ జమిరికొనుచు
నోట నొక బుక్కు ముమ్మాఱు నొక్కి యనుచు
శ్రోత్రియక్షితి దేవతాసుతుఁడు వెడలు.'

[పుట 7.]

దీనికి గ్రంథకర్త కూర్చిన ఆంధ్రాంగ్ల పీఠికలు, తిరుపతి వేంకటకవులలోని శ్రీ చెళ్లపిళ్ల—వేంకటశాస్త్రిగారి పీఠిక చేర్చబడినవి. కళాప్రపూర్ణ నిడుదవోలు వేంకటరావుగారు వ్రాసిన 'కవి పరిచయము'లో శ్రీరామ పండితులను గూర్చిన పెక్కు విషయాలు ఈయబడినవి. అవి సాహిత్యాభిమానులకు ఎంతో ముఖ్యమైనవి. డాక్టర్ దివాకర్ల—వేంకటావధానిగారు 'తొలి పలుకు'లో ఏతద్గ్రంథ ప్రాశస్త్యాన్ని ఉగ్గడించారు. డెబ్బయి దశాబ్దులనాటి ఆంధ్ర బ్రాహ్మణుల సంప్రదాయాలనూ, ఆచార వ్యవహారాలనూ తెలుసుకొనుటకు ఈ చిన్న పద్యకృతి ఎంతో ఉపయోగిస్తుంది.

—శ్రీ బులుసు వేంకటరమణయ్య.

## తెలంగాణా పోరాట గేయాలు

(వివిధ కవుల గేయ సంకలనం, డెమ్మి—132 పేజీలు. వెల రు. 3/—ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్; ఏలూరు రోడ్డు; విజయవాడ—2.)

తెలంగాణా విముక్తి సమరంలో కవులు; ఆవేశంలో కవులైన అజ్ఞాత కర్షకులు వ్రాసిన ఉత్తేజకర వీరగేయ సంపుటి ఇది. నవయుగ, ప్రజాశక్తి, విశాలాంధ్రలో ప్రచురింపబడినవాటిలోని ఏర్పులు కొన్ని యిందున్నది. అకళంక మహానాయకుడు—రావి నారాయణరెడ్డి స్వానుభవంతో వ్రాసిన 'వీరతెలంగాణా' చదివినవారిలో ఉత్సాహాన్ని రేగగొట్టుచుండగా, ఈ గీతాలు కార్యదీక్షను పురికొల్పుతున్నవి. రావివారి పుస్తకం తెలంగాణా మహాసమరానికి సాహిత్యం, ఇది సంగీతము? తెలంగాణా పోరాటం 1857 విప్లవ యుద్ధము వంటిది.

రజాకార్లను ఎదిరించి, నైజాం దుష్టపాలనా కరాళ దంష్ట్రలనుండి ప్రజలను కాపాడినంత వరకు యీ ఉద్యమంపట్ల ఎవరికీ భేదాభిప్రాయం ఉండదు. ఆ తర్వాత ఆ పార్టీలోనే చీలికలు ఏర్పడినప్పుడు, దాని మూలంగా సాగించబడిన నిర్దాక్షిణ్య నిర్వాణ సమరం విషయంలో చాలమంది ఏవగించుకొన్నారనుట—నిజమైన చరిత్రాంశం. రజాకార్లు పగలు దోపిడిచేస్తే కమ్యూనిస్టులు రాత్రిళ్ళ కొల్లగొట్టి నిరపరాధుల రక్తం పారించినారని గదా కొందరనే మాట. ఇంతమాత్రాన, యిందు ఆత్మార్పణం చేసిన వీరుల కీర్తికి మైలగాని, యీ వీరరస కవితకు న్యూనతగాని ఆపాదించవు.

తిరునగిరి రామాంజనేయులు ఆ స్వాతంత్ర్య సమరమునుగూర్చి, పాలకుల తుపాకి గుండ్లకు ఎర

అయి, వీరస్వర్గం అలంకరించిన దేశభక్తులను గురించి మున్నుడిగా వివరించినారు. ఆంధ్రుల సాహసోపేత గాథలగానం చేసిన బైరగీతాలు ఎన్నో ఉన్నవి. స్వాతంత్ర్యకాంక్ష కవితావేశాన్ని కలిగిస్తుంది. 1920 మొదలు తెలుగునాట వెలసిన దేశభక్తి గీతాలు యీ వాఙ్మయ రస గుళికలు. అది విని పొంగని ఆంధ్రు డుండడు. అట్టి జాతీయ ప్రబోధ గీతాలే ఇవి. ఇందు గ్రామీణుల భాషే వాటికి చైతన్యంగా, ఆవేశం క్రియా శక్తిగా ఉన్నవి. తెనుగు నుడికారం కంద చేస కలిగియున్నది. పుస్తకమంతా తెనుగుదనాన్ని వెదజల్లే భాషావౌక్తికాలు నెరపబడియున్నవి. ప్రజా కవితగా పైకుబికి సెలయేరుగా పారినది.

గొట్టెముక్కల గోపాలరెడ్డి రణమరణం— కోటప్పకొండ చిన్నపరెడ్డి, దాసేపల్లి గుర్రాల గురివి రెడ్డి, ఉయ్యాలవాడ నారసింహారెడ్డి (1857 కు ముందు తిరుగుబాటు చేసినవారు) గీతాలను గమ నానికి తెస్తున్నది. మగగడ్డ అయిన నల్లగొండ నడి బొడ్డున సాగిన పోరాటం ఎందరినో ఆత్మబలిదాత లను, వీరాభిమన్యులను రూపొందించినది; వారిని వర్ణిం చిన గేయాలు ఉత్తేజకరాలు. 'మా కొద్దీ తెల్లదొర తనము' అన్న గరిమెళ్ల సత్యనారాయణ జాతీయగీతం పోలికలున్న గీతాలు కొన్ని యిందు గలవు. కాళోజీ నారాయణరావు 'ఇంకెన్నాళ్లు' అన్న సుప్రసిద్ధ గేయం గూడ ఇందు చేర్చబడిఉన్నది. నైజాము సైతాను చేష్టలను ఎన్నటికి మనసులనుండి చెరిగిపోనట్లు వర్ణించిన పట్టులు గీతాలలో చాలా ఉన్నవి. అప్పటి— ఇప్పటి, కాంగ్రెసు రాజ్యాన్ని గూడ విమర్శన పాట లున్నవి. ఎన్నటికీ ప్రజా వాఙ్మయపు పొరటలనుండి మాసిపోని గేయా లివి.

## రేపటి వసంతము

(గద్య కవితా సంపుటి కర్త—ఎల్లోరా, డెమ్మి 128 పేజీలు; వెల రు 5/. శ్రీనివాస పబ్లికేషన్సు 63. వెంకటరంగం పిళ్లైవీధి, మదరాసు 600005.)

వాక్యాలను విరిచి పద్యాకృతితో ముచ్చటగా అచ్చువేయబడి ఉన్నది. కవి పండితుడు. ఈయన సంస్కృతబాణి గంభీరంగా నూతన పదబంధాలతో ఉన్నది. కాని శీర్షికలన్నిటిలో ఒకే కవి వ్రాసినట్లు భావైక్యత లేక, కొంత—కొన్నిట వైరుధ్యమున్నది. 'ఛందస్సు వ్యాకరణము సూత్రాలు కవిత్వంకాదని, భావఛందములోనే ఉత్తమ కవితాగానం చేస్తా'నని కవి ప్రతిజ్ఞ. కేవలం వీటిని కవిత్వమన్నవారెవరు? ఆంధ్రనామ సంగ్రహం కవిత్వమని వ్రాసినాయన గూడ అని ఉండడే! ప్రాస—అనుప్రాసలు తెనుగుభాషకు ప్రాణాలు, దాని రమ్యతకు ఆకరాలు. ఇవి సొంపైన అలంకారాలని ఆంధ్ర భారతిని కైసేచి మురిసి మురి పించినారు. ఆ పక్షం వారంతా యతులు గణాలు ఒక Automatic unconscious Habit అంటారు; ఇంకా ఇది శిల్పమంటారు. ఇది శృంఖలాలనుకొన్న వారు మానివేయవచ్చు: ఎవరూ బదనాయం చేయరు. ఇదంతా ఆడలేని భోగముది మద్దెలమీదబడి కొట్టు కొన్నట్లున్నది. ఈ విషయంలో ఒకపక్షం వారు ఇంకొక పక్షాన్ని తెగనాడ వలసిన పనిలేదు. ఉపో ద్ఘాతం వ్రాసిన గుంటూరు శేషేంద్ర శర్మగారు— యీ రచయిత భావాలకు భిన్నంగా కవిత్వానికి నిర్వచనం చెప్పినారు. (చాలా ఉదాహరణాలతో) శర్మగారు ఏదో కడుపులో బెట్టుకొని గాలికి ఎవ రినో ఏ సంస్థలనో ఆడిపోసినారు. ఈ ధోరణికి కారణమున్నా — గాడిదలు—వెధవలు — చవటలు—ఏడ్చి నారు - అనే మాటలు శర్మగారి నగరు—'జ్ఞానబాగ్' నుండి వెలువడకుంటే బాగుండేది.

కవిత్వానికి వస్తాం:— మాటల ఆర్భాటం ఎక్కువ; దాని సందడిలో భావం బాగా బయటపడ లేదు. (హేమంత కిరీటం) నూరేండ్లనాడు పుట్టి యింకా ఒక నిర్ణీత ఆకారం పొందని సోషలిజము— దాని రాక్షసరూపం కమ్యూనిజాల మీద ఏదో ఒక దానిపై కాలూన దొక్కలేకున్నారు ఆశావాది అయిన చోట కవిత్వం రమణీయంగా ఉన్నది:—'కల్హార మాలి కలు చేతబూని కైసేసి గీతాల పాడుతూ పలుకు తున్నాను సుస్వాగతం నవ ఉగాదికి—'జనావళిని ప్రేమ రసాస్వాదనా తరంగాలపై విహరింపజేసి స్వర్గలోకా నంద మండలాలలో మైమరపించాలని' 'విశ్వమానవ జీవిత ప్రభాతానికి సుప్రభాతం పలుకాలని' కవి వేచి ఉన్నాడు. శుభం. కవినిగూర్చి మంచిమాట అన్నాడు:— 'రోచిస్సుందర దరహాస చంద్రికలరాగరంజిత భావనా కారుడు—కవి.' 'మంత్రాలవెర్రికి మోసగింపని మేక' అన్నది వేమన ఎత్తిపొడుపువంటిది. ఇందు కవినిగూర్చి 4, 5 శీర్షిక లున్నవి.

శమయతి పరితాపం—లో అన్యాయాలు చేసే వారిని జాడించినాడు. 'శిల్పి' ఇందు ఉత్తమోత్తమ భావభరిత రచన. కవి వింతైన పదబంధాల కూర్చి నాడు, అయినా ఇందు విరోధమే భాసిస్తున్నది—నిప్పు పూల పరిమళం; ఫ్ఱరని మంటల ప్రభంజనం; ఆనంద కేదార పల్లకీలో కొత్తపెండ్లికూతురు; కత్తుల వంతెన బెదరింపులు; మంటల పందిళ్లు. వీటితోబాటు కొన్ని హృద్యమైనవి: అరుణకిరణ జ్వాలాముఖినై; దివ్యదీపతోరణాలు; నందనాలు విరిసిన నీ జతలో; వవతకు పారాణి దిద్ది.

సరే! పండితుడే యీ కవి; మామూలు పత్రిక భాషలోవలె తిరోగమనం అని వెనుదిరిగిపోవుటకు వాడాలనా? తిరోహితం అంటే కనబడకుండా పోవుట గదా. ప్రకృతిమాత పుంటినొప్పులా కాన్పునొప్పులా? కోనసీమలో కొబ్బరినీడలు—కొబ్బరిచెట్టు (టెంకాయ చెట్టు అనడం ఉచితం; తాటిచెట్టును ముంజచెట్టు అని అంటున్నామా?) నీడలనికాబోలు, మామిడి నీడ అన్నట్లు ఇది అతుకదు. కొబ్బరి గుట్టలనీడలు మల బారులోనే కనబడేది.

—శ్రీ మిరుపూరు కోదండరామరెడ్డి.

## ఎ. చెహోవ్ కథలు

(అనువాదం : శ్రీ రాచమల్లు రామచంద్రారెడ్డి. డెమ్మీ సైజు : 142 పేజీలు వెల : రూ 2-75. ప్రచురణ : ప్రగతి ప్రచురణాలయం, మాస్కో, ప్రతులకు (1) విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, ఏలూరు రోడ్, విజయవాడ-2. (2) విశాలాంధ్ర బుక్ హౌస్, సుల్తాన్ బజార్, హైదరాబాద్.)

'హఠాత్తుగా అతని ముఖం ముడుచుకు పోయింది. కండ్లు ఆకాశంవైపు తేలిపోయినాయి. ఊపిరి స్తంభించింది...బైనాకులర్లనుండి ముఖం పక్కకు తిప్పుకొని, కుర్చీలో వంగి, అతను – అఛ్ఛూ! అనగా అతను తుమ్మినాడు' (గుమస్తా మరణం) ఈ కథా సంపుటి ఈ హఠాత్సంఘటన వర్ణనతో ప్రారంభమవుతుంది. తుమ్మే హక్కు అందరికీ ఉన్నట్లే (గుమస్తా మరణంతో పిరికి వాళ్లకు ఆ హక్కుకూడా లేదని రచయిత నిరూపించినట్లే మనం భావించాలి.) దాన్ని వర్ణించే హక్కుగూడా ప్రతి సాహస రచయితకూ ఉంటుంది. అయితే పై విధమైన వర్ణన ఒక్క చెహోవ్ మాత్రమే చేయగలడు. ముఖం ముడుచుకు పోవడం, కళ్లు తేలిపోవడం, ఊపిరి స్తంభించడం, చివర 'అఛ్ఛూ' (మన వాళయితే 'హచ్') అనడం చాలా సావాగాఉన్నా ఈ నాలుగు భాగాల్లో ఏది తీసేసినా వర్ణన పూర్తి కాదు. దీనిలో ఒక్క అలంకారంకూడా లేకపోవడం గమనించదగ్గ విషయం. చెహోవ్ 'సాదాతనం'నుంచే 'హోదాతనం' సంపాదించుకున్న రచయిత.

ఇది చెహోవ్ చేసిన తుమ్ము వర్ణన కావచ్చు. దీన్నే మనం అతని రచనా పద్ధతికి ప్రతీకగా గ్రహించ వచ్చు. సామాన్యమైన ఇతివృత్తం, అతిసామాన్య సన్నివేశ చిత్రణ, అంతకన్న సామాన్యమైన కథనంతో సాగే అసామాన్యమైన రచన చెహోవ్‌ది. అయితే చెప్తున్న విషయంకంటె పెద్ద 'ఫోజు'పెట్టి పాఠకుని వ్యుత్పన్నతను అనుమానించడు. చెప్పవలసిన దానికంటె మితిమీరి వ్యాఖ్యానించి పాఠకుని సంస్కారాన్ని అవమానించడు.

సామాన్యంగా కథలకు ఏదో ఒక హఠాత్సం ఘటనతోనో, సందేశంతోనో భరతవాక్యం పలకడం మన కలవాటు. ఈ అలవాటు చెహోవ్ కథలకు లేదు. విషయం చెప్పుకుంటూపోయి చివర ఏ అభిప్రాయమూ వెల్లడించక తప్పుకునే రచయితమీద మనకు తరచుగా కోపంకూడా తెప్పిస్తాయి చెహోవ్ కథలు. అయితే చెహోవ్ వ్యక్తిత్వం అక్కడే ఉన్నదని తెలుసుకున్నప్పుడు రచయితను అభినందించకుండా ఉండలేము. 'అతను తుమ్మినాడు' అన్నమాట తీసివేస్తే పై వర్ణన చెహోవ్ కథల ముగింపుకూడా ప్రతీకగా పేర్కొన వచ్చు. 'అంతోన్ చెహోవ్ కథలు' అన్న శీర్షికతో నాలుగు పేజీలున్న పీఠికలో ఈ క్రింది మాటలు కూడా ఉన్నాయి. 'చెహోవ్ బహిరంగంగా పాఠకునికి విజ్ఞప్తీ, అతన్ని ఒప్పించడానికి ప్రయత్నమూ చేయడు. పాఠకునికి యిలా చెప్పడానికి ఆయన కథను మొత్తంగా ఉపయోగించుకొంటాడు.' అవును వస్తువులోనే సందేశాన్నీ, ప్రయోజనాన్ని దాచడం చెహోవ్ నేర్చిన విద్య.

ఇందులో ఎనిమిది కథలున్నాయి.

చెహోవ్ కథల్లో సాహిత్యకారులచేత సాటిలేనివని మన్ననలు పొందిన కొన్ని కథల్లో 'నాన్ కవిూ

షన్డ్ ఆఫీసరు ప్రిషిబేయెవ్' 'దుష్టుడు' అన్న రెండు కథలు కూడా ఉన్నాయి. అవి రెండూ ఇందులో లేవు. జారిస్టు నిరంకుశ పరిపాలనను సంకేతించిన 'ఆరవ వార్డు' అన్న కథకూడా ఈ ఎనిమి దింటిలో ఒకటి కాలేకపోయింది. ఉన్న ఎనిమిదింటిలో 'గుమస్తా మరణం', ఊసరవెల్లి, బురఖా— ఈ మూడూ చిన్న కథలు. పరిమాణంరీత్యా చిన్నవైనా ప్రయోజనం దృష్ట్యా చాలా విలువైనవి. మూడింటా సాంఘిక హోదాముందు సామాన్యుడి జీవనం ఆనాడు ఎంత పిరికిగా ఉండేదో కళ్లకు కట్టినట్టు చిత్రింప బడింది. 'బురఖా'లో సాంఘిక హోదాముందు మేధావి గూడా సామాన్యుడేనని వ్యంగ్యం. మొదటి రెండు కథల్లో సాంఘికహోదా అధికారానికీ, మూడవ కథలో డబ్బుకూ సంబంధించినది. మిగతా ఐదు పెద్దకథలు. అవి యివి: సీతాకోకచిలుక, ఇయోనిచ్, గుల్లలో జీవిం చిన మనిషి, కుక్కను వెంటబెట్టుకున్న మహిళ, పెండ్లికూతురు. పై మూడు చిన్న కథల్లో 'ఊసర వెల్లి'కి మల్లేనే ఈ ఐదు పెద్దకథల్లో 'కుక్కను వెంటపెట్టుకున్న మహిళ, బహుళ జనాదరణ పొందిన కథ. అయితే 'గుల్లలో జీవించిన మనిషి' ప్రయో జనం దృష్ట్య చాలా గొప్పకథ. ముందు బహుళ జనాదరణకు పాత్రమైన కథలలో వస్తువేమిటో తెలుసుకుందాం. 'ఊసరవెల్లి' కథలో—మార్కెట్టు వద్ద కుక్క ఒకడ్ని కరుస్తుంది. కేసు విచారణ ప్రారం భించిన పోలీసు మొదట గాయపడినవాడిమీద జాలినీ, కుక్కలను ఊరిమీద వదలిపెట్టేవాళ్లమీద కోపాన్నీ ప్రకటిస్తాడు. ఆ కుక్క జనరల్‌దని అక్కడ చేరిన జనంలోనుంచి ఒకరు చెబుతారు. పోలీసు రంగు మారి పోతుంది. కుక్క కరిచిన మనిషిని తిడతాడు — జాగ్రత్తగా ఉండాలని. కొంతసేపటికి ఆ కుక్క జనరల్‌ది కాదని చెబుతారు. అప్పుడు కుక్క యజ మానికి గుణపాఠం చెప్పాలని ప్లేట్లు మారుస్తాడు. బలహీన ప్రాణియైన ఊసరవెల్లి ఆత్మరక్షణార్థం పరిసరాల్నిబట్టి రంగుమార్చుకోవడం దానికి సహజ గుణమే మరి!

కుక్కపిల్లతోపాటు ఒక పరపురుషుడ్ని కూడా వెంటబెట్టుకున్న వివాహిత కథ 'కుక్కను వెంట బెట్టుకున్న మహిళ.' ఇందులో నాయకుడు భార్యను మోసగించి రోజుకో పరస్త్రీతో తిరుగుతూ—స్త్రీలంటే ప్రేమా, గౌరవమూ లేని జారుడు. అతడు కుక్క పిల్ల మహిళను 'బీచ్'లో చూచి వెంబడించి మెల్లగా లొంగదీసుకొని ఆమెను మోసగించినా ననుకుంటాడు. తర్వాత ఆమెమీద ప్రేమ అంకురించి ఇతడే ఆమెకు లొంగిపోతాడు. కథ టూకీగా ఇది కాగా—దీనిమీద రచయిత కెందు కింత ప్రేమ గలిగిందోకాని, అఖండ ప్రతిభాశిల్పంతో, ప్రతి వాక్యాన్ని అనుభవసారంగా తీర్చిదిద్ది, రసాత్మకమైన కళాఖండంగా రూపొం దించాడు. తన చుట్టూ గిరిగీసుకుని గుల్లలో నత్త లాగా జీవిస్తున్న ఒక ఉపాధ్యాయుని జీవితానికి వ్యంగ్య చిత్రణ 'గుల్లలో జీవించిన మనిషి' ఇలా ఏకాంత వాసాన్ని అభిలషించడం—'మన పూర్వులు సంఘ జీవులు కాకముందు, ఒంటరిగా గుహలలో జీవించిన నాటి కాలానికి తిరిగిపోవడం'లాంటిదంటాడు రచయిత. చెహోవ్ తన మరణానికి ముందు రాసిన కథ అనే కితాబుంది' 'పెండ్లికూతురు'కు. బయటి వెలుగును చూచి ఇంటదీపాన్ని ఆర్పుకున్న ఒక చపలచిత్త కథ 'సీతాకోకచిలుక' అంటే కథ పేరుతో ఒక మహిళ బయట రోజుకో కళాకారునితో కలిసి తిరిగి, ఇంట విజ్ఞానఖనియైన భర్తను పోగొట్టుకొంటుంది. సంకు చిత తత్వానికాహుతి అయిపోయిన ఒక డాక్టరు కథ 'ఇయోనిచ్'.

రాచమల్లు రామచంద్రారెడ్డిగారి అనువాదం ప్రతిభావంతంగా చెహోవ్ కథల హోదాకు తగిన విధంగా ఉన్నది. అయితే 'దాటుబయటికి' (14 పేజీ) నేను బయటికి దాటమంటే దాటాలి' (23 పేజీ) ఈ వాక్యాల్లో 'దాటు'కు బదులు 'వడువు' అని ఉంటే ఇంకా అందగించేది.

ఇన్ని కథలు చదువుతుంటే ఏ ఒక్కసందర్భంలో నైనా పాఠకుడికి చెహోవ్ ముఖం ఒకసారి చూడా లనిపించడంలో దురాశ ఏమీలేదు. ఇంత 'సాదా'తనం నుంచి ప్రపంచ కథకుల్లో అగ్రశ్రేణి 'హోదా'ను సంతరించుకున్న చెహోవ్ ఛాయాచిత్రం ఇంత అంద మైన పుస్తకంలో ఏమూలా లేకపోవడం చింతించ దగ్గ విషయం.

## రష్యన్ జానపద బాలసాహిత్యం

పిల్లలులేని యిల్లు కందులు కొట్టిన కళ్లం లాంటిదంటారు. బాలసాహిత్యంలేని భాషకూడా

అంతే! పిల్లల ముద్దు పలుకులే గుండెల్లో గులాబీలు పూయిస్తే, వారి చిన్నారి పాటల్ని గురించి వేరే చెప్పాలా?

పిల్లల పాటలు వారి మనస్సులలాగే నిష్కపటములూ, స్వచ్ఛందములూ! జానపద సాహిత్యం సహజంగానే పై గుణాలకు మణికిరీటం వంటిది. పిల్లల గేయాలు - అందునా జానపద భాషలో—అంటే—వేరే చెప్పాలా?

బాల సాహిత్యానికీ, వాస్తవికతకూ మామూలుగా చుక్కెదురు. విచిత్ర పాత్రలూ, అద్భుత సన్నివేశాలూ చిట్టి మనస్సుల నాకర్షించినంత తొందరగా వాస్తవిక చిత్రణలు లోగొనవు. కనుకనే పిల్లల కథల్లో సామాన్యంగా జంతువులూ, రాక్షసులూ, మాంత్రికులే పాత్రలుగా ఉంటారు.

ప్రజా సాహిత్యానికి మల్లేనే బాలసాహిత్యం కూడా పిల్లలకోసం పెద్దలచేత రచింపబడింది ఒక రకం. పిల్లలే పాడుకునే పాటలు మరొక రకం.

పై గుణాలన్నీ కలిగిన రష్యన్ భాషలో జానపద సాహిత్యానికి చెందిన పిల్లల గేయ కథలను తెలుగులో అనువదించి రంగులలో సచిత్రంగా ప్రచురించిన పుస్తకాలు మూడు :

## 1. కాకి-తెల్లరెక్కల కాకి

(రష్యన్ జానపద క్రీడాగేయం)

(అనువాదం : పుప్పల లక్ష్మణరావు. చిత్రములు యు. వస్నెత్సోవ్. రాయల్‌సైజు 16 పేజీలు.: వెల : 0—70 పై. ప్రచురణ : 'ప్రగతి' ప్రచురణాలయం, మాస్కో.)

తెలుగులో క్రీడా గేయాలని కొన్ని ఉన్నవి. అవి రెండు రకాలుగా ఉన్నవి పిల్లలు భావయుక్తంగా అభినయిస్తూ పాడే కథాగేయాలు ఒక రకం. వీనిలోని అర్థం చప్పున స్ఫురిస్తుంది. ఉదాహరణం—'కాకి ఒకటి నీళ్లకూ కావు కావు మనియెనూ...' అన్న పాట. మరొక రకం గేయాలున్నాయి. వీనిలో అర్థం చప్పున స్ఫురించదు. స్ఫురించకపోయినా వానిలోని లయా, నాదమూ, ముక్తపదగ్రస్తమూ పిల్లల మనస్సులను వెంటనే పట్టుకుంటాయి. పిల్లలు ఒక్కొక్క రకం ఆటకు ఒక్కోపాట పాడుతూ ఆడుకుంటారు. ఉదాహరణం — ఇద్దరాడపిల్లలు కలిసి పరస్పరం చేతులు తట్టుకొంటూ కుడి ఎడమలకు దూకుతూ 'చెమ్మ చెక్క చారడేసి మొగ్గ, అట్లు పొయ్యంగ ఆరగించగ...' అనే పాట పాడుతారు. అలాగే 'కళ్లాగజ్జి కంకాళమ్మ...' అనీ, 'ఒప్పులకుప్పా ఒయ్యారి భామా...' అనీ క్రీడాగేయాలనేకం ఆయా ప్రాంతాల్లో ప్రచారంలో ఉన్నవి. వినిలో పైకి ఒక అర్థం స్ఫురించక పోయినా, తెలిసిన పెద్దలిందులో ఆయుర్వేద రహస్యాలు దాగి ఉన్నాయనీ, ఒక్కోపాటనుంచి ఒక్కో వైద్య పద్ధతిని వివరిస్తున్నారు. ఈ రెండు రకాల గేయాలూ పిల్లలకోసం పెద్దలచేత రచింపబడినవే.

'కాకి—తెల్లరెక్కల కాకి' అన్న రష్యన్ జానపద క్రీడా గేయం పైన వివరించిన మొదటి రకానికి చెందినది.

ఇందులో కథ యిది : తెల్ల రెక్కలకాకి కమ్మని వంటలుచేసి తన మిత్రులనంతా పిలిచి వడ్డిస్తుంది. ఒక పిచికకు మాత్రం వడ్డించదు. దానికి కారణం కాకి యిలా వివరిస్తుంది.

'నీళ్ల అదీ తేలేదు
కట్టెలు అదీ కొట్టాలేదు
పొయ్యి అదీ రాజేయాలేదు
పులుసు అదీ కాచా లేదు...'

పనిచేసేవాడికే తినేహక్కు— అని ఈ కథలో నీతి.

'పొయ్యి మంటెయ్యలే'దనడానికి' రాజెయ్యలే'దనడంలోనూ 'పులుసు వండలే'దనడానికి బదులు 'కాచలే'దనడంలోనూ తెలుగు నుడికారంతోని తియ్యదనమెంతో ఉంది. అనువాదం తెలుగుసొగసు చిందుతూ ఇంపునింపుతున్నది. 'తెల్లరెక్కల'కాకి సాభిప్రాయమైనది. భావయుక్తమైన రంగురంగుల చిత్రాలతో పుస్తకం ఆకర్షణీయంగా ఉన్నది.

## 2. పిల్ల చేపలు

(జానపద పాటలు)

(చిత్రాలు : యూరియ్ వస్నెత్సోవ్. అనువాదం: రాచమల్లు రామచంద్రారెడ్డి. రాయల్‌సైజు 16 పేజిలు; వెల: 0-80 పై. ప్రచురణ : 'ప్రగతి' ప్రచురణాలయం, మాస్కో.)

'పిల్ల చేపలు' అన్న ఈ పుస్తకంలో అంతా ఒకే గేయంకాదు. ఇందులో పది ముక్తకాలు ఉన్నాయి. ఇవి నిజానికి పైన వివరించిన మన క్రీడా గేయాలలో రెండరతెగకు చెందినవని చెప్పాలి. అయితే ఈ రకం మన గేయాలలో అర్థం దురవగాహ్యం ఇందులో ప్రతిపాటా సులభార్థబోధకమై, నాలుగైదు పాదాలతోముగిసి, ఒక నీతినీ, సందేశాన్నీ కలిగి ఉన్నవి.

ఉదాహరణకు ఒకపాట :

'మిద్దె కప్పుపై కూర్చొనివున్నై
కాకులు రెండూ దూరదూరమై
యెడమొగమై పెడమొగమై
జగడం వాటికి యిపుడే జరిగెను
యెవరు తినాలని చచ్చిన పురుగును.'

ఈ గేయం మొత్తం ఇంతే. అయితే దీనిలో అర్థం ఎంతో.

రెండు కాకులుచేరి ఒక పురుగునుచంపి ఒక గుడిసె కప్పుపై పెట్టాయి. ఆ పురుగును తినడంలో వాటికి తగువులు—ఎడమొగం పెడమొగంగా కూర్చు న్నాయి. గుడిసెపైన ఆకాశంలో కొన్ని పక్షులు యెగురుతున్నాయి. గుడిసెముందు నేలమీద ఒకపుంజా తిరుగాడుతున్నది. కాకు లట్లాగే ఇంకాసేపు అలిగి కూర్చుంటే పైన పక్షులకో. కిందికిజారితే పుంజాకో పురుగు ఆహారమైపోవడం తథ్యం. చిత్రం మనకు వ్యక్తీకరించే భావం యిది. పై గేయంలో ఇంత అర్థంలేదు. గేయంలోని అర్థానికి చిత్రం వ్యాఖ్యానం లాగా ఉంది. 'యెడమొగం పెడమొగం' అనడంలో ఉంది అనువాదంలో సొగసు. 'పనివారలు పరస్పరం కలహిస్తే ఫలితం పరులపాలు' అని పై గేయంలో నీతి. మిగతా గేయాలూ, వాని అనువాదమూ, చిత్ర కల్పనా గూడా ఇలాగే అర్థవంతంగానూ, ప్రయోజనార్థకంగానూ ఉన్నవి.

## 3. మెర్గేనా, అతని మిత్రులు

(నానోయ్ జానపద కథ)

(అనువాదం : రాచమల్లు రామచంద్రారెడ్డి. చిత్రాలు . జి. పబ్లిషిన్. రాయల్‌సైజు—20 పేజీలు; వెల : 0.90 పై. ప్రచురణ : 'ప్రగతి' ప్రచురణాలయం, మాస్కో.)

ఇది రంగు రంగు చిత్రాలతో రూపకల్పన చేసిన ఒక రష్యన్ జానపద కథ.

మెర్గేను ఒక వేటగాడు. అతనొకనాడు అడవిలో పోతూ ఉంటే బురదలో కూరుకుపోయిన ఒక దుప్పి కనిపించింది. దాన్ని రక్షించాడు. అవసరం వచ్చినప్పుడు పిలిస్తే వచ్చి సహాయం చేస్తానని. చెప్పి అది సెలవు తీసుకుంది. మరికొంతదూరం పోతే విరిగిన కొమ్మ కింద యిరుక్కున్న చీమ కనిపించింది. దాన్ని రక్షించాడు. అలాగే గట్టుమీద పడిఉన్న ఒక చేపను కాపాడేడు. దుప్పిలాగే ఇవి రెండుకూడా తమ కృతజ్ఞతను ప్రకటించి సెలవు తీసుకున్నాయి. అడవిప్రక్కనున్న ఒక పల్లెకు వెళ్లాడు. ఒక గుడిసెలో అందమైన కన్యను చూశాడు. పెళ్లి చెసుకుంటానంటే ఆ అమ్మాయి తండ్రి కొన్ని షరతులు పెట్టాడు. అవి యివి. ఒక రోజులో ఇనపబూట్లు అరగదియ్యాలి; నేలమీద చల్లిన ఐదు గోనెల రాగులు ఒక్కరోజులో మూటల కెత్తాలి. నదిలో పారేసుకున్న వుంగరం తీసుకు రావాలి. ఈ పోటీలో నెగ్గలేక వందమంది వీరులు కన్య తండ్రికి బానిసలుగా పడిఉన్నారు. మెర్గేను—తన మిత్రులైన దుప్పి, చీమ, చేపల సహాయంతో ఆ పోటీలో గెలుపొందుతాడు. కన్యతండ్రి సంతోషించి కుమార్తెతోపాటు తన గ్రామాన్నీ, బానిసలనూ, సేవకులనూ మెర్గేనుకు అప్పగిస్తాడు. అప్పుడు మెర్గేను చెప్పిన మాటలు కథకంతా 'భరత వాక్యం' లాంటిది. ఆ మాట లివి. 'కానీ యీ నాటినుండి బానిసలూ వుండరు. సేవకులూ వుండరు. అందరమూ సోదరులలాగా, శాంతంగా వుందాము...'

సరసమైన సంభాషణలతో రంగురంగు సన్నివేశ చిత్రాలతో ఒక పంచరంగుల చలనచిత్రం చూస్తున్నట్టు పుస్తకం మనసు గొలుపుతున్నది.

—శ్రీ నూతలపాటి.

## శాసన సంపుటి

(1, 2 భాగములు)

(రచన : శ్రీ బి. యన్. శాస్త్రి, సరస్వతీ నిలయం, నారాయణగూడ (హైదరాబాదు, 1973) వెల రూ. 50—00.)

ప్రాచీన శాసనములగూర్చి తెలుగున రచనలు చాల యరుదు. శ్రీ బి. యన్. శాస్త్రిగారి శాసన సంపుటి'

క్రమతోకూడిన, ఉత్కృష్టమైన రచనయని చెప్పక తప్పదు. వీరు తగు శ్రద్ధతో శాసనములను సేకరించుటయేగాక, పాఠ్యాదులను వివరించి చారిత్రక విషయములతోటి ఒక సంపుటిగా ప్రచురించినారు. ఇట్టి రచనలు మరింకెన్నో కావలిసి యున్నవి. శాసన పరిశోధన పై పెక్కు ఆంగ్ల గ్రంథములు వెలువడి యున్నవి. యేటేటా చాలవస్తున్నవి కూడా! ఇట్టి రచనలు ప్రాంతీయ భాషలలో లేకపోవడం విచారకరము. కాని ఇట్టి కృతులు—ఒక రాజవంశమునకు వారి సామంతులకు చెందిన శాసనము లన్నింటిని ఒకచో పొందు పరచినవిగా వేరు వేరుగా ప్రచురించిన పరిశోధకులకు, ఉన్నత విద్యార్థులకు మరింతగా వుపయోగించును.

ఈ సంపుటిని రెండు భాగములుగా రూపొందించిరి. మొదట భాగమున తామ్ర శాసనములు—రెండు విష్ణు కుండినులవి, ఒకటి మాఠర వంశీయులవి, మరొకటి గాంగ వంశీయులదీను, రెండవ భాగమున శిలా శాసనములు కలవు. వీనిలో 10 కందూరి చోడులవి, 12— కళ్యాణి చాలుక్యుల కాలము నాటివి, 10 కాకతీయులవి, మరి ఒకటి గోలుకొండ నవాబు కాలము నాటిది. ఈ చిన్న పరిశీలనా వ్యాసంలో ఇన్ని శాసనములగూర్చి అందున పలు శతాబ్దాల—వంశజాల పాలనా వివరములను తర్కించుట కష్టసాధ్యము. కొన్ని ముఖ్యాంశములను మాత్రమే వివరింతును.

1. విష్ణుకుండినులు : శ్రీ శాస్త్రిగారు ఇంద్రపాల నగరమును, విష్ణుకుండినుల మొదట రాజధానిగాను, ఇంద్రవర్మ ఇంద్రపాల నగరమును (అనగా నల్గొండజిల్లా, రామన్నపేట తాలూకా తుమ్మలగూడెం గ్రామం, చెరువు ఇంద్రపాలగుట్టల మధ్యగల (p. p. 2 and 5+), విశాల ప్రదేశము), స్థాపించినట్లు సూచించినారు. విష్ణుకుండి వంశ రాజులలో మొదటి వాడైన ఇంద్రవర్మనుగూర్చి కాని యతని పుత్రుడైన మాధవవర్మను గూర్చిగాని యేమియు తెలియదు. ఇంద్రపాలనగరమను పేరు శ్రీ శాస్త్రిగారు ప్రచురించిన శాసనములం దెక్కడను కానరాదు. శాసనములు రెండును తుమ్మలగూడెమున దొరకినవి. మరియును విక్రమేంద్రవర్మ (II), శాసనమున, (మూడవ రేకు, రెండవప్రక్క, రెండవ వరుస), 'ఇంద్రపుర' మనుచోట మహారాజ గోవిందవర్మయొక్క యగ్రమహిషియైన పరమభట్టారికా మహాదేవి బౌద్ధభిక్షులకొరకు తన పేర మహాదేవి విహారమును నిర్మించెనని తెలియుచున్నది. అదే శాసనమున మరియొకచోట ఉత్తమాశ్రయ నృపాలుడు 'శక్రాభిధాన' పురమునకు వచ్చినప్పుడు సదరు శాసనమును 'గావించినటుల చెప్పియున్నది. ఈ రెండు నామములు—శక్రాభిదానపురము, ఇంద్రపురము; ఒకే నగరమును సూచించునేమోగాని వీనినిబట్టి ఇంద్రపాల నగరము విష్ణుకుండినుల రాజధాని యనుట సమంజసముగా తోచదు. పైగా ఆ స్థలమున, తుమ్మలగూడెం—ఇంద్రపాలగుట్ట, చెరువు పరిసరములందు (చూడుడు ఛాయా చిత్రములు, PP; 4–5), పేర్కొనిన పురాతన దేవాలయములు మిగత అవశేషము లేవియు విష్ణుకుండినుల కాలమునకు చెందినవికావు. వెంకటేశ్వరాలయమున సింహద్వారముపైనున్న ఒక స్తంభముపై విష్ణుకుండినుల శాసనమున్నట్లు చెప్పియున్నారు. (P; 4) దాని వివరములు తెలియబరచలేదు. శ్రీ పర్వతమును శ్రీశైలముగా రచయిత తీసుకొన్నారు. కాని శ్రీశైల పరిసరములలో విష్ణుకుండినులకు సంబంధించి, యెట్టి చారిత్రక అవశేషములు లభింపలేదు. పైగా శ్రీ పర్వత స్వామి శ్రీశైల మల్లికార్జునుడేనని గ్రహించుటెట్లు? క్రీ॥ శకారంభమున శ్రీ పర్వతముగా ఖ్యాతి గాంచినది నాగార్జునకొండలోని శ్రీ పర్వత విజయపురి. శ్రీ పర్వత స్వామి — కార్తికేయుడు, లేక మహాసేనుడు. ఈ దైవము ఇక్ష్వాకుల కులదైవము. పెక్కు దేవాలయములను శ్రీ పర్వత విజయపురియందు శోభాయమానంగా కట్టించి ఆరాధించిరి కూడా. ఇక్ష్వాకుల యనంతరము విష్ణుకుండినులు బహుశ ఈ శ్రీ పర్వతస్వామి పాదానుధ్యాతులైరి. పైగా గోవింద వర్మ (1) 'శ్రీ పార్వతేయ పూర్వాపరక్షితిపతి పరంపరహార మధ్య నిరుపమ విరాజితయా కౌస్తుభాయమాన యశోజన్మః' అని చెప్పుకొన్నాడు.

ఆ తరువాత ముఖ్యమైనది విష్ణుకుండినుల కాల నిర్ణయము. ఈ రెండు శాసనములు విష్ణుకుండినుల చరిత్రకు మిక్కిలి యాధార భూతములనుటలో సందియము లేదుకాని పెక్కు సమస్యలను

గూడ రేకెత్తించినవి. ఇదివరలో శ్రీ మారేమండ రామారావుగారు సూచించిన కాలపట్టిక సరియైనది కాదని తేలిపోవుచున్నది. ఇటీవల శ్రీ నేలటూరి వెంకట రమణయ్యగారు 'విష్ణుకుండినులు' అను గ్రంథమున (P. 24., A. P. Govt. Archaeological Series, No. 40, 19 3), వివరించిన కాలానుక్రమణికలు, వంశవృక్షము మనింపదగును. అట్లయిన విష్ణుకుండినులు స్వతంత్ర రాజులుగా క్రీ॥ శ॥ 353 నాటికే గన్పడిరి. ఇదియెంతో సమంజసముగా తోచుచున్నది. శ్రీ శాస్త్రిగారు దీనినే క్రీ॥ శ॥ 388 కి అనగా 30 యేండ్లు వెనుకకు నెట్టుటయేల? అట్లే వీరి రాజ్య పరిసమాప్తి శ్రీ నేలటూరి వారు క్రీ॥ శ॥ 594 వరకే సూచించిరి. శ్రీ శాస్త్రి A. D. 624 వరకు అనగా వేంగీ చాళుక్యుల రాజ్య స్థాపన వరకు పొడిగించిరి. అట్లే కొంత వంశాను క్రమణికలోగూడ తేడాలు కలవు.

ఇది యిట్లుండ ఇటీవల శ్రీ శంకరనారాయణగారు విష్ణుకుండినుల 'త్రివర నగరమును' రాజధానిగా చేసుకొనిరనియు ఈ త్రివర నగరము—కృష్ణా జిల్లాలోని 'తిరువూరు' అనియు, మరొక క్రొత్త వాదను రేకెత్తించారు. (See, Journal of Oriental Institute Baroda March 74 XXIII, pp. 4 7—18) పై రచనలన్నియు కేవలము శాసనముల యాధారముగా చేయబడినవి. మిగత ఆధారములు ముఖ్యంగా వీరి నాణెములు, శిల్పము, కట్టడములు—యెన్నియో నూతనాంశములను తెల్పుచున్నవి. (Pl. see Journal of the Numismatic Society of India, 197 ), XXXI , pp 6 -79 Ibid 81—83 and Prof Minashi in pp. 12 —27, శ్రీ శాస్త్రిగారు వీటినికూడ పరిశీలించి ఒక సమగ్రమైన పరిశోధక గ్రంథంగా మరి ముద్రణలో అందజేయగలరని ఆశిద్దాము.

2. ఇక్ష్వాకుల యనంతరము విష్ణుకుండినులెట్లు స్వతంత్రులుగా కృష్ణానదీ ప్రాంతమున పైకి వచ్చిరో, కళింగమున పితృభూమిను రాజ్యముగా చేసికొని మాఠర వంశీయులు కొంతకాలము పాలించిరి. తెంబూరులో లభించిన ఈ శాసనము ఉమావర్మ 40—వ రాజ్య సంవత్సరమున వేయించెను. అనగా క్రీ॥ శ॥ 439. చారిత్రకంగా ఈ శాసనములు చెప్పుకోదగిన నూతన విషయ మేమియులేదుకాని ఈ శాసనమున లిపిశైలి విష్ణుకుండి—వారౌటకుల శాసనముల కత్యంత సామ్యములు కల్గియున్నది. ముఖ్యంగా 'లిపి శాస్త్రము' నభ్యసించు చదువరుల కెంతయో ఈ శాసన ముపయోగించును.

3. ఇందున తూర్పు గాంగవంశీయుల రెండు తామ్రశాసనముల గూర్చి వివరణ మున్నది. ఈ రెండును శ్రీ గిడుగు వేంకటసీతాపతిగారివద్ద లభించినవి. పాతపట్నం తాలూకా సేవిది, తెంబూరు గ్రామములలో లభ్యమైనవి. మొదటిది కళింగనగర రాజగు అనంతవర్మ యిచ్చిన సేవిద దానశాసనము, ఈ శాసనభాష సంస్కృతము. లిపి ప్రాచీన దేవనాగరి. శ్రీ శాస్త్రిగారి శాసనము మొదటి అనంతవర్మ యిచ్చినట్లుగా చెప్పియున్నారు (చూడుడు పేజీ 82). ఈతని తండ్రి యెవరో, యే రాజ్య సంవత్సరమున ఈ శాసన మొసగెనో తెలుపకుండుటవలన, శాసనకర్త యీ మొదటి అనంతవర్మయే యను టెట్లు? లిపి యాధారంగా చూచినచో ఈ అనంతవర్మ 2 వ లేక మూడవ అనంతవర్మలు కూడ గావచ్చును కదా!

తెంబూరు శాసన మొసగిన అనంతవర్మ చోడగంగదేవుడు (A D. 1077-1150), సుదీర్ఘకాలము దాదాపు 70 సంవత్సరములు పాలించిన మహారాజా, సంస్కృత భాషాభిమాని. వేములవాడ భీమకవి పండితుని శాసమునకు గురియైన రాజీతడే. ఇత డొసగిన శాసనములు పెక్కులున్నవి. ప్రస్తుత శాసనమందున కూడ గాంగ వంశానుక్రమణిక వివరముగ నున్నది. కాని శాసనమున రాజ్య సంవత్సరాదులు లేవు. చారిత్ర్యకంగా యీ రెండు శాసనములు ఎట్టి నూతన విషయములను తెలుపుటలేదు.

ఈ గ్రంథము రెండవ భాగమున శిలా శాసనములు ప్రచురితములైనవి. ఇందు మొదటి కుందూరు చోడులవి. తెలుగుచోడవంశజులై, తెలంగాణములోని మహబూబునగరు — నల్లగొండ మండలములందుండి ఖ్యాతికి వచ్చినవారీ కుందూరు చోడులు. వీరు మొత్తము పదుముగ్గురు రాజులు రమారమి రెండునందల యేండ్లకుపై మించి రాజ్యపాలనము (క్రీ॥ శ॥ 1078—1282) చేసిరి. వీరు ఆరంభమున పశ్చిమ చాళుక్యులకు సామంతులుగా నుండిరి. కాకతీయుల

క్రింద కూడ రాజ్యము చేసిరి. ఈ శాసనములలోని తెలుగుభాష— పదప్రయోగములు, వ్రాతశైలి—వ్యాకరణము యెంతేని గమనింపదగును. శాస్త్రిగారు పేర్కొన్నట్లు కొన్ని పదములు, (పేజీలు—139, 149; 155, 165, 172), కాలానుగతంగా వాడుకలో లేవు.

## పేరూరు శాసనములు

శ్రీ శాస్త్రిగారిందు తొమ్మిది శాసనములను ప్రచురించియున్నారు. ముఖ్యాంశమేమన ఈ శిలా శాసనములన్నియు ఒకే స్తంభముపై నలుప్రక్కల చెక్కబడియున్నవి. ఈ శాసనములు, పేర్వెరు రాజుల,వారి సామంతల కాలముకకుచెందినవి.ఇటీవల ప్రచురితమైన శ్రీ నేలటూరి వేంకటరమణయ్యగారి పేరూరు శాసనములలో (A. P. Govt. Archaeological Series, No, 38 యందు ప్రచురితమైన 1, 2, 3, 5, 7, 8, 9 శాసనాలు మాత్రమే కానవచ్చుచున్నవి. శాసన పాఠములలో చాల తప్పొప్పులున్నవి. ప్రచురితమైన శాసన ప్రతిబింబములు నిరుపయోగములు. పేరూరు శాసనములలో నొక్క స్వయంభువ సోమనాథుని దేవాలయములోనివే శాస్త్రిగారు ప్రచురించిరి మిగావి కావలెనన్న శ్రీ వెంకటరమణయ్యగారి గ్రంథమున చూడవగును.

ఈ శాసనములు కల్యాణి చాళుక్యులు వారి సామంతులైన కందూరి చోడులు, ఆ తర్వాత కాకతీయ రాజులు వారి అనుయాయులైన యాదవ రాజుల దాన ధర్మములను శైవ మతాభిమానమును చాటుచున్నవి. ఈ కాలమున తెలుగు దేశమున అరవవారు గూడ 'నకరముల' (అనగా వ్యాపార గిల్డులు)ను స్థాపించుటయేగాక, ఒక్కొక్క నకరమునకు వేరు వేరు ఇష్టదేవతలను పెట్టి పూజించుట కూడ ఆచారమైనట్లు తెలియుచున్నది.

ఇవిగాక, కల్యాణీ చాళుక్య ప్రభువగు జగదేకమల్లుడు (II), 10 వ రాజ్య సంవత్సరమున నొనగిన బెల్లేపల్లి శాసనము (భువనగిరి తాలూకా) ఆ రాజు కాలమునందియైన శనిగరం శాసనములుగూడ ప్రచురితములు. శాసన ప్రతిబింబములు చదువ వీలుకానట్లు ప్రచురింపబడినవి.

చివరి యధ్యాయమున కాకతీయ శాసనములు, వారి సామంతులు మండలాధీశ్వరు లొసగిన 'కన్నెకల్లు' శాసనము, మరియు గోలకొండ నవాబు కాలమునాటి 'శనిగరం' శిలాశాసనము ప్రచురితములు.

శాసన ప్రతిబింబములను మంచి కాగితముపై ప్రచురించిన, మరింత విపులముగా పాఠ్యభాగముల చదువగోరు విద్యార్థులకెంతేని యుపయోగముగా నుండెడిది. చాల అచ్చుపొరబాట్లు దొర్లినవి. ఒక శాసన గుడిలోని పంక్తులన్నింటిని వరుస క్రమమున అంకెల నొసగుట పరిపాటి. కాని ఈ గ్రంథమున రచయిత ఒక్కొక్క రేకు ప్రక్కకు విడిగా అంకెల క్రమము నొసగిరి. ఈ 'నంబర్లు' శాసన బింబములపై చూపలేదు. చివరన 'ఉపయుక్త గ్రంథము'ల పట్టిక గలదు. గ్రంథముయొక్క రచయితయొక్క పూర్తి పేర్లను చాలచోట్ల విపులీకరించలేదు.

పైన పేర్కొన్నటుల, యిన్ని శాసనముల నొక్కచోటగా ప్రచురించిన శాస్త్రిగార్ని యెంతైనా అభినందించవలసియున్నది.

—శ్రీ కార్తికేయశర్మ.

## సాహిత్య వివేచన

(రచన: డాక్టర్ మద్దూరి సుబ్బారెడ్డి, ఎం. ఏ., పిహెచ్. డి., ప్రచురణకు: యూనివర్సిటీ బుక్ సెంటర్, ప్రకాశంరోడ్డు, తిరుపతి., వెల: 6–50, పుటలు: డెమ్మీ 118.)

'డాక్టర్ మద్దూరి సుబ్బారెడ్డిగారు తమ నిసర్గ మధుర మంజులమైన శైలిలో రసదృష్టితో రచించిన చక్కని సారస్వత వ్యాసాల సంకలనమే ఈ 'సాహిత్య వివేచన'. 'వివేచన' అంటే మంచిచెడ్డల పరామర్శ. తెలుగు సాహిత్యంలోని—ముఖ్యంగా ఆధునిక సాహిత్యంలోని వివిధ విషయాల వివేచన ఈ వ్యాసాలలో నిష్పాక్షికంగా, కూలంకషంగా కొనసాగింది. ఈ వివేచన రెడ్డిగారి ధర్మదృష్టికి సాహిత్యాభిరుచికీ ఎత్తిపట్టిన మణిదర్పణంలా ఉంది.

ఈ 'సాహిత్య వివేచన'లో మొత్తం పన్నెండు వ్యాసాలున్నాయి: (1) దేశభక్తి కవిత్వం, (2) స్వాతంత్ర్యోద్యమ కవిత్వం—ప్రారంభదశ, (3) తెలుగు సాహిత్యంలో రాజనీతి, (4) ఆధునికక్షేత్రప్రశస్తి

కావ్యాలు, (5) ఆశ్రమవాసపర్వ సమాలోచన, (6) జాషువా కవితాశయాలు, (7) దేశనాయక స్మృతికావ్యాలు, (8) క్రీడాభిరామం—ప్రజాజీవితం, (9) అస్పృశ్యతా నిరసన కవిత్వం, (10) స్త్రీల పాటల్లో సీతమ్మ అప్పగింతలు, (11) 'మాలపల్లి'లో మాండలిక పదాలు, (12) సమరకవిత.

'దేశభక్తి కవిత్వం' అనే మొదటి వ్యాసంలో, దేశభక్తి ప్రతిజాతికీ నిసర్గమైన భావన అనీ, తాత్కాలికమైన ఆటంకాలేవో వచ్చినా అవకాశం వచ్చినప్పుడు అది సింగిలా విజృంభిస్తుందనీ, తన దేశంమీద భక్తీ ప్రేమా లేని మానవుడు ఉండటం కల్ల అనీ నిరూపించారు డా|| సుబ్బారెడ్డిగారు. 'ఉద్యమాలు కవిత్వానికి ఊపిరు లూదుతాయి, కవిత్వాలు ఉద్యమానికి కాహళులు సంధిస్తాయి'—అంటారు. దేశభక్తీ—కవిత్వమూ పరస్పర పోషకాలై వర్ధిల్లుతాయని దేశదేశాల కవుల కవితలను ఉదాహరిస్తూ చెప్పారు.

'స్వాతంత్ర్యోద్యమ కవిత్వం—ప్రారంభదశ' అనే రెండవ వ్యాసంలో ఆంధ్రదేశంలో 1895 నుండీ స్వాతంత్ర్యోద్యమ భావసుమాలు విరియజొచ్చాయనీ, కవులు వాటి పరిమళాలను అందుకొని తమ కవితామారుతాలతో మారుమూలలకు కొనిపోసాగారనీ చక్కగా నిరూపింపబడింది. మరుగున పడిపోయిన ఎందరో కవుల దేశభక్తి కవితలను వెలుగులోనికి తేవడం జరిగింది.

'తెలుగు సాహిత్యంలో రాజనీతి' అనే మూడవ వ్యాసంలో రాజనీతి అర్థశాస్త్రానికి సంబంధించినదని చెప్పి, రాజలక్షణం, దురా దిష్ఠాన విధానం, మంత్రి పరివార లక్షణం, మంత్రాంగ విధానం, శత్రు రాజులను వశపరచుకొనడంలో ఉపాయ పరికల్పనం, యుద్ధాంగ సమాహరణం, యుద్ధ కమం అనే రాజనీతి భాగాలను వివరించి; కామందకం, పంచతంత్రం, నీతిసారం, పురుషార్థసారం, నీతిభూషణం, బద్దెనసీతి, విదుర నీతి మున్నగు వాటినుంచి ఉదాహరణలను చూపెట్టారు.

'ఆధునిక క్షేత్ర ప్రశస్తి కావ్యాలు' అనే నాల్గవ వ్యాసంలో ప్రాచీన క్షేత్ర మాహాత్మ్యాలకూ, ఆధునిక క్షేత్ర ప్రశస్తి కావ్యాలకూగల తేడా వివరింపబడింది. కాకతీయ సామ్రాజ్యానికి రాజధానిగా వెలిగిన ఓరుగల్లునూ, శాతవాహనుల శిల్పకళాలయమైన అమరావతినీ, గడ్డపారలను గోగుకాడలవలె పేనిన రెడ్డిరాజుల ప్రాభవోన్నతులకు అండగా నిలిచిన కొండవీడునూ, విజయనగర రాజుల చేతి చలువన అందాల పందిళ్లు నిల్పుకున్న హంపీ—పెనుగొండలనూ, శిల్ప శక్తికీ శివభక్తికీ వంతెనలు నిర్మించిన దాక్షారామాన్నీ ఆధునికాంధ్ర కవులు ప్రశంసించిన తీరు తెన్నులు ఈ వ్యాసంలో కమనీయంగా ప్రదర్శితమయ్యాయి.

ఆదిపర్వంనుండి ఆశ్రమవాన పర్వంవరకూ ధృతరాష్ట్రుని పాత్ర పొందిన మానసిక పరిణతీ; ధర్మరాజు, కుంతి, భీమపాత్రలు ధృతరాష్ట్రుని మనః ప్రవృత్తిలోని మార్పునకు ఏ విధంగా దోహద మొన ర్చినదీ; మహాకవి తిక్కన పరిశీలనాశక్తి, లోకజ్ఞత, రసవత్సన్నివేశసృష్టి, నాటకీయత మున్నగు అంశాలూ 'ఆశ్రమవాస పర్వ సమాలోచన' అనే అయిదవ వ్యాసంలో కూలంకషంగా చర్చింపబడ్డాయి.

1930 నుంచీ స్వాతంత్ర్యోద్యమ ప్రభావంవల్లా గాంధీగారి ప్రభావంవల్లా మానవత మూర్తీభవించే రచనలు సాగిస్తూ వచ్చిన గుఱ్ఱం జాషువాగారి కవిత్వానికి ప్రాణాలైన నిమ్నజాతి ఉద్ధరణం, భారతజాతి దాసిసత్వ విదళనం 'జాషువా కవితాశయాలు' అనే వ్యాసంలో రెడ్డిగారు హృదయంగమంగా ఆవిష్కరించారు.

పాశ్చాత్యుల ఆత్మాశ్రయ కవిత్వంలో ప్రధాన భాగమైన 'ఎలిజీ'; తెలుగు సాహిత్యంలో ఏయే రూపాలతో కనబడుతోందో వివరించి; గోపాల కృష్ణ గోఖలే, బాలగంగాధరతిలక్ మోతీలాల్ నెహ్రూ, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, గాంధీజీ, జవహర్‌లాల్ నెహ్రూ మొదలగు దేశనాయకులు మరణించినప్పుడు తెలుగుకవులు వ్రాసిన స్మృతి కవితను రమ్యంగా చర్చించే వ్యాసం 'దేశనాయక స్మృతి కావ్యాలు.'

'క్రీడాభిరామం—ప్రజాజీవితం' అనే ఎనిమిదవ వ్యాసం డా. సుబ్బారెడ్డిగారిలోని సామాజిక చైతన్యాన్ని పట్టియిస్తుంది. అనాదిగా అగ్రవర్ణాలవారు నిమ్నకులాలవారిని ఏవిధంగా త్రొక్కిపెట్టి ఉంచిందీ ఈ వ్యాసంలో సప్రమాణంగా నిరూపించారు. 'తిలలకు తిలలే, బియ్యానికి బియ్యమే' అన్నట్లు వ్యభిచారణం వేరు, ఆచారంవేరు అన్నట్లు ఉండేది. ఆ విప్రోత్త

ములకు'; 'మాచల్దేవి' అంగట్లో మన్మథ సంబంధమైన చిత్రాలుకాక మహాదేవుడికి సంబంధించిన చిత్రాలెందుకుంటాయి?'—మొదలైన వాక్యాలు రెడ్డిగారి హాస్య పియత్వానికి మచ్చుతునకలు. క్రీడాభిరామంలోని ప్రజాజీవితాన్ని అతిసూక్ష్మంగా ప్రదర్శిస్తూ 'సుసరభేర్'ను దాటవేయడం వ్యాసకర్త ఔచిత్యపోషణకు గీటురాయి అని చెప్పాలి.

గాంధీగారు హైందవ సంఘంచేత నిరాకృతులైన పంచములకు 'హరిజనులు' అనే పేరు పెట్టారు. వారిని అంటరానివారిగా చూడటం మహాపాపం అని ఉద్ఘోషించారు. ఈ అస్పృశ్యతా నిరసన సిద్ధాంతాన్ని ప్రచారంచేసే కవితలు ఆ రోజుల్లో కొల్లలుగా వెలిశాయి. స్వాతంత్ర్యానికి పూర్వం వచ్చిన అస్పృశ్యతా నిరసన కవిత్వం—1909 లో ఆంధ్రభారతి పత్రికలో ప్రచురితమైన 'మాలవాండ్రపాట', గురజాడవారి 'లవణరాజుకల', మంగిపూడి వెంకటశర్మగారి 'విరుద్ధ భారతము', జాషువాగారి 'గబ్బిలం', 'అనాథ' మొదలైన కవితలూ తొమ్మిదవ వ్యాసంలో చక్కగా వివేచింపబడ్డాయి.

పదవ వ్యాసంలో, 'సీతమ్మ అప్పగింతలు'—'సీత అప్పగింతలపాట' — 'సీతను అత్తవారింటికి పంపుట' అనే మూడు భిన్నరూపాలతోవున్న రత్నంవంటి ఒక స్త్రీల పాటను వెలికితీసి, సానపట్టి, కోణాలుచెక్కి, వెలుగులు ప్రసరింపజేశారు సుబ్బారెడ్డిగారు. యాంత్రికయుగ మాహాత్మ్యంవల్ల జానపద సాహిత్యోత్పత్తి నశిస్తోందనీ, నేడు వడ్లు దంచవలసిన పనిలేదు సరికదా కనీసం కారం కూడా దంచుకోవలసిన అవసరం లేదనీ— అందుకే దంపుడుపాటలు పుట్టే అవకాశంలేదనీ రెడ్డిగారు వాపోవడంచూస్తే జానపద సాహిత్యంమీద వారికి గల నిక్కమైన మక్కువ తెలియవస్తోంది.

పదకొండవ వ్యాసం భాషకు సంబంధించింది. అయినా యిది సామాన్యులకు కూడా రుచించేలాఉంది. రెడ్డిగారు దీనిని భాషాశాస్త్రజ్ఞునిలా చప్పగా చెప్పకపోవడమే దీనికి కారణం. 'ఈ పదం ఈవిధంగా వచ్చివుండొచ్చు, ఈవిధంగా వ్యాకరణ సూత్రాలకు లొంగుతుంది అనిగానీ, ఇలా ఈకలు పీకేస్తే ఫలానా ధాతువు బయటపడుతుందనిగానీ చూడ ప్రయత్నించలేదు' వారు. ఉన్నవ లక్ష్మీనారాయణగారి 'మాలపల్లి' నవలలో వాడబడిన గుంటూరు మాండలిక పదాలను (116) ఆ జిల్లాలో ఏయే అర్థాల్లో ఏయే సందర్భాలలో వాడతారో సప్రమాణంగా, సరసంగా నిరూపించారు.

'రణరంగం కానిచోటు భూస్థలమంతా వెదకిన దొరకదు' అనే శ్రీశ్రీ గారి మాట భూతకాలానికి మాత్రమే అన్వయించేలా ఉంది. కాని ఆధునికకాలం కూడా అలాగే ఉందనీ, యుద్ధాలవల్ల మానవుడు తరతరాలుగా కూడబెట్టుకున్న సంస్కృతి సర్వనాశనమవుతుందనీ, అటువంటి సమయాల్లో కవి ఎలా బాధపడతాడో, నాగరకతా విధ్వంసులైన శత్రువులను ఎలా శపిస్తాడో సమరకవిత' అనే వ్యాసంలో సోదాహరణంగా నిరూపింపబడింది. 1962 లో చైనా, 1965 లో పాకిస్తాన్ భారతదేశంపై జరిపిన దురాక్రమణలను తెలుగు కవులు ఎలా నిరసించిందీ ప్రదర్శితమయింది.

మొత్తంమీద ఈ 'సాహిత్య వివేచన'లోని వ్యాసాలలో రెండు విశిష్ట లక్షణాలు కొట్టవచ్చినట్టు కనబడతాయి: మొదటిది విషయనవ్యత; రెండవది భాషాశైలి. ఈ పుస్తకంలో 'తెలుగు సాహిత్యంలో రాజనీతి', 'ఆశ్రమవాసపర్వ సమాలోచన', 'క్రీడాభిరామం—ప్రజాజీవితం' అనే మూడు వ్యాసాలు తప్పిస్తే, తక్కినవన్నీ ఆధునిక జీవితానికీ, కాలానికీ, ఆధునిక సాహిత్యానికీ, సమస్యలకీ సంబంధించినవే. ఇదివరలో ఇతరు లెవరూ ఈ విషయాలను గురించి ఇంత సమగ్రంగా, శాస్త్రీయంగా, హేతువాదబద్ధంగా, ప్రామాణికంగా చెప్పలేదు. ఈ విషయనవ్యతలో మరో విశేషం ఏమిటంటే ఈ పుస్తకంలో వివేచింపబడిన ప్రాచీన అర్వాచీన విషయాలన్నీ ప్రజలకూ, ప్రజాసాహిత్యానికీ, ప్రజల సమస్యలకూ సంబంధించినవే. ప్రజాస్వామిక యుగంలో సాహిత్యాన్ని—ముఖ్యంగా ప్రాచీన సాహిత్యాన్ని ఈ కోణంలో పరిశీలించవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉందని, సుబ్బారెడ్డిగారి వ్యాసాలు చదివిన ప్రతివారికీ మనస్సులో గట్టిగా నాటుకుంటుంది. విషయ పౌష్కల్యమూ, కూలంకష పరిశీలనా, రెడ్డిగారి సాహిత్య నవ్యతకు సైదోడుగా ఉన్నాయి.

ఈ వ్యాసాలలోని రెండవ విశిష్ట లక్షణం భాషాశైలి. నేటి సాహిత్య విమర్శ సామాన్యులకు

అందుబాటులో ఉండటంలేదు వ్యావహారిక భాషలో వ్రాయబడిన విమర్శ అయితే సాంకేతిక పదజాలంతో నిండిపోతుంది. గ్రాంథికభాషలో వ్రాయబడిన విమర్శ అయితే క్లిష్టసమాస భూయిష్ఠంగా ఉంటుంది. ఏ రకంగా చూసినా జటిలమే, దుర్గ్రాహ్యమే. డా॥ సుబ్బారెడ్డి గారి వ్యాసాలుమాత్రం దీనికి అపవాదం. వ్యావహారిక భాషలో వ్రాయబడిన వీరి వ్యాసాలు సామాన్య పాఠకునికి కూడా అభిరుచి కలిగించేటట్లు, ఆసక్తిని పెంచేటట్లు ఉన్నాయి. ప్రాచీన సాహిత్యానికి సంబంధించిన విషయమైనా, ఆధునిక సాహిత్యానికి సంబంధించిన విషయమైనా, సహజమైన, అందమైన, రుచికరమైన వాడుక భాషలోచెప్పబడింది. ఇది అందరికీ చేతనయ్యే పనికాదు. శ్రీ మాన్ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారి తర్వాత సాహిత్య విషయాలను అంతఅందంగా చెప్పగలిగినవారు ఒక్క సుబ్బారెడ్డిగారే ఏమో అనిపిస్తుంది. 'ఆప్త వచనం'లో ఆచార్య తిమ్మావజ్ఝల కోదండరామయ్య గారు చెప్పినటు గా డా. మద్దూరి సుబ్బారెడ్డిగారి 'వీరి వ్యాసాలు మలయమారుతంలా, మల్లెపూల పరిమళంలా, మగువచేతి గాజుల గలగలలా, గలగల పారే సెలయేరులా, వీణాతంతులు మోగినట్లుగా— హాయినీ, ఆనందాన్నీ డెందాలకి అందిస్తాయి, అలరిస్తాయి. అలా అవి హాయిని ఇవ్వగలగడానికీ, అలరించగలగడానికీ కారణం వారి భాషాశైలి. అవి చదువుతున్నప్పుడు ఏ కథనో, ఏ నవలనో చదువుతున్నటు ఒక భావనా, ఒక అనుభూతీ కలుగుతుందే తప్ప, ఒక సాహిత్య విమర్శ వ్యాసం చదువుతున్నట్టే అనిపించదు !'

'స్వాతంత్ర్యోదయ కవిత్వం ప్రారంభదశ' అనే వ్యాసంలో కొన్ని గేయాల శీర్షికలు ('The cry of mother India', 'The Salvation of India' ఆంగ్లంలో ఇవ్వడానికి గల కారణం తెలియడంలేదు. ఈ వ్యాస సంకలనంలోని కొన్ని శీర్షికలు చూస్తుంటే వాటి యితివృత్తాలు అభిన్నములేమో అనే అనుమానం కలగడానికి అవకాశం వుంది: 'దేశభక్తి కవిత్వం — స్వాతంత్ర్యోద్యమ కవిత్వం—సమరకవిత' ఈ మూడు వ్యాసాలలో ప్రతిపాదింపబడిన విషయాలూ ఒకేరకమైనవి అని అనిపిస్తుంది బాహ్యదృష్టికి. స్వాతంత్ర్యోద్యమం, సమరం అనేవి రెండూ దేశభక్తిలోని భాగాలే కదా! అలాగే 'జాషువా కవితాశయాలు', 'అస్పృశ్యతా నిరసనకవిత్వం' అనే రెండు వ్యాసాలూ ఒకేలాగ కనబడతాయి. మాలవాండ్రపాట', 'గబ్బిలం' మొదలైనవి పై వ్యాసాలలో పునరుక్తమవడానికి విషయ సాదృశ్యతయే కారణం కావచ్చు.

'ఆశ్రమవాసపర్వ సమాలోచన'లో 'కవి' పరిశీలనాశక్తినీ, లోకజ్ఞతనూ మెచ్చుకున్నారు వ్యాసకర్త. ఆ కవి తిక్కనా? లేక వ్యాసుడా? అనేది స్పష్టం చేసివుంటే బాగుండేది. ఉదాహరించిన సన్నివేశం లేదా వర్ణన సంస్కృత భారతంలోనేవుంటే అది తిక్కన ప్రజ్ఞ ఎలా అవుతుంది ?

'మా. పల్లె'లోని మాండలిక పదాలను అకారాదిగా కూర్చి, వాటికి ఆ నవలలోని ప్రయోగాల ఆకరాలు ఇచ్చివుంటే ప్రామాణ్యం ఇంకా బలంగా ఉండేది.

'సమరకవిత' వ్యాసంలో బుగ్వేదంలోని భాగాన్ని ఆంగ్లంలో ఉదాహరించడం—శ్రోతియుడికి సూటు తొడిగినట్టుంది! 'జాతియుద్ధం చేస్తుంటే కవి ముద్దులను వర్ణిస్తాడా?' మొదలైన దాశరథిగారి మాటలకు ఆధారాలు చూపలేదు. 1945–49 నాటి తెలంగాణా పోరాట కవితలను మరికొంచెం విస్తరించి వుంటే బాగుండేది. ఆ విప్లవంలో దాశరథి, కాళోజీ మొదలగు కవులు నిర్వహించిన ప్రముఖపాత్రను విస్మరించడం సమంజసం కాదు. చైనా, పాకిస్తాన్ దురాక్రమణలతోపాటు మొదటి–రెండవ ప్రపంచ మహాసంగ్రామాలు, బంగ్లాదేశ్ విమోచనోద్యమం, ఆధునిక నక్సలైట్ ఉద్యమం మున్నగు సందర్భాలలో పుట్టిన సమరకవితలను కూడా స్పృశించివుంటే ఈ వ్యాసం ఇంకా నిండుగా ఉండేది. తిలక్ రచించిన సైనికుని ఉత్తరం', 'టు లాన్', 'వెళ్లిపొండి! వెళ్లిపొండి' అనే గేయాలు రెండవ ప్రపంచ యుద్ధానికి సంబంధించినవే, అలాగే 'అమ్మా! నాన్న ఎక్కడికి వెళ్లాడు?' అనే గేయం 1965 పాకిస్తాన్ దురాక్రమణకు సంబంధించిన అత్యుత్తమగేయం. ఇవి రెడ్డిగారి దృష్టికి వచ్చివుండవలసింది.

'స్వాతంత్ర్యోద్యమ కవిత్వం — ప్రారంభదశ', 'తెలుగు సాహిత్యంలో రాజనీతి', 'ఆశ్రమవాసపర్వ సమాలోచన' అనే మూడు వ్యాసాలు తప్ప, తక్కిన వన్నీ సంక్షిప్తంగా ఉన్నాయి. వాటికి కొంచెం విస్తరణ అవసరమని తోస్తోంది. అథోజ్ఞాపికలు

వ్యాసాల చివర ఇవ్వడంకన్నా ఏ పుటలోనివి ఆ పుటలోనే ఇస్తే ఆకరాలు చూడదలచే పాఠకులకు మిక్కిలి అనుకూలంగా ఉంటుంది.

పైన చెప్పినవన్నీ ఆ వ్యాసాలకు మెరుగులు దిద్దే ఆప్త సూచనలేకాని వ్యాసకర్త లోపాలు ఎంత మాత్రం కానేరవు. ఈ 'సాహిత్య వివేచన' ఆబాలగోపాలాన్నీ ఆనందింపజేస్తుందనీ, విద్యార్థులకు ఉత్తమ సాహిత్య వివేచనాశక్తిని ప్రసాదిస్తుందని, వారిని ప్రాచీన సాహిత్యంవైపు మళ్లిస్తుందనీ ఘంటాపథంగా చెప్పవచ్చు.

తెలుగు సాహిత్యంలో అంతో ఇంతో అభిరుచీ, ప్రవేశమూ వున్న ప్రతి వ్యక్తీ తప్పక చదవవలసిన పుస్తకం 'సాహిత్య వివేచన'. ఇంతమంచి పుస్తకాన్ని రచించిన డా॥ మద్దూరి సుబ్బారెడ్డిగారు విద్వత్సంస్తవనీయులు!

— 'ఫణీంద'.

## భక్త సుధన్వ

(నాటకం)

(రచయిత: శ్రీ రెండుచింతల లక్ష్మీనరసింహశాస్త్రి. ప్రచురణ: రాజ్యలక్ష్మీ పబ్లిషర్స్, ఆకునూరు, కృష్ణాజిల్లా. డెమ్మీ $\frac{1}{8}$ సైజులో 46+8 పుటలు. వెల: రూపాయిన్నర.)

ఇది ఆరు అంకాల పౌరాణిక నాటకం. జైమిని భారతంలోని ఒక ఘట్టాన్ని ఆధారంగా చేసుకొని రచయిత ఈ నాటకం రచించినారు.

కురుక్షేత్ర యుద్ధానంతరం ధర్మరాజు అశ్వమేధం చేయడానికి నిశ్చయించి, యాగాశ్వాన్ని విడిచిపెట్టి దాని వెంట అర్జునుని సైన్య సమేతునిగా పంపుతాడు. ఆ అశ్వాన్ని చంపకాపురపురాజైన హంసధ్వజుడు పట్టి బంధిస్తాడు. ఈ విషయం తెలిసి అర్జునుడు హంసధ్వజుడివద్దకు దేవశర్మ అనే దూతను పంపించాడు. హంసధ్వజుడు పాండవదూతతో పరుష వచనాలు చెప్పి, యుద్ధభూమిలో అర్జునుణ్ణి ఎదుర్కొంటామని చెప్పి పంపుతాడు.

ఆ తర్వాత హంసధ్వజుడు అనుమతి లేనిదే తన రాజ్యంలోని ఏ పురుషుడూ సైన్యంలో చేరక ఇంట్లో ఉండకూడదని శాసిస్తాడు. అట్లా ఎవరైనా యుద్ధంలో పాల్గొనకపోతే వారిని సలసలకాగే నూనెలో పడవేయిస్తానని ప్రకటిస్తాడు. ఇది ఇట్లా ఉండగా, హంసధ్వజుని కుమారుడైన సుధన్వుణ్ణి, అతని భార్య ప్రభావతి తన కోర్కె తీర్చనిదే యుద్ధానికి పోకూడదంటుంది. సుధన్వుడు చేసేదిలేక సరేనంటాడు.

రాజాజ్ఞను అతిక్రమించిన సుధన్వుణ్ణి నూనెకొప్పెరలో వేసినా, అతడు తన విష్ణుభక్తి మహిమచేత బ్రతికి బయటపడతాడు. ఇంతలో హంసధ్వజుని వద్దకు వెళ్లివచ్చిన దూత చెప్పిన విషయాలు విని అర్జునుడు తన సైన్యాన్ని యుద్ధానికి సిద్ధంకండంటాడు. సుధన్వుడికీ ప్రద్యుమ్నుడికీ ఘోర యుద్ధం జరుగుతుంది. ప్రద్యుమ్నుడు సుధన్వుడి ధాటికి ఆగలేకపోతాడు. తర్వాత అర్జునుడు కృష్ణుని సాయంతో యుద్ధంలో సుధన్వుణ్ణి చంపగా, అతని తేజం కృష్ణపరమాత్మలో లీనమౌతుంది.

శ్రీకృష్ణుడు హంసధ్వజుడికి జనన మరణాలు జీవులకు సహజమని నచ్చజెప్పి అతడి చేతిని, అర్జునుడి చేతితో కలుపుతాడు. తన ఆరుగురు కొడుకులనూ కోల్పోయిన హంసధ్వజుడు అర్జునాదులను, కృష్ణుణ్ణి తన యింట ఆతిథ్యం పొందడానికి ఆహ్వానిస్తాడు.

స్థూలంగా 'భక్తసుధన్వ' నాటకం కథ ఇది.

పౌరాణికమైన ఇతివృత్తాలు కల నాటకాలు ఈ మధ్య అంతగా రావడంలేదు. ఒకప్పుడు వచ్చిన పౌరాణిక నాటకాలలోవలె ఇది కూడా గ్రాంథిక భాషలో గ్రథితమైనది. పద్యాలు, పాటలు (?) కూడా పుష్కలంగా ఉన్నాయి.

సాధారణ సంభాషణలకు అంతగా సరళంకాని గ్రాంథికాన్ని ఉపయోగించడంవల్ల నాటకం ఎబ్బెట్టుగా ఉండక తప్పలేదు.

'ప్రభావతి: ...'ప్రత్యాలీఢపాదుండై కుసుమశరుండు లతాకుడుంగము చాటుననుండి పరమేశ్వరునిపైనికుశరాసనంబు నెక్కువెట్టునట్టి చిత్రంబు గాంచిన నన్ను విడనాడిపోవుటకు మీకు గాళ్లెట్లు వచ్చును? పురుషపుంగవా! ప్రథమోద బిందువుచే చూలుధరించిన సారంగాంగనకు సాటిరాగల తీరున నన్ను మీ రనుగ్రహింప వేడెదను. రండు ఈ హంసతూలికాశయనంబుపై మీ రవవిష్టులుగండు...మారసుందరాకారా! గమనపరిశ్రాంతితేర నీ తాలవృంతంబుచే నాకింత తడవు విసరుదునా?'

'సుధన్వుడు : 'దేవీ ! నవయౌవనముచే ప్రకృతి యంతయు ఖలకించుచున్న కాలమున నీ కోరిక సమంజసమైనదే. కాని...నా హృదయమున వేరొండు విచారము నెలకొనియున్నది.'

ఇట్లా మాట్లాడుతున్న పాత్రలతో నాటకంలో వాస్తవ వాతావరణం కల్పించడం చాలా కష్టం అనుకొంటాను.

ఆధునిక నాటక రచన ఇటీవల ఎంతగానో పురోగమించింది. మైళ్లపొడుగు వచనాలతో సాగే స్వగతలూ, ప్రక్కన ఇంకొక పాత్రఉన్నా ఒకపాత్ర అటుతిరిగి 'అపహరించి' అనేమాట ఉన్న ధైర్యంతో తనలోతాను మాట్లాడుకోవడాలూ, వస్తుకాల స్థలాదులలో అనైక్యతను పాటించడాలూ ఆధునిక నాటకాలలో కనిపించవు.

సందర్భాన్నిబట్టి సాగే నాటక రచన ఆనందం కలిగిస్తుంది. పానుగంటి వారి వంటివారు గ్రాంథికంలో నాటకాలు వ్రాసినా, అవి మెప్పుపొందడానికి వానిలోని సందర్భశుద్ధి ఒక కారణం.

అట్లాగే పాత్రధారి గొంతు సవరించుకొని, హార్మోనిస్టుకు ఈలవేసి సంభాషణతో మధ్య గొంతెత్తి పద్యం 'పాడి', ప్రేక్షకులు కోరితే మరొక సారి పాడవలసిన ప్రమేయం ఆధునిక నాటకాలలో అరుదుగానైనా కనిపించదు.

మరి ఈ నాటకకర్త పాత ఫక్కీలోనే పద్యాలు గుప్పించినారు ఈ నాటకంలో—

చెట్టంతకొడుకు చచ్చి, పుట్టెడు దుఃఖంతో ఉన్న హంసధ్వజ మహారాజు అతని మంత్రి పద్యాలతో ఊరడించడమూ, హంసధ్వజుడు పద్యాలలోనే దుఃఖించడమూ ఉన్నాయి. ఇటువంటి ఘట్టాలలో పద్యాలు భావస్ఫూర్తిని, రసస్ఫూర్తిని ఎంతవరకు కలిగిస్తాయో చెప్పలేము. సర్వసామాన్యంగా మాటలలో చెప్పడానికి వీలైన వానిని పద్యాలలో చెప్పడం అనవసరమనిపిస్తుంది.

రచయిత నాటకంలో ఒకచోట ప్రద్యుమ్నుడి నోట ఈ పద్యం పలికించినారు :

'ఈవెరుగవె మును బాణుని
చేవను తెగటార్చి నేను చేపట్టితి ర
క్షోవిభు పుత్రిక, నేడా
ధీవిభవము కోలుపడిన ధృతితే దనకే.'

ప్రద్యుమ్నుడు బాణాసురుణ్ణి తెగటార్చినట్లుగాని, అతని పుత్రిక ఉషను పెళ్లాడినట్లుగాని మన పురాణాలలో కనిపించదు. మరి రచయితకు ప్రద్యుమ్నుడికీ, అనిరుద్ధుడికీ మధ్య తేడా తెలియకపోవడమే వింతగా ఉంది.

కొన్ని నాటకాలు ప్రదర్శించడానికి పనికి వస్తాయి; మరికొన్ని చదువుకోడానికే పనికివస్తాయి. ఈ నాటకం ఈ రెండు కోవలలోకీ రాకపోవడం విచారకరమైన విషయం.

—శ్రీ పి. ఎస్. గోపాలకృష్ణ.

## ఇదీ ఆంధ్రం ! ఇదీ భారతం !

(రచన : 'నగారా', వెల : రు 2–50 లు. జనతా ప్రజాతంత్ర ప్రచురణలు, విజయవాడ–2.)

150 పేజీల సుదీర్ఘమైన ఈ వచన కవితా వ్యాసం – గాంధీ, ఇందిరాగాంధీల దుర్గంధరాజ్యంలో, విచ్చలవిడిగా పెచ్చరిల్లిపోతున్న విచ్ఛిన్న ధోరణులు మొత్తం భారతావనితోపాటు విశాలాంధ్రలో పెట్టిన ఆరనిచిచ్చు నా గుండెల్లో తీరని వేదన రగుల్కొల్పింది. ఆ ఆవేదన ఫలితమే' నన్నారు, రచయిత 'నా మాట'లో. జాతీయాహంకారానికీ, ప్రాంతీయ దురభిమానానికి అతీతులనీ, నిజమైన కమ్యూనిస్టు అనీ శ్రీ కె. వి. రమణారెడ్డి పరిచయం చేస్తున్న ఈ కవి రచన 'జాతీయ, అంతర్జాతీయ రాజకీయాల అవగాహన, సమన్వయాలతో కూడిన భారత ఉపఖండ రాజకీయాల సమగ్ర సంక్షిప్త, శాస్త్రీయ మార్క్సిస్టు శబ్దచిత్రం' అన్నారు ప్రచురణ కర్తలు.

అందుచేతనే ఈ రచనపై సమగ్ర, సంక్షిప్త పరిశీలన విప్లవావేశంతో పొంగులు వారుతున్న యువలోకపు సిద్ధాంత, రాజకీయ అవగాహనకు ఉత్తేజం కలిగించగలదనీ, అవసరమనీ నా భావం.

దీనిలో ఆంధ్రదేశ చరిత్రా, భారతదేశ చరిత్రా కూడ ఒక వికృత అనభిజ్ఞ దృష్టిలోంచే వ్రాయబడ్డాయనడానికి 'నా మాట'మంచి వుదహరించిన 'గాంధీ, ఇందిరా గాంధీల దుర్గంధరాజ్యంలో' అన్నవాక్యం ఒక్కటే చాలు. ఇది అలంకారంగా వాడిన పదంకాదు. 11 వ పుటలో కవి ప్రజావంచకుడు గాంధీ అంటారు. గాంధీ కదిలించిన ప్రజా వుద్యమాలూ, వానిలో ప్రజ్వలించిన జాతీయ విముక్తి పోరాటాలూ దేశంలో స్వతంత్ర

ప్రభుత్వ నిర్మాణానికి దారితీసే యనేదితప్ప ఆయన రాజ్యాధికారంలో ఒక్క క్షణంకూడా వుండలేదు.

అలాగే—ప్రతితాత్విక దృక్పథానికి వెనక ఆ బోధకుని వర్గ స్వభావం వుంటుంది. వర్గాలూ, వర్గ స్వభావాల అవగాహన మనకు ఏర్పడింది 19 వ శతాబ్దపు చివరి భాగంలో. అయినా, చరిత్ర పుట్టినప్పటినుంచి ఆదే జరుగుతూంది. తాత్విక దృక్పథానికి వర్గస్వభావం వుంటుంది గనక, దానిని బోధిస్తున్న ప్రవక్త ఆ ప్రత్యేకవర్గ భిన్నులను వంచించే వుద్దేశంతో బోధించేడనడం మార్కిస్టు అవగాహనలకు తాటాకులు కట్టడం అవుతుందేగాని దానిని సమర్థించడం అనిపించుకోదు.

రచయిత చారిత్రక దృష్టి పరిపక్వతకు ఈ 'మెరుకుపెట్టే తెలుసుకోవచ్చు. ఆంధ్రదేశ చరిత్ర పరిణామాలయెడకూడా వీరి అభిప్రాయాలు అమార్క్సీయ దృక్పథంతోనే నడిచాయి. ఆంధ్రప్రదేశ్‌లో సాగిన విభజనోద్యమాలకు మూలం నాయకుల పదవీ వ్యామోహమే గాని, 'పట్టలేదెవరికి ఉభయ ప్రాంతాల వెనుకబాటు' అన్నారు.

'..పెట్టుబడిదార్లే, ఆ భూస్వాములే పెంచింది ఆంధ్ర తెలంగాణా ప్రజల మధ్య పొరపొచ్చాలు... ఏనాడూ తెలుగుజాతి సమైక్యతకు పాటుపడనివాళ్లు... తమ పాపాలను కప్పిపుచ్చుకొనేందుకు ప్రాంతీయ ద్వేషాల విషాలు పెంచుతున్నార'ని స్పష్టంగా రోగనిదానం చేశారు.

తెలుగుజాతి సమైక్యత అవసరమనీ, ప్రాంతీయ ద్వేషాలు విషప్రాయమనీ ఇంత స్పష్టమైన అభిప్రాయం కనబరచిన రచయిత ఆ విషాన్ని నిరాకరించడంలోనూ, సమైక్యతను కాపాడడంలోనూ అచంచల విశ్వాసం కనబరచాలి. ఆంధ్రలో కమ్యూనిస్టులు చేసిన పని అది. ప్రవాహానికి ఎదురొడ్డి నిలబడి ఆ విషయంలో తమ అచంచల విశ్వాసాన్ని వారు కనబరిచారు.

కాని ఈ రచయిత అభిప్రాయం తద్భిన్నం. తమ విశ్వాసానికే భిన్నం.

'అసలు శత్రువును కనిపెట్టలేని నీవు అభిమానిస్తున్నావు దోపిడీగాళ్ల నాయకులనె' అని తెలుగు ప్రజల అవివేకానికి చింతపడుతూ 'ఏం సాధించావిందాకా సమైక్యాంధ్రలో, విశాలాంధ్రలో, ఏం బావుకుంటా వికముందు ప్రత్యేకాంధ్రలో, తెలంగాణలో?' అని ప్రశ్నిస్తున్నారు. సమైక్యాంధ్ర, విభక్తాంధ్ర మధ్య ఆయన దృష్టిలో తేడా లేదు. కనకనే 'నీ జై ఆంధ్ర, నీ తెలంగాణాలు మాత్రమే నీకు జయం పలుకుతాయనికదూ నీ ఆశ. అయితే విడిపో, తక్షణం వేరుపడు. అందుకోసం సిద్ధపడు ఎంత త్యాగానికైనా' అంటున్నారు. ఈ రచయిత ఉద్బోధతో పనిలేకుండానే తెలుగు ప్రజ తమకేదో ఒరుగుతుందనే ఆశతో రెండు వేర్పాటు వుద్యమాలలోనూ ఎంతో త్యాగం చేశారు. ఎందరో ప్రాణాలే ఇచ్చారు.

ఆ చేసిన త్యాగం త్యాగమేనా? అది వారికి లాభకరమేనా? ఆంధ్ర కమ్యూనిస్టులు కాదన్నారు. అతి తీవ్రమైన ప్రచారం చేశారు. ఎందుచేత? ఉద్యమం గురించీ, దాని నాయకత్వం గురించి వారు ఇదే విశ్వాసం తెలిపేరు. అయితే, రచయిత తాము చెడ్డపనిగా భావించినదానికోసం, దుర్మార్గులుగా వర్ణించిన నాయకత్వంకోసం ఎన్ని త్యాగాలయినా చెయ్యమంటున్నారు, ప్రజల్ని.

నిజమైన కమ్యూనిస్టుగా వర్ణించబడ్డ వ్యక్తి, ఈ రచయితకీ, ఆంధ్ర కమ్యూనిస్టులకీ ఈ భేదం ఎందుకు వచ్చింది?

పోరాటాలు, వుద్యమాలు అన్నీ మంచివికావు. అపరిహార్యాలు కావు. అన్నీ చెడ్డవికావు. పరిహార్యాలు కావు. అభివృద్ధికి, ప్రజాక్షేమానికి తోడ్పడేవి సమర్థనీయాలు. ఇతరులను దోచుకొనేందుకూ, అణచిపెట్టేందుకూ, సమాజాన్ని తొక్కిపెంచేందుకూ, వెనక్కి నెట్టేందుకూ చేసే ప్రయత్నాలూ, పోరాటాలూ వ్యతిరేకించాలి.

స్థూలంగా కమ్యూనిస్టుల అభిప్రాయం అది. జర్మను ప్రజను సెంటదెచ్చుకొన్నా హిట్లరును శత్రువునుగా చూసింది అందుకే. ఇరుగు పొరుగు దేశాల హద్దుల్లో తనకు రావలసిన భూభాగాలున్నాయంటూ కవ్వింపులతో కాలక్షేపం చేస్తున్న మావో వెనక చైనా ప్రజలున్నా ఆయనను అమిత్రంగా పరిగణించేది అందుకే. పరిమితములే అయినా భూముల గరిష్ఠ పరిమితులను విధించే చట్టాన్ని భగ్నంచేసే లక్ష్యంతో, పదవీ కాంక్షాపరుల్ని శిఖండుల్నిగా వుపయోగించుకొని, ప్రజల అమాయికత్వాన్ని, వారి కష్టాల్ని

వుపయోగించుకొని ఆంధ్రప్రదేశ్‌లోని భూస్వాములు ప్రాంతీయ విభజనోద్యమాలు రెచ్చగొట్టారనే దానిని కమ్యూనిస్టులు తమ ప్రాణాలు వొడ్డి అడ్డగించేరు. విశాలాంధ్రలో ప్రాయశంతో తమ పని ముగిసిందనుకోలేదు. వారిని ఏనాడూ అభిమానించనివారు కూడా అంగీకరించినదది.

కాని, ఈ రచయిత పోరాటం అనేది ప్రధానంగా భావిస్తారనకోవాలి. అది ఎవరు తెచ్చినా, నిగూఢ లక్ష్యాలు ఏవైనా ప్రజలు నలుగుర్తూ చేరింది పోరాటం. 'అందుకనే వాళ్లలా నిరసించి, నీ వేర్పాటు వుద్యమాలను శత్రువర్గాల పాలిండ్లవలల పాలుగానీను నిన్ను...విప్లవ జోహార్లర్పిస్తున్నదినీ ప్రతిఘటనకు నా పితూరీపెన్' అంటారు.

ప్రజా శత్రువులు నడుపుతున్న వేర్పాటు వుద్యమాలలో ప్రజలను సర్వత్యాగాలూ చేయమంటున్న ఈ కవి దృష్టిలో శత్రువర్గం ఏది?

రచనలో పలుచోట్ల భూస్వాములు బడా పెట్టుబడిదార్లు అంటూ చెప్తూవచ్చినా ఆ వర్గాల రాజకీయపార్టీ కాంగ్రెసుమీదా, దానికి నాయకత్వం— ఉద్యమాలలోనూ, పరిపాలనాధికారంలోనూ కూడ— వహించిన వ్యక్తులమీదా తమ శత్రుభావాన్ని కేంద్రీకరించేరు. ఫలితంగా జాతీయోద్యమ ప్రగతిని, స్వాతంత్ర్య సాధనను, అనంతరకాలపు ఆర్థిక, రాజకీయ, సామాజిక పరిణామాలను, దేశీయ, అంతర్జాతీయ విధానాలను వక్రదృష్టిలో తప్ప చూడలేక పోయారు.

చరిత్రను నడిపేది మన వ్యక్తిగత ఆలోచనలు కాదు. భౌతిక పరిస్థితులుగాని అని కమ్యూనిస్టుల అభిప్రాయం. (మనిషి ఆలోచనలకూ భౌతిక పరిణామాలకూ గల అంతస్సంబంధాన్ని వొప్పుకొంటూనే.) అందుచేతనే మన దేశ స్వాతంత్ర్య పోరాటంలో కార్మిక కర్షకుల పాత్ర వుండవచ్చు. సైనిక విభాగాల ఉజ్వల పోరాటాల పాత్ర వుండొచ్చు. కమ్యూనిస్టుపార్టీ, తదితర వర్గ పార్టీల పాత్ర వుండొచ్చు. కాని స్వాతంత్ర్యం వచ్చేసరికి జాతీయ బూర్జువా వర్గం అధికారంలోకి వచ్చింది. చారిత్రక పరిస్థితులవి. ఆ వర్గాన్ని తోసేసి అధికారం తీసుకోగల స్థాయికి మరో వర్గం పెరగలేదు. కనక **'లాలోచీ'** అన్నా 'సవామేహ సంకరజంట **శిశువులు'** **ఉదయించా**యని భారత, పాకిస్తాన్‌ల ఆవిర్భావాన్ని నిరసించినా మన అజ్ఞానజనిత ఉన్మాదం బయటపడుతూందే తప్ప శాస్త్రీయ మార్క్సిస్టు అవగాహనకాదు. ఇతర వర్గాలు తయారుగాలేవుగనక జాతీయ బూర్జువావర్గం కూడా అధికారం తీసుకోకుండా బ్రిటిష్‌వాళ్లనే వుండమనాలనీ, వుండమంటూరనీ మాత్రమే భావిస్తున్నారా కవి? అలా జరగదు. కారణం బ్రిటిష్ సామ్రాజ్యం లేకుండా తన యథేచ్ఛావిహారానికి దేశంలో ఆ వర్గం అధికారం ఏర్పడాలి. ఆ విషయంలో ఆ పార్టీలకూ, వాని వెనుకనున్న వర్గం ప్రజలకూ సమాజంలోని దోపిడి స్వభావం అర్థంఅయ్యే ఆ విధంగా వ్యవహరిస్తున్నారనడం కోడం అతి తెలివి నాపాదించడం. ప్రతి వ్యక్తిలాగే, ప్రతి వర్గమూ తన మంచినే దేశం మంచిగా, లోకం మంచిగా భావిస్తుంది. దానినే వర్గ స్వభావం అంటారు. వర్గం అన్నది చరిత్రగతిలో ఏర్పడుతుంది. అలాగే దాని స్వభావమూను. ఆస్తిని రంజనం అయి కూలిపనికి వెళ్లినమాత్రాన శ్రామికులు కారు. లక్ష రూపాయలు బ్యాంకులోవేస్తే పెట్టుబడిదారు అయిపోడు. ఈ దృక్పథంనుంచి ఆలోచించినప్పుడు గాంధీ, జవహర్, ఇందిరాగాంధీలను వారి రాజకీయ భావాలను నిందించము. నిందిస్తున్నామంటే వారు మరొక విధంగా వ్యవహరించే అవకాశం వుండి, ద్రోహం చేశారనుకోవడమన్నమాట. కమ్యూనిస్టుపార్టీ అలా అనుకోడంలేదు. కాని, ఈ కవికి అటువంటి భ్రమ అంతరాంతరాలలో వుంది. లేకపోతే ఇల్లా వ్రాయరు:— "ఇందిరా విధానాలు సమైక్యత ప్రసవించవు నిజంగా పయనిస్తే రుజుమార్గంలో, నిజం బాటదొరికితీరేదే. సజావైన సామ్యవాద పథంలో నడవగలిగితే జనాన్ని తనవెంట రానేరాదేలాంటితంటా" అనలేరు. సమైక్యత, రుజుమార్గంలాంటి పదాలకు అర్థం అన్ని వర్గాలకూ ఒకేవిధంగా వుండదనేది అల్లా వుండగా 'సజావైన సామ్యవాద పథంలో నడపగలిగితే' అనే ప్రశ్న ఏమిటి? ఆమె సామ్యవాదం గురించి మాట్లాడుతున్నారు గనక మార్క్సిజం వంటబట్టిందను కొంటున్నారా కవి? కమ్యూనిస్టులకు అటువంటి భ్రమ ఏకోశానా లేదు.

జాతీయ బూర్జువావర్గం తాను అభివృద్ధి పొందడానికి దేశంలో పరిశ్రమలను నిర్మించుతుంది. ఆ క్రమంలో కావలసిన మార్పులు తీసుకొస్తుంది.

చదువులు, వుద్యోగాలు, హరిజన, గిరిజన సముద్ధరణాది ప్రయత్నాలు, ప్రణాళికలు, జాతీయం చేయడాలు, భూ సంస్కరణలు, హరిత విప్లవం మొదలయినవేకాదు పోలీసు, మిలిటరీలను పెంచడం, ఎన్నికలు, చట్టాలు ఒకటేమిటి సామాజిక కార్యకలాపాలన్నీ ఆ లక్ష్యం తోనే సాగిస్తుంది. అయితే ఇవన్నీ ఆ వర్గప్రయోజనాల పరిమితుల్నిమించి పెరగనివ్వరు. దానికి వ్యవస్థ స్వరూపమే మారవలసి వుంటుంది. వ్యవస్థ మారితే వీటన్నింటినీ తుడిచి పెట్టబోతున్నావా? లేదు. వీని నింకా ఇంకా విస్తరింపచేయాలి. అంటే రాబోయే సోషలిస్టు వ్యవస్థ కార్యకలాపాల అంకురాలు ఈనాటి సమాజంలో వున్నాయి. ఈ సమాజమే వానిని సృష్టించింది. మన లక్ష్యం వానిని ప్రోది చెయ్యడం. అంటే జాతీయ బూర్జువావర్గం సృష్టించే భావి సమాజాంకురాల్ని బలపరచడం. ప్రణాళికా పద్ధతిని, శాస్త్రసాంకేతిక విద్యాభివృద్ధిని, జనరల్‌గా విద్యాభివృద్ధిని, ప్రభుత్వరంగ పరిశ్రమల నిర్మాణాన్ని—ఇలాంటి ఇతరేతర అభ్యుదయాత్మకములైన పనులు తలపెట్టినప్పుడు కమ్యూనిస్టులు జాతీయ బూర్జువా వర్గ ప్రభుత్వాన్ని ఒక వేపున బలపరుస్తారు. రెండో వేపున ఈ సమాజంలో వుద్భుద్ధమయిన నూతన శక్తుల్ని సమీకరించి వ్యవస్థను మార్చడానికి పూనుకొంటారు. ఒక్కటి మరిచిపోకూడదు. ఆ మార్పులో పూర్వ సమాజం తెచ్చిన ప్రతి ఒక్కటీ విధ్వంసం చేయబడదు. ప్రభుత్వరంగ పరిశ్రమలు విస్తరిస్తాయి. వాని కార్యకలాపాలు సంస్కరించబడతాయి. పోలీసూ—సైన్య నిర్మాణం రద్దు చేయబడతాయి. కొత్తగా నిర్మించబడతాయి. ఈ రెంటికీ మధ్యనవుండే వివిధ రంగాలు నూతన వ్యవస్థలోకి వివిధ స్థాయీభేదాలతో సరిదిద్దుకోబడతాయి.

ఈ అవగాహన విస్పష్టంగా లేదు గనకనే, ఇందిరాగాంధి షట్సూత్ర పథకం ఆమోదించినందుకు కమ్యూనిస్టుల్ని 'ఇందిరాచెక్కభజన సంఘం' అని నిందిస్తూ, జనాన్ని ప్రజాద్రోహులకోసం ఆత్మాహుతి కమ్మని ఉద్బోధిస్తున్నారు, కవి.

ఈ అవగాహనలోపం మన దేశ జాతీయ, అంతర్జాతీయ రాజకీయాలు రెండింటా చాల స్పష్టంగా కనిపిస్తుంది.

భారతదేశ పాలకవర్గం స్వాతంత్ర్యానంతరం స్వతంత్ర ఆర్థికాభివృద్ధికి సామ్రాజ్యవాదులు తోడ్పడతారనే భ్రమను ఒక పట్టాన వదులుకోలేదు కాని, క్రమంగా ఉక్కు పరిశ్రమ నిర్మాణంలో, తైలనిధుల అన్వేషణలో, తవ్వకంలో, శుద్ధిలో, విద్యుద్వనరుల నిర్మాణంలో, ఔషధాల విషయంలో సిబ్బందిశిక్షణలో—ఒక్కొక్క రంగంలోనే ఆ భ్రమలు తొలగడం ఆర్థికాభివృద్ధికై సోవియటు సహాయ, సహకారాలు కోరడం, ఆ దేశం వెనువెంటనే అంగీకరిస్తూ ఈనాటివరకు 70–80 బృహత్ ప్రాజెక్టులు నిర్మించి ఇవ్వడం జరిగింది ఇవన్నీ ప్రధానంగా ప్రభుత్వ రంగంలోనిర్మించినవే.

ఒక సోషలిస్టు ప్రభుత్వం బూర్జువావర్గ ప్రభుత్వం ఏర్పడడానికి సాయపడవచ్చునా?—అనే ప్రశ్న రచయిత సోవియటు వ్యతిరేకతకు మూలం. ఆ విధంగా సాయం ఇవ్వడానికి కారణం రెండు దేశాలలోవున్న వర్గాలు ఒకటే కావడమనీ, సామ్రాజ్యవాదుల మధ్యనున్న పోటీ దృక్పథమేననీ నగారా వాదం. ఇది కేవల భ్రమజనితం.

సోషలిస్టు ప్రభుత్వాలు సహాయంచేసేది సోషలిస్టు విప్లవాలకేకాదు. జాతీయ విముక్తి పోరాటాలకూ చేశాయి. చేస్తాయి. విముక్తిపోరాటాలన్నీ ప్రారంభం నుంచీ సోషలిస్టు విప్లవాలుగా వుండలేవనీ, వుండవనీ ఆయాదేశాల చారిత్రక, సామాజిక అభివృద్ధి పరిస్థితుల్ననుసరించి ఆయాదేశాలతో పోరాటాలకు నాయకత్వం వహించే వర్గం, పార్టీ వుంటుందని మార్క్సిస్టులకే కాదు. సాధారణ చారిత్రక దృష్టికలవారికీకూడా అర్థం అవుతుంది.

అందుచేతనే కమ్యూనిస్టుపార్టీ మొదటినుంచీ ''విప్లవం ఎగుమతిచేసే పదార్థం కాదు' అంటూవుంది. రెండోవేపున సామాజికాభ్యుదయంకోసం జరిగే ప్రతి ప్రయత్నానికీ సహాయమూ చేస్తూంది.

బూర్జువా విప్లవం విజయం పొందడం సైద్ధాంతికావసరమేకాదు. దేశంలోని అభ్యుదయ శక్తులకూ, కార్మికులకూ కూడా ప్రయోజనకరమే.

సోవియటు చేస్తున్న సహాయంతో దేశంలో వచ్చిన పారిశ్రామికాభివృద్ధి కార్మిక వర్గం సంఖ్యను, చైతన్యాన్ని, నిర్మాణాన్ని బాగా బలపరచింది. ఆ విధంగా భావిసమాజానికి బాధ్యత వహించగలదని

భావిస్తున్న వర్గం బలపడడానికి అది సాయం అవుతూంది, పరోక్షంగా.

అంతేకాదు. సోవియటు ఇస్తున్న సహాయ, సహకారాలు ప్రధానంగా ప్రభుత్వ రంగానికీ, దాని కవసరమయ్యే సిబ్బంది తరిఫీదుకూ. అంటే రాబోయే సమాజం ఆర్థికంగా నిలుడడానికి కావలసిన పూర్వ రంగం సిద్ధం అవుతూంది.

దీని వుపయోగాన్నిదేశీ బూర్జువా వర్గమే వుపయోగించు కొంటూదంటే తప్పేమిన్నంగా ఎందుకు చేస్తుంది? అదేవర్గ స్వభావంగల సమాజంలో జరిగేవి. అధికారంలోవున్న వర్గాన్ని తొలగించి, మరో వర్గాన్ని—మార్క్సిజాన్ని ఏరూపంలోనైనా నమ్మేవారి దృష్టిలో కార్మికవర్గాన్ని అధికారంలోకి తేవాలనికోరేది, ఆ అన్యాయాన్ని సాధ్యమైనంత అధికంగా సవరించుకోవడమే. అది మన బాధ్యత.

కమ్యూనిస్టులకి, అందులో తన ఆశయాలకు అనుగుణంగా వ్యవహరించేవారికి అధికారం రానిపక్షంలో సర్వనాశంకానీ అనే ధోరణికలవాడు కమ్యూనిస్టుకాడు. అతను చెప్పేవి మార్క్సిజమూ కాదు. ఎవరికి ఏ విశ్వాసాలు ఎవరిమీదవున్నా చెప్పక తప్పనిమాట. 'విప్లవాన్ని ఎగుమతి చేయరాదు'—అని మార్క్సిస్టుల ప్రధాన సూత్రం. మావో వాదుల దృక్పథంవేరు. కనకనే దేశ విచ్ఛిన్నకారులకి ప్రోత్సాహం ఇచ్చి సరిహద్దుల్లో తగవు చావకుండ చూస్తున్నారు. మావో వాదులకు ప్రజాబలం లేదుగనక ఢిల్లీలోగాని, ఏ రాష్ట్రంలోగాని ప్రభుత్వాధికారం తీసుకొలేకున్నారు. వారికి సాయంగా మావో బలాలు రావాలందాం. వస్తాయి. ఢిల్లీలో జాతీయ బూర్జువావర్గ ప్రభుత్వాన్ని తొలగించి ఏ చారుబాబు గ్రూపునో నిలబెడతారందాం. కాని, ప్రజాబలంలేని అది నిలబడగలదా? దానిని నిలబెట్టివుంచడానికి మావో వాద సైన్యం దేశంలో తిష్ఠవేయాలి. పైవారి దాడుల నుంచి రక్షణకుకాదు. దేశప్రజల నుంచి కాపాడడానికే! దానివలన భారతదేశం విముక్తమైనట్లా? తిరిగి బానిసత్వంలో పడ్డట్లా? అందుకే కమ్యూనిస్టులు విప్లవం ఎగుమతిచేసే పదార్థం కాదనడం! మావో పంథాను ఖచ్చితంగా వ్యతిరేకించడమూను.

ఈ విషయంలో రచయిత అమార్క్సీయమైన మావో వాదాన్ని బలపరచడంచేతనే 1965, 1971 లలో జరిగిన భారత, పాకిస్తానుల మధ్య సంఘర్షణలోనూ, 1971 బాంగ్లాదేశ్ విముక్తి పోరాటంలోనూ సోవియట్ యూనియను, మావో చైనాలు అవలంబించిన విధానాల యెడచూపిన అవగాహన చాల అపహాస్యకరంగా వుంది.

భారత, పాకిస్తాన్‌ల ఆవిర్భావం వలసపాలకుల విభజించి, పాలించు విధానానికి దుష్ఫలితం. తరవాత రెండు దేశాల మధ్య తగవులు చావకుండా వుంచడానికీ, ఘర్షణలు పెంచడానికీ సామ్రాజ్యవాదులు ఈనాటివరకూ ఎటువంటి ప్రయత్నాలు చేస్తున్నారో చరిత్రే సాక్ష్యం. ఇందులో తప్పెవరిదనే శశవిషాణాన్వేషణకు బదులు తగవులు సమసి, శాంతి ఏర్పడడం రెండు దేశాలకూ, ప్రజలకూ కూడ ముఖ్యం. రెండింటా ఏర్పడినది బూర్జువా ప్రభుత్వాలే గనక వాని మధ్య యుద్ధాలు అవి బలహీనపడడానికి తోడ్పడతాయనుకోవడం అజ్ఞానజనితం. యుద్ధంలో చచ్చిపోయేవి సామాన్యజనం. యుద్ధం పేరున ముందు నాశం అయ్యేవి ప్రజలు సంపాదించుకొన్న ప్రజాతంత్ర హక్కులు. యుద్ధం సాగించడానికీ, తర్వాత విధ్వంసం పూడ్చుకొని పునర్నిర్మాణం జరపడానికీ ధనం వసూలు చేసేది ప్రజలనుంచి. రెండోవేపున యుద్ధ కంట్రాక్టులు, రాయితీలు, ధరల పెరుగుదలలతో బాగుపడేది ధనికవర్గం. దేశం విధ్వంసం అవుతుంది. ప్రభుత్వం బలపడుతుంది. యుద్ధ విధ్వంసంలోంచి సోషలిస్టు విప్లవం రావాలంటే దానికి కావలసిన చారిత్రిక పరిస్థితులుండాలి. దేశాలమధ్య యుద్ధాలు లేకుండానే సోషలిస్టు విప్లవం క్యూబాలో వచ్చింది. ప్రజాతంత్ర విప్లవం పోర్చుగల్లులో వచ్చింది. గ్రీసులో వచ్చింది. ప్రజాతంత్రం చిలీలో నాశనం చేయబడింది. అందుచేత యుద్ధాలకూ, సోషలిస్టు విప్లవాలకూగల సంబంధం తప్పుడు అంచనా. దేశాల మధ్య శాంతిస్థితి ప్రజకు లాభం.

ఈ అవగాహన రచయితకు మాత్రం లేదా? వుంది. ఒక విధంగా.

1971 పాకిస్తాన్, భారత సంఘర్షణల అనంతర ఫలితాలను వర్ణిస్తూ (119—120 పుటలు) కవి వ్రాసిన వాక్యాలే ఇందుకు వుదాహరణ.

గెలిచింది భారత దోపిడీ స్వరాజ్య లక్ష్మి
ఓడింది పాక్ దోపిడీ ఆజాద్ బీబీ
వాడి, వడలి సుడులు తిరిగి పోతున్నది

ఉభయదేశాల బడుగు ప్రజలు
నిజానికోడిపోయింది
ఉపఖండంలోని ఇరుపక్షాల ప్రజలు.

యుద్ధ ఫలితాల ఇటువంటి దృష్టిగల కవి తాష్కెంట్ సంధియెడ వ్యతిరేకత ఎందుకు? సిద్ధాంతాలు చదవడమేగాని అవగాహనకురాని లోపం అది.

పాకిస్తాన్, భారతదేశాలమధ్య శాంతి సంధి కుదర్చడానికి ప్రయత్నించిన సోవియటు కృషియెడ కవి అభిప్రాయం వినండి.

''మహా రష్యన్ డాక్టరు సాధించాడు శాంతి
సంధి అతగాడికి పట్టుకొంది ఉప
ఖండంలో పలుకుబడి రంధి.''

అలాగే రెండు దేశాలమధ్య తగవులు బ్రతికించి వుంచడానికీ, పెంచడానికీ మావో చైనా చేసిన ప్రయత్నాలను కవి సమర్థించేరు.

30 లక్షలమంది బాంగ్లాప్రజలను చంపి, కోటి మందిని దేశంలోంచి తరిమివేసిన యాహ్యాఖానును మావో వాదులు బలపరిచేరు. బాంగ్లాప్రజ తిరుగుబాటుకు సంకేతంగావున్న ముజీబు వారి ద్వేషానికి ప్రతీక అయ్యేడు. ఈ దృక్పధాన్ని కవి మాటలలోనే చెప్తే అర్ధజ్ఞానం మనిషి ఆలోచనలను ఎంత వక్రమార్గానికి పట్టిస్తుందో అర్థం అవుతుంది.

ముజీబుది --

''పాజావంగబంధు, నిజానికతడు
నిఖిల ప్రాగ్వంగ రాబందు బంధు''...

.. ఆగస్టు 42 గాంధీలా పోజుపెట్టేడు. గుట్టుగా అరెస్టయి కూర్చున్నాడు. ఈజీగా బాధ్యతలనుంచి తప్పుకున్నాడు. బూర్జువా నాయకులతీరే అంత. వర్గ స్వార్థతంత్రాల, కుతంత్రాల బ్రతుకే అంత—'

కాని, యాహ్యా హత్యాకాండకు కుమ్మక్కుగా హిమాలయ సరిహద్దులలో తన గొర్రెలను తోలుకు పోయారంటూ అసత్యవాదాలతో అల్టిమేటమ్ జారీ చేయడంలో చైనా వుద్దేశం ఏమిటి?

''బాంగ్లాప్రజల యజమానులు
మాటంకాదు చైనాధ్యేయం
నిజమైన ప్రజాపోరాటానికి
అవకాశం చైనా పరమావధి
అది ఖండించలేదు యాహ్యా
పైశాచికత్వాన్ని బహిరంగంగా
అది బలపరచలేదు బంగ్లా ప్రజా
పోరాటాన్ని నిర్ద్వంద్వంగా,
అయితే అది అదుపుచేయ చూసింది
ఇండియా విస్తరణ వాదాన్ని'

అంతేకాదు. ఆనాడు తన 7 వ నౌకా సైన్యాన్ని బంగాళాఖాతంలోకి తెచ్చి, అమెరికన్ పౌరుల్ని వెలకి తీసుకురావడం పేరుతో ఉపఖండంతో సాగుతున్న యుద్ధంలో తానూ చేయి దూర్చబోయిన అమెరికాను గురించి కవి అంచనా వినవలసిందే.

'.. అది ప్రయోగించినా వత్తిళ్ళూ, బెదిరింపులూ
నెయ్యానికే దాని తాపత్రయమంతా,
...కసకసే నేనున్నా నీ సవతి
నెగసి తప్పనున్న అమెరికా
తీరా పక్కకు జారుకుంది సమయానికి.'

ఇటువంటి రాజకీయ, చారిత్రక అవగాహనతో భారత, ఆంధ్రప్రదేశ్ల చరిత్రను వివరించబోయిన కవి—

'ఎప్పటి కాలిట్టేట్టే
తప్పల తడకల నడకే
అయినా ఫికరులేదు తెల్ల కమ్యూనిస్టులకు—
కట్టారుజట్టు ఇండికేటు కాంగ్రెసుతో''

అనగలగడంతో ఆశ్చర్యం లేదు.

ఇదీ ''విప్లవావేశంతో పొంగులు వారుతున్న తెలుగు యువ లోకపు సిద్ధాంత రాజకీయ అవగాహనకు ఇతోధికంగా ఉత్తేజం కలిగించగలద''ని ప్రచురణ కర్తలు విశ్వసించిన గ్రంథం.

—''అవంతి''




దర్శకుడు కె.ప్రత్యగాత్మ  నిర్మాతలు కోగంటి కుటుంబరావు వజ్జ సుబ్బారావు

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7 Thambu chetty Street, Madras-600001. Editor: S. Radhakrishna.

BCI 1)

వీనస్ మహీజా పిక్చర్స్

# యశోద కృష్ణ

ఈస్ట్‌మన్ కలర్

నిర్మాత

సి.హెచ్.ప్రకాశరావు

దర్శకత్వం

సి.యస్.రావు BA(L.R)





నవయుగ

మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA104M116 |
| పుస్తకం పేరు | భారతి |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 81 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | navya |
| స్కాన్ చేసినది | HEMA |
| పరీక్ష చేసినది | |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |